అపరాధ పరిశోధన అనుబంధం—150

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందిస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

19/5/86

## శిక్ష

రచన: వసుంధర

## దెయ్యం పిలుస్తోంది!

రచన: సుంకరి రాంప్రసాద్

## అగ్నినేత్రాలు

రచన: వి. యస్. రావ్

అపరాధ పరిశోధన సప్లిమెంట్—150
జూన్, 1986
వెల: రు. 6-50
ఏడాది చందా: 78 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ పీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1,

# శిక్ష

వసుంధర

పార్వతమ్మ ఆందోళనగా వీధి గుమ్మంలో నుంచుని రోడ్డు మీద వచ్చేపోయేవారిని పరీక్షగా చూస్తోంది.

రెండు రోజుల క్రితం వేణు ఇంట్లోంచి పారిపోయాడు. వేణు ఆమెకు ఒక్కగానొక్క కొడుకు. అతిగారాబంచేసి పెంచారు. జులాయిగా తయారయ్యాడు.

రెండు రోజుల క్రితం వేణు పక్కింటమ్మాయి చేయి పట్టుకున్నాడు. ఆ పిల్ల సాచి లెంపకాయ కొట్టింది. ఆమె తలిదండ్రులు రెండు దవడలూ వాయించినకంటె ఎక్కువగా మాటలన్నారు. పార్వతమ్మ భర్త రాఘవులు కోపాన్నణచుకోలేక — "ఇకమీదట నీ ముఖం నా కళ్ళ బడకూడదు — ఫో!" అన్నాడావేశంగా.

వేణులో పౌరుషానికేం తక్కువలేదు. వెంటనే బయటకు వెళ్ళిపోయాడు. వెళ్ళినవాడు రాత్రికూడా ఇంటికి రాలేదు. ఆ మర్నాడూ యింటికి రాలేదు.

పార్వతమ్మ భర్తను వేధించసాగింది. కేవలం అదో

క్కే కారణంకాక_తనకూ కొడుకు గురించి ఆందోళనగా ఉండడంవల్ల రాఘవులు వెతకడానికి బయల్దేరాడు. ఉదయ మనగా వెళ్ళాడు. ఇప్పుడు మధ్యాహ్నం మూడు గంటలయింది. ఇంతవరకూ రాలేదు.

వంట చేసింది కానీ భోజనంకూడా చేయకుండా ఎదురు చూస్తోంది పార్వతమ్మ. ఎంతకూ భర్త జాడ లేదు.

“ఏమయిందో_ఎక్కడ తిరుగుతున్నాడో?” అనుకుంది పార్వతమ్మ.

సరిగ్గా అప్పుడే ఆమె దృష్టినో వ్యక్తి ఆకర్షించాడు.

ఆజానుబాహువు. కాషాయాంబరధారి. ముఖంలో గొప్ప తేజస్సుంది. గుబురుగా పెరిగిన గడ్డంకూడా ఆ తేజస్సును దాచలేకపోతోంది. మధ్యాహ్నపుటెండలో కూడా కమిలిపోకుండా మిలమిల మెరుస్తున్న పసిమి ఛాయ అతడిది.

అతడు సాలోచనగా రోడ్డుమీంచి వెడుతూండగా చూసిన పార్వతమ్మ-“స్వామీ!” అని గట్టిగా పిలిచింది.

ఆ వ్యక్తి ఉలిక్కిపడి ఆమెవంక తిరిగి_ఆ ఇంటిని సమీపించాడు. ప్రశ్నార్థకంగా ఆమె వంక చూశాడు.

“మిమ్మల్ని చూడగానే నాకు మీలో దేవుడు కనిపించాడు. నా మనసులోని ఆందోళనను మీకు చెప్పుకోవాలనుంది. ఒక్కసారి లోపలకు వస్తారా?” అనడిగింది పార్వతమ్మ.

“ఆకలిగా వుంది. భిక్ష వేస్తావా?” అన్నాడా వ్యక్తి.

“అయ్యో_ఎంతమాట! మీ గురించి వంట సిద్ధంగా వుంది. రండి_భోజనం చేద్దురుగాని....” అంది పార్వతమ్మ.

ఆ వ్యక్తి ఇంట్లో ప్రవేశించాడు. తనే తలుపులు

చేశాడు. పార్వతమ్మను నీళ్ళడిగి పాదాలు, ముఖం కడు క్కున్నాడు. నేలమీద కూర్చున్నాడు. అరిటాకు కావా లన్నాడు.

పార్వతమ్మ అన్నీ యేర్పాటు చేసింది.

ఆ వ్యక్తి అరిటాకులో భోజనం చేశాడు. పార్వతమ్మ మగువు మనుషులకని వండిన వంట—అయనొక్కడూ తినేశాడు.

"కడుపునిండా భోజనం పెట్టావు. నిన్ను భగవంతుడు దీవిస్తాడు—" అన్నాడు పార్వతమ్మ వంక ప్రసన్నంగా చూస్తూ.

"తమ పేరు స్వామీ!" అంది పార్వతమ్మ.

"నాకు పేర్లతో పనిలేదు. నేనొక సన్యాసిని—" అన్నాడా వ్యక్తి.

భోజనం కాగానే ఆయన కూర్చునేందుకో కుర్చీ చూపించి తనాయన పాదాలవద్ద కూర్చుంది పార్వతమ్మ.

సన్యాసి మౌనంగా ఆమెవంకే చూస్తున్నాడు. పార్వతమ్మ చాలా సేపు తలవంచుకుని ఉన్నట్లుండి తలెత్తి "స్వామీ నా కొడుకు క్షేమంగా తిరిగి వస్తాడా?" అనడిగింది.

"ఏమయింది నీ కొడుక్కి?" అన్నాడు సన్యాసి.

పార్వతమ్మ క్లుప్తంగా ఆయనకు జరిగింది చెప్పింది. అది వింటూనే సన్యాసి ముఖం గంభీరంగా అయి పోయింది.

"నీ యింట్లో పూజామందిరముందా?" అన్నాడాయన.

"ఉంది స్వామీ!"

"పద—అక్కడకు వెడదాం!"

ఇద్దరూ పూజామందిరం వద్దకు వెళ్ళారు.

# 6

సన్యాసి మందిరం ముందు పద్మాసనం వేసుకుని కళ్లు మూసుకొని కూర్చున్నాడు. అస్పష్టంగా యేదో మంత్రోచ్చారణ చేశాడు.

పార్వతమ్మ ఆత్రుతగా ఆయన వంకనే చూస్తోంది.

కాసేపటికి సన్యాసి కళ్ళు తెరిచి — "నీ కొడుకు బాగా చెడిపోయాడు. సమాజానికి చీడపురుగుగా తయారయ్యాడు—" అన్నాడు.

పార్వతమ్మ ముఖం వెలవెలబోయింది — "వాడిప్పుడెక్కడున్నాడు స్వామీ?"

"ఒక వేశ్య యింట్లో — "

"క్షేమంగా ఉన్నాడా స్వామీ!"

"ఉన్నాడు. కానీ అతడి ప్రాణాలకు త్వరలోనే ముప్పు వాటిల్లనుంది...."

పార్వతమ్మ భయంతో కంపించిపోయింది.

సన్యాసి నిట్టూర్చి—"నీ కొడుకు చెడు దారిలో నడుస్తున్నాడు. ఆ దారి వదిలిపెడితే తప్ప అతడి ప్రాణాలకు రక్షణలేదు. అతణ్ణి మంచి మార్గాన పెట్టడానికి నీ కాయశక్తులా ప్రయత్నించు—" అన్నాడు.

"అది సాధ్యపడుతుం దంటారా?"

"మొక్కై వంగనిది మానై వంగడం సాధ్యంకాదు. అయినా ప్రయత్నించడంలో తప్పులేదు-...." అన్నాడు సన్యాసి.

"ఇప్పుడు వాడింటికి వస్తాడా స్వామీ!"

"నేను వివరాలు చెబుతాను. వెళ్ళి అతణ్ణి తెచ్చుకోండి. అయితే అతడి ప్రాణాలు రక్షించడం నావల్ల కాదు—" అన్నాడు సన్యాసి.

"అందుకే ఉపాయమూ లేదా స్వామీ!"

సన్యాసి క్షణంపాటు తీవ్రంగా ఆలోచించి—"నీ ఇంట్లో పనసకాయ కత్తి ఒకటుంది. రెండ్రోజుల క్రితమే దానికి పదును పెట్టించావు. అవునా?" అన్నాడు.

పార్వతమ్మ ఆశ్చర్యంగా—"అవును—" అంది.

"అదే నీ కొడుకు ప్రాణాలు తీస్తుంది—" అన్నాడు సన్యాసి.

"అయితే ఆ కత్తిని కమ్మరివాడికిచ్చి కరిగించేస్తాను-"

"అలాంటి తెలివితక్కువ పనులు చేయకు. రానున్న చావును శ్రీకృష్ణభగవానుడే తప్పించుకోలేకపోయాడు. నీ కొడుకనగా ఎంత? నీ కొడుకు బ్రతకాలంటే చెడు మార్గాలు వదిలిపెట్టాలి. అదొక్కటే ఉపాయం—...."

"తెలిసి తెలిసీ ఆ కత్తినింట్లో ఉంచుకోలేనుగదా!" అంది పార్వతమ్మ.

"నిజమే! కానీ తప్పదు. ఆ కత్తి నీ చేయి దాటిపోవడం చాలా ప్రమాదం. ఈ యింట్లోనే వుండాలి. ఎవరికీ దొరకని విధంగా జాగ్రత్తగా యే పెట్టెలోనో పెట్టి తాళం వేయి—" అన్నాడు సన్యాసి.

"నాకు చాలా భయంగా వుంది—" అంది పార్వతమ్మ.

"భయం వివేకాన్ని పోగొడుతుంది. వివేకమే నీకు రక్ష అని మరిచిపోకు...." అని—"నీ అదృష్టం కొద్దీ నువ్వు నన్ను పిలిచావు నా శక్తులను నేను సామాన్యుల కోసం ఉపయోగించడం అరుదుగా జరుగుతుంది. నాకెన్ని శక్తులున్నా—నీవు పెట్టిన భోజనం నాలో కలిగించిన కృతజ్ఞతాభావానికవి తలలు వంచుతున్నాయి. ఒకసారి ఆ కత్తిని తీసుకురా—" అన్నాడు సన్యాసి.

కొద్దిక్షణాల్లో పార్వతమ్మ కత్తి తెచ్చి ఆయన

ఇచ్చింది.

సన్యాసి ఆ కత్తిని చేత్తో పట్టుకొని తీక్షణంగా పార్వతమ్మ వంక చూశాడు. తర్వాత కత్తిని గాలిలో కెత్తాడు. కళ్ళు మూసుకున్నాడు. ఏదో మంత్రోచ్ఛారణ చేసి నెమ్మదిగా కత్తిని క్రిందకు దించి కళ్ళు తెరిచాడు.

"ఏం చేశారు స్వామీ?" అంది పార్వతమ్మ.

సన్యాసి కత్తిని పార్వతమ్మకు అందించి—"చూడు!" అన్నాడు.

కత్తిమీద కుంకుమరేఖలున్నాయి. పార్వతమ్మ వాటిని చూసి ఆశ్చర్యపడింది.

"మాత ఆశీర్వాదం లభించింది—" అని—"ఇంట్లో చిన్న పెట్టె యేదైనా ఉందా?" అన్నాడు సన్యాసి.

పార్వతమ్మ అక్కణ్ణించి వెళ్ళి అడుగున్నర పొడవు, అరడుగు ఎత్తు—ఉన్న ట్రంకుపెట్టెని తెచ్చి ఆయన ముందుంచింది.

"ఇందులో ఏమున్నాయి?"

"పాత గుడ్డలుంటే తీసేశాను స్వామీ!"

"ఫరవాలేదు. అవి తీసుకునిరా" అన్నాడు సన్యాసి ఆమె పాతగుడ్డలు తెచ్చాక వాటి మధ్యలో కత్తిని వుంచి పెట్టెలో పెట్టి మూతవేసి గొళ్ళెం వేశాడు. తర్వాత పార్వతమ్మ నడిగి తాళంకప్పను తెప్పించి వేశాడు. తాళం చెవిని తీసుకొని దొడ్లోకి నడిచాడు. పార్వతమ్మ ఆయననుసరించి వెళ్ళింది.

"ఇప్పుడు తాళాన్ని గాలిలోకి ఎగరేస్తాను. అది గాలిలోనే కలిసిపోతుంది. క్రిందపడదు—" అంటూ సన్యాసి తాళంచెవిని గాలిలోకి ఎగరేశాడు. పార్వతమ్మ ఆశ్చర్యంగా గాలిలోకి చూసింది.

తాళం చెవి తూనీగలా ఎగిరిపోతున్నట్లు మెరుపుతో చింది. అది క్రిందకు మాత్రం పడలేదు.

ఆ ప్రయత్నంగా పార్వతమ్మ చేతులు జోడించి సన్యాసికి నమస్కరించి — "తమరు నిజంగా మహాను భావులు —" అంది.

"నీ పొగడ్తలతో నాకు పనిలేదు. నేను చేయగలిగింది చేశాను. ఆ పెట్టి తాళాన్నిప్పుడెవ్వరూ తెరవలేరు" అన్నాడు సన్యాసి.

"నా కొడుక్కు ప్రాణభయం తప్పినట్లేనా స్వామీ!"

"నీ కొడుక్కు అర్ధాంతరపుచావు ఆ కత్తివల్ల తప్ప జరగదు —"

పార్వతమ్మ తృప్తిగా నిట్టూర్చి — "నా కొడుకు ప్రాణాలు నిలబెట్టారు. ఏమిచ్చినా మీ ఋణం తీరదు-" అంది.

"అదంతా నీ భ్రమ — నీ కొడుక్కు చావు రాని పెట్టి ఉన్న క్షణాన ఆ పెట్టి తాళం దానంతటదే తెరుచు కుంటుంది —...." అని — "నీ కొడుకు ప్రాణాలు తన ప్రవర్తన వల్లనే కాపాడబడతాయి. నేను కత్తిని మంత్రించానంటే అందువల్ల ఒక్కటే ప్రయోజనం. ఆ కత్తితో చావు లభిస్తే అతడీజన్మలో చేసిన పాపాలన్నీ నాశనమైపోతాయి. మరో జన్మవరకూ వేధించవు —.... మరి నేను వెడతాను —" అన్నాడు సన్యాసి.

"స్వామీ! మా అబ్బాయెక్కడున్నదీ తమరు వివరించలేదు —" అంది పార్వతమ్మ కంగారుగా.

సన్యాసి ఆమెకు వేణు వున్న యింటి చిరునామా గురించి సవివరంగా చెప్పి వెళ్ళిపోతూ — "కాసేపట్లో

నీ భర్త ఉసూరుమంటూ వస్తాడు. అతణ్ణలాగే బయటకు పంపివేయక — ముందు కడుపునిండా భోజనం పెట్టు. నీకు శుభమవుతుంది —" అన్నాడు.

సన్యాసి వెళ్ళిపోగానే పార్వతమ్మ పరుగున వంటింట్లోకి వెళ్ళింది. భర్త వచ్చేలోగా త్వరగా వంట చేయాలని ఆమె తాపత్రయం.

అయితే వంటింట్లో ఆమె వండిన వంటకాలన్నీ చెక్కుచెదరకుండా ఉన్నాయి. ఆశ్చర్యంతో పార్వతమ్మ నిశ్చేష్టురాలయింది.

తను సన్యాసికింట్లో వండిన వంటకాలన్నీ ఊడ్చి పెట్టేసింది. ఇప్పుడవన్నీ ఎలా తిరిగొచ్చాయి? అసలు సన్యాసి నిజంగా తనింటికి వచ్చాడా — కలగన్నదా?

ఇలా ఆలోచిస్తూండగానే తలుపుతట్టిన శబ్దమై మామూలు మనిషయింది పార్వతమ్మ. ఆమె ఒక్క ఉదుటున వెళ్ళి తలుపుతీసింది.

రాఘవులు వీధిగుమ్మం దగ్గర నీరసంగా నిలబడి ఉన్నాడు.

"అబ్బాయి కానీ ఇంటికొచ్చాడా?" అన్నాడు దిగులుగా.

"రాలేదు. ముందు లోపలకు రండి —" అంది పార్వతమ్మ. ఆమె భర్తకు జరిగిందంతా అప్పుడే చెప్పదల్చుకోలేదు. చెబితే రాఘవులు వెంటనే మళ్ళీ బయటకు వెళ్ళిపోతానంటాడని ఆమె భయం.

"ఎక్కడున్నాడో — ఏం చేస్తున్నాడో?" అంటూ రాఘవులు లోపలకు వచ్చాడు.

పార్వతమ్మ బలవంతంగా అతడిచేత భోజనం తినిపించింది. అతడితోపాటే తనూ భోంచేసింది. భోజనా

లయ్యాక జరిగింది చెప్పింది.

"నువ్వు కలగంటున్నావా?" అన్నాడు రాఘవులు.

పార్వతమ్మ భర్తకు చిన్న ట్రంకుపెట్టి చూపించింది. రాఘవులా తాళంచూసి — "దీనికేముంది? మన దగ్గర మారుతాళంచెవి వుందిగా!" అన్నాడు.

"అయ్యో! ఆ విషయమే మరిచాను—" అంది పార్వతమ్మ.

కత్తిమీని కుంకుమరేఖలు చూడాలని రాఘవులు కుతూహల పడ్డాడు. అందుకని అతడు మారుతాళాలుండే గుత్తి తెచ్చాడు. సులభంగా నే తాళంచెవిని గుర్తుపట్టాడు. అయితే ఆ తాళంచెవి కప్పులో దూరింది తప్ప—అటూ తిరగలేదు.

"అంతా సన్యాసి మహిమ!" అంది పార్వతమ్మ.

"నమ్మడానికి కష్టంగా వుంది—" అన్నాడు రాఘవులు.

పార్వతమ్మ ట్రంకుపెట్టెని పడకగదిలో మంచంకింద పెట్టింది. భర్తతో—"ఇప్పుడు నిమిత్తంగా వెళ్ళి వేణును తీసుకొనిరండి—" అంది.

"నేనెప్పుడూ వేశ్యావాటికకు వెళ్ళలేదు. కొడుకు గురించి వెళ్ళాల్సి వస్తోంది—" అన్నాడు రాఘవులు బాధగా.

"ఏమైతేనేం? వాడి జాడంటూ తెలిసింది గదా...."

"కొడుకు కోసం తండ్రి వేశ్యావాటికకు వెళ్ళడం చాలా అవమానకరమైన విషయం. వాడక్కడ లేకుం టేనే నే నెక్కువ సంతోషిస్తాను" అన్నాడు రాఘవులు.

"అలాగనకండి—వాడి జాడ తెలిస్తే ఎన్ని అవమా

నాలైనా మనం భరించవచ్చు—" అంది పార్వతమ్మ.

రాఘవులు ఊనూరంటూ బయల్దేరాడు.

## 2

"నువ్వొచ్చి అప్పుడే రెండ్రోజులయింది—" అంది మధురనాయకి.

మధురనాయకికి ఆ ఊళ్ళో వేశ్యమాత అన్న పేరుంది. ఆ ఊరి వేశ్యలుకూడా ఆమెను తల్లిగా భావిస్తారు. వేశ్యాసంపర్కం కోరేవారామెను సంప్రదించడంలో యెన్నో లాభాలున్నాయి.

వేశ్యాకులంలో పుట్టింది మధురనాయకి. వేశ్యగానే బ్రతికింది కానీ నీతినీ నిజాయితీనీ నమ్ముకుంది. ఆమె అందం ఆమెకు డబ్బును సంపాదించి పెట్టింది. నిజాయితీ ఆ కులంలోకూడా ఆమెకు గౌరవాన్నాపాదించింది.

ధూమపానంకంటె, మద్యపానంకంటె — వేశ్యావృత్తి తప్పుకాదంటుంది మధురనాయకి. మద్యం, ధూమం మగవాడికి శారీరకావసరాలు కావు. స్త్రీ పురుషులకు శారీరకంగా పరస్పరావసరం వుంది. శారీరకావసరానికి పెళ్ళి ఒక పద్ధతి. వేశ్యాసంపర్కం మరొకపద్ధతి. అయితే సమాజంలో పెళ్ళికి గౌరవస్థానముంది. వేశ్యకు లేదు. వేశ్యకు మించిన అవమానం మోసపోయిన ఆడదానిది.

పురుషుడిచే మోసపోవడం — స్త్రీకి అనాదినుంచీ అనుభవం. అలా మోసపోయిన ఆడవాళ్ళలో అప్పటికప్పుడు జీవితాలనంతం చేసుకున్నవారున్నారు. తెగిన గాలిపటాలై ముదనష్టపు చావుకు గురైనవాళ్ళూ వున్నారు.

చెడిన ఆడవాళ్ళకు మధురనాయకి ఆశ్రయమిస్తుంది. వారిని మానసికంగా వేశ్యావృత్తికి ప్రోత్సహిస్తుంది.

"చెడిన ఆడది"_అన్న పదం అర్థరహితమైనది. అది సమాజం స్త్రీని బలహీనపర్చడానికి వాడే పదమని చెబుతుంది.

మధుర నాయకికిప్పుడో పెద్ద సంస్థ. ఆమె ఆధ్వర్యంలో అయిదువందల అందాల పడుచులున్నారు. వారికి సెంట్రల్ గవర్నమెంటు ఉద్యోగులకుండే సదుపాయా లన్నీ వున్నాయి. చెప్పాలంటే అంతకుమించిన సదు పాయాలు వారివి.

మధుర నాయకి సంస్థలోని వేశ్యలందరికీ ఉచిత భోజన వసతి సదుపాయాలున్నాయి. వారి ఆరోగ్యాన్ని కాపా డానికి డాక్టర్లున్నారు. వారి దగ్గరకొచ్చే విటుల ఆరో గ్యాన్ని పరీక్షించడానికీ డాక్టర్లున్నారు.

విటుల నాకర్షించే బాధ్యత వేశ్యలది. వారి వారి సంపాదనలో కొంత కాలం సేవింగ్సు, కొంత కాలం మధుర నాయకికీ, కొంత కాలం మెయింటెనెన్సుకు పోగా యిరవై కాలం జీతంగా యిస్తుంది.

అటు విటులకూ, ఇటు వేశ్యలకూ ప్రమాదరహితమూ, లాభకరమూ, ఆరోగ్యప్రదమూ, గౌరవనీయమూ అయిన పద్ధతిలో నడుస్తోంది మధుర నాయకి సంస్థ.

ఆకర్షణ తగ్గినవారికీ, వయసుమీరినవారికీ రిటైర్మెంట్ సదుపాయముంది. జీవితంలో మరోవిధంగా స్థిరపడాలను కునేవారికికూడా మధుర నాయకి ఆర్థికంగానూ, ఇతర విధాలుగానూ సాయపడుతుంది.

మధుర నాయకి కథ మరోసారి తెలుసుకుందాం.

రాఘవులు కొడుకు వేణు ప్రస్తుతం ఆమె యింట్లో ఉన్నాడు.

వేణుకీ ఆమెకూ విచిత్రంగా పరిచయమయింది.

ఒకరోజున మధురనాయకి పార్క్ లో కూర్చుని వుంది. అక్కడ వేణు ఓ అమ్మాయితో అసభ్యంగా మాట్లాడాడు. ఆమె అతణ్ణి చెప్పుతీసి కొట్టింది. ఆ దృశ్యం మధురనాయకి చూసి తనే వేణు దగ్గరకు వెళ్ళింది.

"పాపం—నీకు అవమానమయింది కదూ!" అందామె.

"ఇది నాకు అవమానమేంకాదు — అలవాటే!" అన్నాడు వేణు తడుముకోకుండా.

"అలవాటే అయితే—ఇది మంచిదికాదు—" అంది మధురనాయకి.

"మంచో, చెడో—నేను మానుకోలేను—" అన్నాడు వేణు.

"మానుకునే ఉపాయం నేను చెబుతాను. వింటావా?"

"వినను—...."

"ఎందుకని?"

"ఆడవాళ్ళంటే నాకు సరదా — నా సరదా నాకుండాలి...."

"నీ సరదా నీకుంటుంది...."

"ఎలా?"

మధురనాయకి అతడికి తన సంస్థ గురించి చెప్పుతుంది.

వేణు ఆశ్చర్యపడ్డాడు—"ఇది నిజమా?" అన్నాడు.

"డబ్బుంటే చాలు—ఇది నిజమే అవుతుంది...." అంది మధురనాయకి.

అప్పుడు వేణు చేతిలో డబ్బుంది. అతడు మధురనాయకి వెంట వెళ్ళాడు. మధురనాయకి అతడిని డాక్టరు వద్దకు పంపింది. వేణు వైద్య పరీక్షకు నిరాకరించాడు.

"వైద్య పరీక్ష ఇక్కడ తప్పనిసరి!" అంది మధుర నాయకి.

"వేశ్యలకు వైద్యపరీక్షకానీ నాకెందుకు?" అన్నాడు వేణు.

"వేశ్యకు పురుషపదం విటుడు—" అంది మధుర నాయకి.

వేణు అంగీకరించి వైద్యపరీక్షకు సిద్ధపడ్డాడు. అతడి ఆరోగ్యం మంచిదేనని తేలేక ఓ యువతి వద్దకు మధుర నాయకి అతణ్ణి పంపింది.

కాసేపటికి అతడు బయటకు వచ్చి మధురనాయకిని కలుసుకున్నాడు.

"ఎలా వుంది నా ఉపాయం?" అంది మధురనాయకి.

"బాగోలేదు—" అన్నాడు వేణు.

"ఏం?"

"నాకు వేశ్య పనికిరాదు—స్త్రీ కావాలి—...."

"వేశ్య స్త్రీ కాదా?"

"నా దృష్టిలో కాదు—...."

"స్త్రీ అంటే నీ దృష్టిలో ఎవరు?"

"డబ్బు గురించికాక — నన్ను నన్నుగా ప్రేమించి ఇష్టపడే మనిషి...."

మధురనాయకి వెంటనే — "నిజమే! నీకు వేశ్య పనికిరాదు—" అంది. వేణు వెళ్ళిపోబోతూంటే ఆపి— "అడది నిన్ను నిన్నుగా ఇష్టపడాలంటే నడి బజార్లో చెయ్యి పట్టుకొనడంవల్ల జరిగే పనికాదు—" అంది.

"మరెలా జరుగుతుంది?"

"ఓ స్త్రీని ఎన్నుకో-ఆమెకోసం ఏమైనాచేయి...."

"ఏమైనా అంటే?"

"ఉదాహరణకు అలివేలు కథ చెబుతాను...." అంది మధుర నాయకి.

వేణు వినసాగాడు.

అలివేలు ఓ మధ్యతరగతి అమ్మాయి. పక్కింటి కుర్రాడి మాయమాటలకు లొంగి— అతడికి తనువు సర్పించింది. అతడు వేరే పెళ్ళి చేసుకున్నాడు. అలివేలు ఆత్మహత్య చేసుకోవాలనుకుంది. అదృష్టంకొద్దీ మధుర నాయకికి దొరికింది. ఆమె అలివేలును వేశ్యావృత్తికి ప్రోత్సహించింది. అలివేలు ఒప్పుకోలేదు. తను సమాజంలో నలుగురి ఆడవాళ్ళకులాగే బ్రతుకుతానంది.

"అలివేలు ఇప్పుడు నా దగ్గరే వుంది. ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా వ్యభిచారానికి ప్రోత్సహించలేను. ఆమెను నువ్వు పెళ్ళి చేసుకుంటావా?" అంది మధుర నాయకి.

"చెడిన ఆడదాన్ని నేను పెళ్ళిచేసుకోవాలా?" అన్నాడు వేణు.

"అలివేలు చెడిపోలేదు. నిక్షేపంలా వుంది—"

"నా దృష్టిలో ఆమె చెడిపోయినట్లే లెక్క!"

"అలివేలు దృష్టిలో నువ్వూ చెడిపోయిన వాడికిందే లెక్క! పార్కుల్లో ఆడపిల్లల చెప్పుదెబ్బలు తినేవాళ్ళూ, నా యింట్లో వేశ్యాసంపర్కాన్నాశించేవాళ్ళూ-చాలా మంది దృష్టిలో చెడిపోయినట్లే లెక్క...."

"అలాంటి లెక్కల్ని నేను లెక్కచేయను...."

"లెక్కచేసినప్పుడే మళ్ళీ నా యింటి గుమ్మం తొక్కు. వెళ్ళు...." అంది మధుర నాయకి తీవ్రంగా.

వేణు మొండితనం ఆమెకు చిరాకు కలిగించింది.

వేణు వెళ్ళిపోయాడు. సరిగ్గా రెండురోజులకే అతడు మధుర నాయకి—ఇంటి గడప మళ్ళీ తొక్కాడు.

అంత త్వరగా అతను వస్తాడని ఊహించని మధుర నాయకి ఆశ్చర్యపోయి—"అలివేలు విషయంలో నీ మనసు మార్చుకున్నావా?" అంది.

"నీ యింట్లో రెండ్రోజులుండనీ—" అన్నాడు వేణు.

"ఎందుకు?"

"అలివేలును పెళ్ళి చేసుకోవాలంటే చాలా ఇబ్బందు లున్నాయి. ఇంట్లో మావాళ్ళొప్పుకోరు. నేనార్థికంగా స్వతంత్రుణ్ణి కాను...." అన్నాడు వేణు.

"నీ కాళ్ళమీద నిలబడాలన్న కోరిక నీకుంటే— నిలబెట్టే ప్రయత్నం నేను చేయగలను...." అంది మధుర నాయకి.

"ఎలా?"

"సంఘంలో నాకు గౌరవముందో లేదో తెలియదు. కానీ పలుకుబడి వుంది. నీకుద్యోగమిప్పించగలను. నిన్నో చిన్న వ్యాపారస్తుణ్ణి చేయగలను. అయితే నీకోసం మాత్రం కాదు. అలివేలు జీవితానికి రక్షణకోసం..."

"ఆలోచించుకు నేందుకు నాకు రెండ్రోజుల వ్యవధి కావాలి ..."

మధుర నాయకి అతడిని రెండ్రోజులపాటు తనింట్లో వుంచుకుంది. ఇప్పుడా రెండ్రోజులూ అయిపోయాయి.

"నువ్వొచ్చి అప్పుడే రెండ్రోజులయింది." అందామె.

వేణుకు ఏం చెప్పాలో తోచలేదు. ఆ యింట్లో సకల సదుపాయాలూ వున్నాయి. అతడికి సుఖంగా వుంది. తలిదండ్రులెదిరించి అక్కడకు వచ్చాడు. తిరిగి ఇంటికి వెళ్ళే ఉద్దేశ్యంలేదు. అలాగనీ అలవేలును పెళ్ళి

చేసుకోవాలనీ లేదు.

పెళ్ళి చేసుకొంటే అనవసరపు జంఝాటం.

“నీ నిర్ణయం గురించి చెప్పాల్సిన టైమొచ్చింది-” అంది మధురనాయకి మాట రెట్టిస్తూ.

ఇంటికి తిరిగి వెళ్ళడంకంటే అలివేలును పెళ్ళిచేసుకోవడమే మేలనిపించింది వేణుకు. ఆ విషయమే చెబుదామనుకుంటూండగా — లోపలికి పనిమనిషి వచ్చి— “మీకోసం యెవరో వచ్చారమ్మా!” అంది.

“ఎవరు?”

“పేరు రాఘవులని చెప్పారు...”

“రాఘవులంటే మా నాన్న పేరు. నేనిక్కడున్నట్లాయనకెలా తెలిసిందో—” అన్నాడు వేణు ఆశ్చర్యంగా.

“నువ్వూ వస్తావా?” అంది మధురనాయకి.

“రాను. నువ్వే వెళ్ళి మాట్లాడు....” అన్నాడు వేణు.

“ఏం మాట్లాడను?”

“నీ యిష్టం—నీ నిర్ణయానికి నేను కట్టుబడతాను..”

# 3

అందమైన ఆ డ్రాయింగ్ రూం నలువైపులా ఆశ్చర్యంగా చూస్తున్నాడు. అది సినిమాల్లో చూసే గొప్పవాళ్ళ యిళ్ళలా వుంది తప్ప వేశ్యా గృహంలా లేదు.

అప్పుడు మధురనాయకి లోపలకు వచ్చింది. ఆమెను చూస్తూనే లేచి నిలబడ్డాడు రాఘవులు.

మధురనాయకి రాజమాతలా ఉంది తప్ప వేశ్యమాతలా లేదు.

ఆమె అతడికి నమస్కరించి—“కూర్చోండి!” అంది.

రాఘవులు కూర్చున్నాడు. ఆమె అతడికెదురుగా కూర్చుని—"చెప్పండి—" అంది.

"మా అబ్బాయి వేణు ఇక్కడున్నాడని తెలిసింది-"

"ఎలా తెలిసింది?"

"చెబితే మీరు నమ్మరు. ఒక సన్యాసి దివ్యదృష్టితో చూసి చెప్పాడు...."

మధురనాయకి నవ్వి—"సన్యాసుల దివ్యదృష్టికి మాయిస్కృ తప్ప మరేమీ కనిపించవు.... వేణు అనే కుర్రాడిక్కడే వున్నాడు—" అంది.

"వాణ్ణి తీసుకొని పోదామని వచ్చాను—"

"అతడు రానంటున్నాడు...."

"వాడితో నేనో సారి మాట్లాడాలి—"

"అతడు మీతో మాట్లాడనంటున్నాడు—...."

రాఘవులు ముఖం ఎర్రబడింది. ఏదో అనాలని ఉద్రేకంలో మాట రాక ఆగిపోయాడతడు.

"మిమ్మల్ని చూస్తే నాకు చాలా జాలిగా వుంది. మీ అబ్బాయి వేణు మానసికంగా బాగా చెడిపోయాడు. బహుశా పెంపకం లోపం అనుకుంటాను—...." అంది మధురనాయకి నిట్టూర్చుతూ.

"మీ కెలా తెలుసు?"

"మీ అబ్బాయి గురించి నాకు తెలిసినది చెబుతాను—వినండి!" అంటూ మధురనాయకి అతడికి పార్కులో తనకు వేణు పరిచయమయినప్పట్నుంచి అంతవరకూ యేం జరిగిందో చెప్పింది.

రాఘవులి ఆవేశం తగ్గింది—"వాడు చెడిపోతున్నాడు. ఎలా బాగుచేయాలో తెలియడంలేదు—" అన్నాడు దిగులుగా.

"నిదానంగా వింటే ఉపాయం నేను చెబుతాను——...."

రాఘవు లాశగా ఆమెవంక చూశాడు.

"వేణు——ఎలాంటి జులాయి పనులు చేస్తాడో మీరూహించలేరు. అతణ్ణి అదుపు చేయడం మీవల్ల కాదు. నేనైతే అనుక్షణం అతడి ప్రవర్తన కనిపెట్టడానికో వస్తాదును నియమిస్తాను. ప్రవర్తన అదుపుతప్పినప్పుడల్లా వస్తాదు అదుపు చేస్తాడు...."

"అందువల్ల మీకు ప్రయోజనం!"

"నా యింట్లో అలివేలు అనే ఓ అమ్మాయుంది. ఆమె గురించి మీకేమీ అబద్ధం చెప్పను. అందమయిన పిల్ల. ఒకే ఒక్కసారి తప్పు చేసింది. అదీ ఓ మగాడి మాయ మాటలను నమ్మి! ఆమెకు సమాజంలో నలుగురాడవాళ్ళకు లాగా బ్రతకాల నుంది. అలాంటి అవకాశం లేకపోతే చావాలనుకుంటోంది. ఆమెను బ్రతికించాలని నా కోరిక. అది నావల్ల కాదు. మీ వల్లనే అవుతుంది——...."

"ఎలా?" అన్నాడు రాఘవులు.

"అలివేలును మీ యింట్లో పెట్టుకోండి. మీ బంధువు అమ్మాయని చెప్పుకోండి. ఆమెను వేణు కిచ్చి పెళ్ళి చేయండి. వేణు జీవితంలో స్థిరపడేలా నేను చూసుకుంటాను——...." అంది మధుర నాయకి.

"అలివేలుకీ మీకూ యేమిటి సంబంధం?"

"మనిషి మంచితనం కలిగించే సంబంధం!"

"బహుశా అలివేలు మీ కూతురనుకుంటాను. ఆ విషయం చెప్పుకోలేరు బయటి ప్రపంచానికి...."అన్నాడు రాఘవులు.

"నా కిద్దరు కూతుళ్ళు. గవర్నమెంటు హాస్పిటల్లో

పురుడు పోసుకున్నాను. వాళ్ళకు తండ్రెవరో చెప్పలేను కానీ తల్లిని నేనవడానికి తిరుగులేని ఋజువులున్నాయి. వాళ్ళేం చేస్తున్నారో తెలుసా?"

రాఘవులు మాట్లాడకుండా ఆమెవంకే చూశాడు.

"నా అదృష్టంలోనే వాళ్ళిద్దరూ సగౌరవంగా వేశ్యావృత్తిని కొనసాగిస్తున్నారు. దాంపత్య జీవితం నా తత్వానికి సరిపడదు——...."

"ఇదంతా ఎందుకు చెప్పినట్లు?"

"అలివేలు నా కూతురే అయితే ఆమెను కూడా చిన్న తనం నుంచీ వేశ్యావృత్తికి అనుగుణంగా ప్రోత్సహించి ఉండేదాన్ని. నేను నమ్మిన సిద్ధాంతాన్ని, నేను ప్రయోజనం పొందుతున్న వ్యాపారాన్ని — ఇతరులపై రుద్దే చౌకబారు స్వార్థం కాదు నాది. అలివేలును నే నాదుకున్నాను. ఆమెను బ్రతికించాలనుకుంటున్నాను...."

"కానీ తెలిసి తెలిసి.... చెడిన ఆడదాన్నెవరు చేరదీస్తారు?"

"ఒకసారి అలివేలును చూడండి అప్పుడామె గురించి మాట్లాడండి...." అంది మధురనాయకి.

అలివేలును చూడ్డానికి రాఘవు లామె ననుసరించాడు.

ఓ గదిలో సోఫాలో కూర్చుని ఇంగ్లీషు నవల చదువుకుంటోంది ఓ యువతి. ఆమె వయసిరవైకి మించదు. ముఖంలో పసిపాపల అమాయకత్వం. బుగ్గల్లో గులాబీల్లో ఎర్రదనం. తనువులో విద్యుల్లత మెరుపు. చీర కట్టడంలో ఓ సొగసు. లేచి నిలబడడంలో ఓ ఆకర్షణ.

"ఈమె పేరు అలివేలు!" అంది మధురనాయకి.

"నమస్తే!" అంది అలివేలు. అప్పుడామె పలుకరస

తళుక్కుమని మెరిసి ఎర్రని పెదాల్లో ప్రతిఫలించి— తిరిగి మాసుకుపోయింది.

"నువ్వు చదువుకోమ్మా!" అని మధురనాయకి రాఘవుల్ని బయటకు తీసుకుని వెళ్ళిపోయింది.

"ఆమె సినీనటి అయితే—జనమామె దర్శనానికి తపించిపోయేవారు. ఆమె రాజకీయాల్లో ప్రవేశిస్తే పార్టీ నాయకులామె చుట్టూ ప్రదక్షిణాలు చేస్తూండేవారు. వేశ్య అయితే ప్రతినిత్యం ఆమెకు కనకాభిషేకాలు జరిగేవి. ఆమెలో మీరిప్పుడు చెడిన ఆడదాన్ని చూస్తున్నారు. మీ మీద జాలిపడడం మినహాయించి నేనేమీ చేయలేను—" అంది మధురనాయకి.

"మీరు నిజమే చెప్పారు. కానీ ఆమె చెడిన ఆడది కాకుండా పోదుకదా!"

"మీ అబ్బాయి వేణు కూడా చెడినవాడే కదా!"

"వాడు మగాడు...."

మధురనాయకి ముఖం ఎర్రబడింది—"మీ అభిప్రాయం మార్చుకున్నాకనే మళ్ళీ ఈ గడప తొక్కండి. ప్రస్తుతానికి వెళ్ళండి—" అంది.

రాఘవులు వెంటనే—"ఈ విధంగా మా అబ్బాయి వేణు బాగుపడతాడని మీ రనుకుంటే నేను తప్పకుండా మీరు చెప్పినట్లే చేసాను—...." అన్నాడు.

"మంచి మనసుతో చేసిన యే పనైనా సత్ఫలితాలనే యిస్తుంది.... నేను చెప్పినట్లు చేస్తే మీ అబ్బాయి బాగుపడతాడు—...." అంది మధురనాయకి నమ్మకంగా.

## 4

అలివేలు రాక చుట్టుపక్కలవాళ్ళలో కొంత సంచలనాన్ని కలిగించింది. చాలామంది ఆడవాళ్ళామెను చూడ్డా

నికి వచ్చి ఆమె గురించి ఆరాలు తీశారు. పార్వతమ్మ ఆమె నాగపురవాసులో తనకు మేనకోడలవుతుందని—తల్లీతండ్రీ పోగా తనింటికి తీసుకుని వచ్చాననీ చెప్పింది.

వచ్చిన మొదటిరోజునే అలివేలు పార్వతమ్మ మనసు దోచుకుంది అన్ని పనుల్లోనూ ఆమెకు సాయం చేసింది. సేవలు చేసింది.

వేణు మాత్రం అలివేలువైపు కన్నెత్తి కూడా చూసేవాడు కాదు. ఇంట్లో అలివేలుముందతడు పెద్ద మనిషి తరహాగా మసిలేవాడు. అందుకు కారణముంది. అతడు పెద్దమనిషి తరహాగా ప్రవర్తించడం లేదని అలివేలు నుంచి ఫిర్యాదు వస్తే వేణుకు బాగా దేహశుద్ధి జరుగుతుందని మధురనాయకి ముందే బెదిరించింది.

వేణు ఇంట్లోంచి బయటకు వెళ్ళినపుడు తన పాత స్నేహితులతో తిరిగేవాడు. అలా రెండురోజులు జరిగేక—ఒకరోజున అతడు బళ్ళోకి పారబోతుండగా—వస్తాదులాంటి మనిషి పట్టుకుని ఆపి—"ఈ ఊళ్ళో యే బళ్ళో నిన్ను చూసినా మక్కెలిరగదంతాను—" అని హెచ్చరించాడు. అతడప్పుడు మధురనాయకి యింటికి వెళ్ళాడు.

"ఉద్యోగం చేస్తావా, వ్యాపారం చేస్తావా?" అంది మధురనాయకి వెంటనే.

"అంటే?" అన్నాడు వేణు అర్థంకాక.

"నీకు రెండే రెండు అవకాశాలు...." అని నవ్వింది మధురనాయకి—"జులాయిగా తిరిగే అవకాశం మాత్రం నీకు లేదు—...."

"ఉద్యోగం చేస్తే మంచి జీతం దొరుకుతుందా?"

"నీ చదువుకు తగ్గ జీతమే దొరుకుతుంది....వ్యాపారం

చేస్తానంటే మారం అది వేరే సంగతి....ఎంతైనా సంపాదించుకోవచ్చు...."

"ఏ వ్యాపారం చేయను?"

"చేస్తానంటే నేను చెబుతాను...."

"చేస్తాను "

"అయితే వెళ్ళి బిజినెస్ మాగ్నెట్ మాధవరావును కలు. నేను పంపానని చెప్పు—"

వేణు మాధవరావు దగ్గరకు వెళ్ళాడు.

"ప్రెస్ ప్రారంభించు—మంచి ఆర్డర్సు వచ్చేలా చేస్తాను...." అన్నాడు మాధవరావు.

మాధవరావు, మధురనాయకిల ఆశీర్వాదంతో నెల రోజుల్లో ప్రెస్ ప్రారంభించాడు వేణు. ఆర్థికంగా మధురనాయకి. వ్యాపారపరంగా మాధవరావు అతడికి సాయపడ్డారు. ఏడాదిలోనే అతడు వ్యాపారంలో నిలదొక్కుకున్నాడు.

కొడుకులో వస్తున్న మంచి మార్పు పార్వతమ్మకు సంతోషాన్ని కలిగించింది "అంతా సన్యాసి మహిమ!" అనుకున్నదామె.

రాఘవులికీ యిప్పుడెంతో సంతోషంగా ఉంది. కొడుకు సంపాదన సామాన్యమైనది కాదు. ఇప్పుడు రాఘవులి సంపాదన చిన్నదనిపిస్తోంది.

ఒకరోజున వేణు మధురనాయకి ఇంటికి వెళ్ళి— "నాలోని మార్పు నీకు నచ్చిందా?" అన్నాడు.

"ఈ ప్రశ్న నువ్వు అలివేలు నడుగు...." అంది మధురనాయకి.

"ఆమెను నేను పెళ్ళి చేసుకుంటాను—...."

"అప్పుడే కాదు—...."

"ఎందుకని?"

"నువ్వు ముందు నా బాకీ తీర్చాలి!" అంది మధుర నాయకి.

"బాకీ తీర్చకుండా పెళ్ళి చేసుకోకూడదా?"

"బాకీ తీర్చడం నీ బాధ్యత. పెళ్ళి మరో బాధ్యత. ఒక బాధ్యత పూర్తి కాకుండా మరో బాధ్యతను చేపట్టడం మంచిది కాదు....అదీకాక నే నిలా యింకా యెంతో మందికి సాయపడుతూంటాను. నాకు డబ్బవసరం. నా డబ్బు నీవంటి వారికద్ద చిక్కుపడిపోకూడదు" అంది మధుర నాయకి.

# 5

"అలివేలు చాలా మంచిపిల్ల. మనింట్లో పాదం పెట్టి నప్పట్నించీ అన్నీ లాభాలే!" అంది పార్వతమ్మ.

"అవును — యే యింటి కోడలవుతుందో—....వాళ్ళు చాలా అదృష్టవంతురాలు—...." అన్నాడు రాఘవులు.

"మనిల్లుండగా—యే యింటికో యెందుకు వెడుతుందీ?" అంది పార్వతమ్మ ఆశ్చర్యపోయి.

"బాగుంది—కులం, గోత్రం తెలియని పిల్లను మనింటి కోడలు చేసుకుంటా మేమిటి....?" అన్నాడు రాఘవులు

"అయితే మాత్రం—మనింటి కోడలు చేసుకుందా మనే కదా—మీ రా అమ్మాయిని తెచ్చారు? నాకు నచ్చితే మనవాడి కిచ్చి పెళ్ళి చేద్దామని కూడా అన్నారు. అలివేలు నా కెంత నచ్చిందో మాటల్లో చెప్ప లేను...." అంది పార్వతమ్మ.

"అయితే యిన్నాళ్ళూ దాచిన అసలు విషయం

కూడా చెబుతాను. ఆ పిల్ల మంచిది కాదు. చెడి పోయింది. వేరే దారిలేక మనింట్లో పెట్టాను—...."
అంటూ రాఘవు లప్పుడామె అసలు విషయం వివరించి చెప్పాడు.

పార్వతమ్మ వెంటనే....—"ఛీ ఛీ ఛీ....యెంత మోసం!" అంది.

"అలవే లెలాంటిదో తెలిస్తే నువ్వామె నింట్లో వుంచుకుందు కంగీకరించవు. అందుకని నేనామె గురించిన కొంత నిజాన్ని దాచిపెట్టి మనింటికి తెచ్చాను. అప్పు డంతకుమించి వేరే దారిలేదు మనకి...."

"ఇప్పుడేం చేయాలి?" అంది పార్వతమ్మ.

"మంచి సంబంధాలొస్తున్నాయి మనవాడికి. కట్నం కూడా యాభై వేలకు తక్కువొచ్చేలా లేదు. మన మెలాగో అలా ఈ పిల్లను వదుల్చుకోవాలి....—"

"ఎలా వదుల్చుకుంటాం?" అంది పార్వతమ్మ కంగా రుగా.

"ముందు మనవాడికా పిల్లమీద యెలాంటి అభి ప్రాయముందో తెలుసుకో!" అన్నాడు రాఘవులు.

"వాడెప్పుడూ పొరపాటున కూడా ఆ పిల్ల వంక కన్నెత్తి చూడడండీ—బహుశా వాడి కిష్టం లేదను కుంటాను— ...." అంది పార్వతమ్మ.

"అలా కాదు—ముందుగా అడిగి తెలుసుకో. వాడి కిష్టం లేకపోతే మన పని సగానికి సగం సులభమవు తుంది—...." అన్నాడు రాఘవులు.

ఆ రాత్రి పార్వతమ్మ యథాలాపంగా కొడుకు దగ్గర పెళ్ళి ప్రసక్తి తీసుకవచ్చింది.

"నా పెళ్ళికింకా ఆగాలమ్మా—వ్యాపారంలో మరి

కాస్త నిలదొక్కుకోవాలి—"

"అదిసరే— పెళ్ళి ఎలాగూ ఆగొచ్చు. ఈలోగా పెళ్ళిచూపులకంటూ వెళ్ళడంలో తప్పులేదు. చాలామంది మనమీద ఒత్తిడి తీసుకుని వస్తున్నారు...."

వేణు ఆశ్చర్యంగా—"ఇంకా నాకు పెళ్ళిచూపు లేమిటి? నేను పెళ్ళిచేసుకునే అమ్మాయి అలివేలేకదా!" అన్నాడు.

పార్వతమ్మ ఆశ్చర్యంగా "నువ్వు అలివేలును పెళ్ళి చేసుకుంటావా? నేనిది ఊహించలేదు—" అంది.

"ఇందులో ఆశ్చర్యమేముంది? అంతా అనుకున్నదేగా?" అన్నాడు వేణు.

"అలివేలు చెడిపోయిన పిల్లని నీకు తెలియదా?"

"ప్రతి మనిషీ తప్పులు చేస్తాడు. నేనూ కొన్ని తప్పులు చేశాను. ఇప్పుడు నేను బాగుపడ్డాను. అయినా ఇప్పటికీ పాత విషయాలు గుర్తుచేస్తూ నన్నెవ్వరైనా చెడిపోయినవాడని అంటే నేను భరించలేనమ్మా—" అన్నాడు వేణు.

"అలివేలు బాగుపడిందని నమ్మకమేమిటి?" అంది పార్వతమ్మ.

"అందుకు తిరుగులేని ఋజువొకటుంది—" అన్నాడు వేణు.

"ఏమిటది?—...." అంది పార్వతమ్మ కుతూహలంగా.

"అలివేలీ యింట్లో అడుగుపెట్టి యేడాది దాటింది. ఎప్పుడూ ఆమెను మెచ్చుకోవడం తప్ప వేలెత్తి చూపలేదు నువ్వు. అంతగా నీ అభిమానం పొందిన ఆమె ప్రవర్తనను నా బోటివాడెక్కడ శంకించగలడు?"అన్నాడు

వేణు.

పార్వతమ్మకు ఏమనేం చెప్పాలో తెలియలేదు.

అప్పట్లో ఆమెకు అలివేలు గురించిన అసలు కథ తెలియదు.

వేణు చటుక్కున పార్వతమ్మకు పాదాభివందనం చేశాడు.

"ఏమిట్రా యిది!" అంటూ కొడుకును లేవనెత్తింది పార్వతమ్మ.

"నిన్ను చూస్తే నా కెంతో సంతోషంగా వుందమ్మా!" అన్నాడు వేణు.

"ఎందుకని?"

"మధురనాయకి అనే ఆమె వేశ్యగానే ఈ ఊళ్ళో చాలామందికి తెలుసు. కానీ సమాజానికి ఆమె చేస్తున్న సేవ ఉదాత్త శిక్షకి సంబంధించినది. అందానికి అప్సరస అయిన అలివేలును తన స్వార్థానికి కూడా ఉపయోగించుకోకుండా—ఆమె కోసం నన్ను కూడా బాగుచేయాలని సంకల్పించి ఫలితం సాధించిందామె. సంప్రదాయాల కనుగుణంగా జీవిస్తూన్న నీవు—చెడును కొడుకు రూపంలో కూడా భరించలేక ఇంట్లోంచి బయటకు గెంటినప్పుడు—నువ్వు—నా కన్నతల్లివైన నువ్వు మధురనాయకి కాలిగోటికి కూడా సరిపోలని వ్యక్తివైనందుకు నా కెంతో బాధ కలిగింది.

అయితే చెడిపోయిన ఆడదని తెలిసి కూడా అలివేలును యేడాది నుంచి కన్నబిడ్డలా ఆదరించి అభిమానించ గల్గుతున్న నువ్వు—ఆ మధురనాయకి కంటె యెన్నోరెట్లు గొప్పదానివి. ఎందుకంటే మూఢనమ్మకాలతో, సంప్రదాయపు వాసనలతో, సదాచారా లనబడే

అనాచారాలతో-ప్రాణంలో ప్రాణంగా పెరిగిన మనిషివి నువ్వు. నీలో యింతటి విశాలహృదయం అపూర్వం—" అన్నాడు వేణు.

కన్నకొడుకులో ఇంతటి ఆలోచనాశక్తి ఉన్నదని తెలియని పార్వతమ్మ ఆశ్చర్యంగా అతడివంకే చూస్తూండి పోయింది. అయితే అతడి పొగడ్తలామెకు సంతోషాన్ని మాత్రం కలిగించలేదు.

## 6

"అబ్బాయీ పిల్లంటే చాలా మోజులో వున్నాడు. వాడిలో యిప్పుడు మంచి మార్పు వచ్చినట్లనిపిస్తోంది. ఇలాంటి పరిస్థితుల్లో ఈ పెళ్ళి జరిపించడమే మంచిదేమో—లేకుంటే మనసు పాడై మళ్ళీ పాత బుద్ధులు వచ్చేస్తాయేమో మన వేణుకి—" అంది పార్వతమ్మ.

"అలాంటి భయాలేం పెట్టుకోకు. అయినింటి సంబంధాలు క్యూలో నిలబడి వుంటే అలవేలులాంటి పిల్లను చేసుకునే కర్మ మనకేం పట్టిందీ—" అన్నాడు రాఘవులు.

"అయితే మనమిప్పుడేం చేయాలి?"

"అబ్బాయి మనసా పిల్లమీద పూర్తిగా విరిగిపోవాలి—"

"అదెలా సాధ్యం?"

"నువ్వు వాడికి నచ్చచెప్పు—ఆ పిల్ల బుద్ధి మంచిది కాదని!"

"చెబుతాను. కానీ వాడది నమ్మొద్దూ?"

రాఘవులు కాసేపాలోచించి—"అలివేలుని సుందర్రాజు దగ్గరికి సంగీతానికి పంపించు—" అన్నాడు.

"సుందర్రాజా—....వాడి కసలే మంచి పేరు

లేదు—"

"మంచి పేరు లేదు కాబట్టే?!" అన్నాడు రాఘవులు.

భర్త ఆలోచన పార్వతమ్మకు కొంతవరకూ అవగతమయింది.

సుందర్రాజు సంగీత మేస్టరు. బాగా పాడతాడని పేరు. కాని ఆడపిల్లలను చూస్తూ ఊర్కోలేడు. బుద్ధి గడ్డితింటూనే ఉంది—యెంతమంది గడ్డి పెట్టినప్పటికీ కూడా! చూసి చూసి యెవరూ ఆడపిల్లల్నతడి దగ్గరకు పంపించరు.

"అలివేలు ఒప్పుకుంటుందా?"

"అమ్మాయికి సంగీతమంటే యిష్టమని చెప్పు!" అన్నాడు రాఘవులు—"సుందర్రాజు గురించి ఆమెకెలాగూ తెలియదు——...."

"సరే—సంగీతానికి వెళుతుంది—అప్పుడు?" అంది పార్వతమ్మ.

"ఆ సంగతి నేను చూసుకుంటాను—" అన్నాడు రాఘవులు.

పార్వతమ్మ అలివేలు దగ్గర కెళ్ళింది.

రాఘవులు సుందర్రాజు దగ్గర కెళ్ళాడు.

"సుందర్రాజా! మా యింట్లో అలివేలని ఓ అమ్మాయుంది. మారపు బంధువు లమ్మాయి. మెరుపు తీగలా వుంటుంది. అద్భుతమయిన గొంతు. నీకు శిష్యురాలిని చేయాలని నా కోరిక యెందుకో తెలుసా?" అన్నాడు రాఘవులు.

"ఎందుకు?"

"నువ్వామెను పెళ్ళి చేసుకుంటే ఈడూ జోడూ

బాగుంటుంది. ఇద్దరూ ఉమ్మడి కచేరీలు చేసి లక్షలార్జించ వచ్చు—...." అన్నాడు రాఘవులు.

అందమయిన పిల్లను పెళ్ళాడి—ఆ పిల్లకు సంగీతం నేర్పి—ఆమె ద్వారా లక్ష లార్జించాలన్న కోర్కె సుందర్రాజుకు వయసొచ్చినప్పట్నించీ వుంది. అతడి వయ సిప్పుడు ముప్పై. ఇంతవరకూ యే అందగత్తే అతణ్ని కరుణించలేదు.

"ఆ అమ్మాయి నన్ను పెళ్ళి చేసుకుంటుందా?"

"అంత సులభంగా ఒప్పుకోదు. ప్రస్తుతానికి మా వాడిమీద కన్నేసింది. ఆ పిల్ల అందానికి లొంగిపోతా రేమో మా వాడని భయం. నీ దగ్గరికి పాఠాలకు పంపి స్తాను. నువ్వామెను వశపర్చుకోగలిగితే నీకే యిచ్చి పెళ్ళి చేస్తాను—...."

"ఓహో—అదన్న మాట కథ!"

"నీ కిష్టం లేదంటే చెప్పు. అలివేలుకు వేరే సంబంధం చూడగలను ..."

"నా దగ్గరకు పంపించండి. మీ కింక వేరే సంబంధం చూడాల్సిన అవసరముండదు—" అన్నాడు సుందర్రాజు.

ఇలాంటి ప్రోత్సాహ మేమీ లేకుండా నే సుందర్రాజు మనసు చెడ్డది. రాఘవు లగ్నికి ఆజ్యం పోశాడు.

పార్వతిమ్మ అలివేలును సుందర్రాజు దగ్గర సంగీతం నేర్చుకోవడాని కొప్పించింది. అలివే లతడికద్దకు సంగీతానికి వెళ్ళ నారంభించింది.

## 7

సుందర్రాజు అలివేలుతో మొదటి రోజంతో జాగ్రత్తగా వున్నాడు. ఆమె అందం మాత్రం అతడికి వెర్రి

తించింది. రెండోసారి తాళం పేరు చెప్పి తన చేతుల్ని ఆమె తొడలపై వేశాడు. మృదువుగా ఆమె తొలగించింది. క్రమంగా జావళీలకు అర్థాలు వివరిస్తూ చనువు పెంచసాగాడు.

"మేస్టారూ—మీ వరస బాగోలేదు...." అంది అలివేలు కోపంగా.

"అది నేను కట్టిన వరస కాదు—అన్నమయ్యది—" అన్నాడు సుందర్రాజు.

"నేను చెబుతున్నది మీ వరస గురించి—"

"ఏ వరస?" అన్నాడతడేమీ ఎరుగనట్లు.

"మీ ప్రవర్తన బాగోలేదు—...."

"నేనేం చేశాను?"

బదులివ్వకుండా కోపంగా అతడివంక చూసింది అలివేలు.

"ఏం చేశానో చెప్పు—" అన్నాడు సుందర్రాజు.

"మీకే తెలుసు—...."

"తెలిసినా సరే—నీ నోట వింటే బాగుంటుంది...."

సుందర్రాజు ధైర్యానికి అలివేలు ఆశ్చర్యపడింది. తానతడి ప్రవర్తనకు అభ్యంతరం చెప్పింది. అతడేం చేశాడో తన నోట వినాలనుకుంటున్నాడు.

ఆమె మౌనం వహిస్తే అలుసుగా తీసుకుని సుందర్రాజామె భుజం చుట్టూ చేయివేశాడు.

"వదులు—" అంది అలివేలు.

"వదలను—" అన్నాడు సుందర్రాజు.

ఆమె విదిలించుకోబోయింది. అతడామె కంటె బలవంతుడు.

ఆమె తిట్టింది. అతడామెకంటే మొండివాడు.

"ఇది చాలా అన్యాయం—" అందామె అసహాయంగా.

"నువ్వు నాకు సహకరిస్తే ఏ అన్యాయం జరగదు-" అన్నాడు సుందర్రాజు.

"అంటే?"

"నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను—...."

"ఈ మాట ముందే చెప్పాల్సింది. నీవంటి సంగీత విద్వాంసుణ్ణి పెళ్ళిచేసుకోనే అవకాశం నా అదృష్టంగా భావిస్తాను—" అంది అలివేలు.

సుందర్రాజు ముఖం వికసించింది — "ముందుగా చెప్పలేకపోవడం నా పొరపాటే?" అన్నాడు.

"ఈ రోజుకు నన్ను వదిలిపెట్టు పెద్దలు అనుమతిస్తే మనం గుళ్ళో పెళ్ళిచేసుకుందాం. పెళ్ళికి ముందిలా నాకు నచ్చదు—...."

"పెద్దల అనుమతి గురించి నువ్వు బెంగ పడకు. రాఘవులు మన పక్షమే!" అన్నాడు సుందర్రాజు.

"నీకెలా తెలుసు?"

"నిన్నాయన నా దగ్గరకు సంగీతానికి పంపినదెందుకనుకున్నావ్?"

అలివేలుకు క్షణాల్లో అంతా అర్థమయింది. అయితే ఆమె బయటపడకుండా—"మాటమాత్రంగా విషయమింట్లో చెప్పడం నాకు మర్యాద! నన్నాదరించినవారి ఆశీర్వాదం పొందకుండా ఏ నిర్ణయం తీసుకోలే—" అంది.

సుందర్రాజామె మాటలు నమ్మాడు. ఆరోజుకామెను వదిలిపెట్టాడు.

# 8

ఇట్లు చేరుకున్నాక అలివేలు బాగా ఆలోచించింది. విషయాన్ని వేణు ద్వారా వెళ్ళనివ్వకూడదని ఆమె అనుకొంది. అందుకే ఫోనులో మధురనాయకికి జరిగింది చెప్పింది.

మధురనాయకి మనుషుల్ని పంపించింది. సుందర్రాజుకు దేహశుద్ధి జరిగింది. మరోసారి అలివేలు జోలికి వెడితే ప్రాణాలు కూడా దక్కవన్న హెచ్చరిక కూడా అందింది.

సుందర్రాజు రాఘవులికి చెప్పుకొని లబోదిబోమన్నాడు. ఏం జరిగివుంటుందో రాఘవు లూహించాడు.

"నవ్వోపని చేయి. తన ప్రియుణ్ణి కలుసుకుందుకు అలివేలు నీ ఇల్లు ఎన్నుకుందనీ—నువ్వది కొనసాగనివ్వక పోతే ఆమె ప్రియుడు నిన్ను చావకదన్నాడనీ వేణుకు చెప్పు."

"అందువల్ల నాకేం ప్రయోజనం?"

"ఏమిటా? అలివేలు ఆశలన్నీ మావాడిమీదే—నువ్వాదారి మూసేయాలి. అప్పుడామెకు నువ్వు తప్ప వేరే దిక్కుండదు—...."

సుందర్రాజుకీ పథకం నచ్చింది. అతడు రాఘవులు చెప్పినట్లే చేశాడు. అతడు చెప్పింది విని వేణు ఆశ్చర్య పడ్డాడు. అయితే అతడు తొందరపడకుండా నిదానించాడు. ముందుగా మధురనాయకిని కలుసుకొని అలివేలు బుద్ధి మంచిది కాదన్నాడు.

మధురనాయకి అతడు చెప్పింది విని — "అసలు జరిగింది తెలిస్తే నువ్వాశ్చర్యపడతావు. మీ నాన్నకు అలివేలు నీ భార్య కావడం ఇష్టంలేదు...." అంటూ జరిగింది వివరంగా చెప్పింది.

"అలివేలు చేసిన తప్పేమిటి?" అన్నాడు వేణు ఆశ్చర్యంగా.

"చెడిన ఆడది—"

"నాకు లేని అభ్యంతరం మా నాన్నకెందుకు?"

"మీ నాన్న పెంపకంలో నువ్వు ఇరవై యేళ్ళకు పైగా పెరిగావు. ఆ పెంపకం నిన్నెలా తీర్చిదిద్దిందో నీకు తెలుసు. కొద్దిరోజుల పరిచయంతో నేను నిన్నెంత ఎత్తుకు తీసుకొనిపోయానో నీకు తెలుసు. మీ నాన్నకు నావంటి స్నేహితులు లేక సంస్కారంలో యెదగలేక పోతున్నాడు—" అంది మధురనాయకి నిరసనగా.

"నీకు భయంలేదు. నాన్న నెగిరించైనాసరే—నేను అలివేలును పెళ్ళిచేసుకుంటాను—" అన్నాడు వేణు.

"అలాగే—కానీ ముందు నా బాకీ తీర్చినాకనే నీ పెళ్ళి—ఈ విషయం మర్చిపోకు—" అంది మధుర నాయకి.

వేణు నిట్టూర్చి ఊరుకున్నాడు.

"దిగులుపడకు. నువ్వు అలివేలునోకంట కనిపెట్టి కాపాడుకుంటూండు. నీవల్లకాని పనుంటే నా దగ్గరకు రా!" అంది మధురనాయకి.

# 9

"ఎవరూ?" అన్నాడు రాఘవులు.

ఇంట్లో ఆయనొక్కడే వున్నాడు. భాగ్యశమ్మ పొరుగింటికి వెళ్ళింది. ఆ రోజాయన ఆఫీసుకు సెలవు. వేణు మాత్రం ప్రెస్ పనిమీద బయటే తిరుగుతున్నాడు.

కుంటుకుంటూ లోపలకు వచ్చింది అలివేలు.

"ఏమయింది?" అన్నాడు రాఘవులు.

అలివేలు ఆయన దరిదాపుల్లో మసలడం అరుదుగా

జరిగేది. ఆమె యెప్పుడూ పార్వతమ్మవంటి పెట్టుకొని తిరిగేది. అరుదుగా రాఘవులు కళ్ళపడడం జరిగేది.

"కాలిలో ముల్లు దిగింది మామయ్యా!" అంది అలివేలు.

పిన్నీసుతో ఆమె పాదాల్లో ముల్లును వెతకడానికి ప్రయత్నించిన రాఘవులికప్పుడు హృదయంలో యేదో ముల్లు గుచ్చుకుంది. తను భ్రమపడుతున్నాడో నిజంగా జరుగుతోందో తెలియదు కానీ అమాయకంగా నటిస్తూనే రాఘవుల్ని రెచ్చగొట్టింది అలివేలు.

ఆగోజాకది ప్రారంభం మాత్రమే!

క్రమంగా రాఘవులలో అలివేలుపట్ల మోజు కలిగింది. పెరిగింది. ఆమెనతను స్త్రీగా గుర్తించాడు. ఆ గుర్తింపతడిలో కొత్త కోర్కెలు చిగురింపజేసింది.

చివరకు వీలున్నప్పుడల్లా ఆయన కాస్త చనువు చూపించసాగాడు.

అలివేలు ఆయన్ను ప్రోత్సహించిందే తప్ప నిరుత్సాహపర్చలేదు.

జగన్మోహినీ అవతారానికి పరమశివుడు చలించిపోయాడు. భస్మాసురుడు భస్మమయ్యాడు. రాక్షసు అమృతాన్నే వదులుకున్నారు.

రాఘవులకి వావివరుసలు గుర్తుంటాయా?

ఆయన తన మనసులోని తప్పును గుర్తించడానికి బదులు—అలివేలు గత జీవితంలోని తప్పును వెదకసాగాడు.

అలా వారంరోజులు గడిచేసరికి ఒకరోజున ఆయన అలివేలుతో—"నువ్వు చాలా అందగత్తెవి-" అన్నాడు.

"నా సంగతి నువ్వు చెప్పావు. నీ సంగతి నేను

చెప్పనా?" అంది అలివేలు.

"ఊఁ" అన్నాడు రాఘవులు.

"వేణుకి నువ్వు తండ్రిలా కాక అన్నయ్యలా కని పిస్తావు—" అంది అలివేలు.

అప్రయత్నంగా రాఘవులు చేయి తన గుబురుమీసాల పైకి వెళ్ళింది.

"చెప్పాలంటే నాకు నువ్వంటేనే యిష్టం—" అంది అలివేలు.

రాఘవులు తెల్లబోయాడు.

"ఆ తయ్యిష్టపడితే నాకు నిన్ను రెండో పెళ్ళి చేసు కోవాలనుంది—...."

రాఘవులుచితానుచితాలు మరచి, వివక్షణా జ్ఞానాన్ని కోల్పోయి అలవేలును కౌగలించుకొన్నాడు. ఆమె అతణ్ణి మృదువుగా విదుల్చుకొని — "ఇదికాదు సమయం!" అంది.

"మరెప్పుడు?"

"ఈ రాత్రికి...." అంది అలివేలు.

"నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తున్నావా?" అన్నాడు రాఘవులు.

"ఊఁ."

"ఎందుకని?"

"నీ కొడుకు వేణు గతం మంచివికాదు. అతడంటే నాకు అసహ్యం. నువ్వెంతో మంచివాడివి. ఉన్నతుడివి. నీవంటి వాడికిల్లాలినైతే ఇహమూ, పరమూను...."

## 10

ప్రెస్‌నుంచి తిన్నగా పార్కుకు వెళ్ళాడు వేణు. అప్పుడక్కడ అలివేలు యెదురుచూస్తూ వుంది.

"ఆలస్యం చేశానా?" అన్నాడు వేణు.

"నా మనసుకు ఆలస్యం. వాచీ ప్రకారం కాదు-...."

"ఏమిటో చెప్పాలన్నావు?"

"ఇన్నాళ్ళూ దాచిన నిజమొకటి బయటపెట్టాలను కుంటున్నాను—"

"ఏమిటట?"

"మధురనాయకి మీ నాన్న గురించి చెప్పిన విశేషం నువ్వు నాకు చెప్పావు. అప్పుడే నేను నీకు నిజం చెప్పే యాల్సింది—" అంది అలివేలు.

"ఏమిటది?"

"చాలాకాలంగా మీ నాన్న నా వెంట బడు తున్నాడు—"

వేణు తెల్లబోయి—"ఏమిటీ?" అన్నాడు.

అలివేలతడికి క్లుప్తంగా రాఘవులు ప్రవర్తన గురించి చెప్పింది.

"మా నాన్న అలాంటివాడంటే నమ్మలేను—" అన్నాడు వేణు.

"అందుకే చెప్పడానికి తటపటాయిస్తున్నాను. మగా ళ్ళంతా ఇంతే!"

"ఇన్నాళ్ళూ ఆగి—ఇప్పుడే యెందుకు చెప్పావు?" అన్నాడు వేణు అనుమానంగా ఆమె వంక చూస్తూ.

"ఎందుకంటే ఈ రాత్రికి మీ నాన్న నాకు శోభనం ముహూర్తం పెట్టాడు కనుక!"

"ఏమిటీ?"

అలివేలు అదోలా నవ్వి ఊరుకుంది.

"ఛీ....ఛీ...." అన్నాడు వేణు.

ఆమె మాట్లాడకుండా అతడి వంకే చూసింది.

"నువ్వేమన్నావు?"

"ఏం చేయాలో తెలియక—ఇప్పుడు నీకు చెప్పుకొంటున్నాను...."

"అమ్మకు తెలుసా?"

"అత్తయ్యకు తెలిసినా చూసీచూడనట్లూరుకుంటుంది. ఏదోవిధంగా నీకూ నాకూ పెళ్ళి తప్పిపోవాలన్నది—ఆమె కోరిక!"

"ఛీ .. ఛీ...."అన్నాడు వేణు.

"నావల్ల తప్పు జరిగిందని మీ ఇట్లో నేనంటే చిన్న చూపు. నేనైతే వయసులో వున్న ఆడపిల్లను. పెళ్ళి పేరు చెబితే మోసపోగలను. కానీ మీ నాన్నకేమవసరం? ఆయనెందుకు తప్పుచేయాలనుకుంటున్నాడు?"

"ఆయనకు తెలుసు—నేను నిన్ను పెళ్ళిచేసుకొంటానని! కొడుకు భార్య కూతురితో సమానం...! మన పెళ్ళి చెడగొట్టడానికే అయినా—ఆయన యెన్నుకొన్న పద్ధతి జుగుప్సాకరంగా వుంది. అడిగిన వెంటనే నువ్వాయన్ను సాచి లెంపకాయ కొట్టవలసింది—" అన్నాడు వేణు.

"అలా కొడితే నామాటెవరు నమ్ముతారు? అందరి దృష్టిలోనూ నేను చెడిన ఆడదాన్ని. మీ నాన్న మర్యాదస్తుడు. నేనే యేదో చేశానంటారు. అందరూ యేమనుకొన్నా నీ దృష్టిలో నేను చెడ్డదాన్ని కాకూడదు. అందుకే మీ నాన్నను నా గదికి ఆహ్వానించాను రాత్రికి."

వేణు తెల్లబోయి — "నువ్వేదైనా నాటకమాడుతున్నావా?" అన్నాడు.

"నాటకం నాదే అనుకో! రాత్రి మీ నాన్న గదికి వచ్చి నాతో సరససల్లాపాలు మొదలెడితే అందులో ఆయన తప్పుందంటావా లేదా? సిగ్గులేక నేను పిలిచా

ననుతో ఆ వెనువెంటనే అంగీకరించడమేనా? ఆయన సంస్కారం?"

"ఐయామ్ సారీ అలివేలూ! నువ్వాయన్ని పిలుస్తావని నేననుకోను. ఆయన నీ గదికి వచ్చి తప్పుగా ప్రవర్తిస్తే- ఆ తప్పంతా పూర్తిగా ఆయనదే! అసలే నేనావేశ పరుణ్ణి ... ఆ సమయంలో నేనేం చేస్తానో నాకే తెలియదు...."

"ఈ రాత్రి ముందుగానే నా గదికి వచ్చి మంచం కింద దాక్కో. ఏం జరుగుతుందో గమనించు. తర్వాత నేనేం చేయాలో సలహా ఇవ్వు...." అంది అలివేలు.

అప్పుడే వేణు పిడికిళ్ళు బిగుసుకోవడం అలివేలు గమనించింది.

# 11

ఆ రాత్రి ఉక్కగా వుందని తన మంచం పెరట్లో వేయించుకొన్నాడు రాఘవులు. తనకు సాయంగా వుంటుందని పార్వతమ్మ మంచంకూడా పెరట్లో వేయించాడు.

సాధారణంగా పార్వతమ్మ, అలివేలు — ఓ గదిలో పందిరి మంచంమీద పడుకొంటారు. ఆరాత్రికి అలివేలు మాత్రమే పందిరి మంచంమీద పడుకుంది.

భార్యకూ, కొడుక్కూ మంచినీళ్ళలో నిద్రమాత్రలు కలిపిచ్చాడు రాఘవులు తండ్రిని వేయి కళ్ళతో కనిపెడుతున్న వేణు తనుమాత్రం ఆ మంచినీళ్ళు తాగలేదు. అతడు పెరట్లో పడుకోనేందుకూ అంగీకరించలేదు. పందిరి మంచం గదినానుకొనే వున్న గదిలో పడుకుంటానన్నాడు. తను నిద్రమాత్రల నీళ్ళు తాగినట్లే తండ్రిని భ్రమపెట్టి నిద్ర ముంచుకొస్తోందని తన గదికి వెళ్ళి— అక్కణ్ణించి పందిరి మంచం గదిలోనికి వచ్చి మంచం

క్రింద చూస్తున్నాడు.

భాగ్యమ్మ నిద్రపట్టగానే రాఘవులు లోపలకు వచ్చాడు. ఉత్సాహంగా అలివేలుతో కబుర్లు ప్రారంభించాడు. అలివేలు నర్మగర్భంగా మాట్లాడుతూంటే తను మాత్రం పరసభావణలు మొదలెట్టాడు.

అతడి చనవు పెరుగుతోంది.

అలివేలు అభ్యంతర పెడుతోంది.

రాఘవులు తన గొప్పతనాన్ని వర్ణిస్తున్నాడు. ఆ వర్ణనలో అసభ్య పదజాలాలు దొర్లుతున్నాయి. తన కొడుకును కించపరుస్తున్నాడు. వాడు నీకు తగ్గవాడు కాదు— నేనే నీకు తగినవాణ్ని అంటున్నాడు.

రాఘవు లప్పుడు నిషాలో ఉన్నాడు. అలివేలిచ్చిన ప్రోత్సాహపు నిషా అది! అలివేలును చూస్తున్న నిషా అది! అలివేలుపై కోర్కె పుట్టించిన నిషా అది!

అతడి నిషా అతడి మాటలను, చేతలను అదుపు తప్పిస్తోంది. ఓ స్థితికి వచ్చేక అలివేలు ప్రతిఘటించడం మొదలెట్టింది. రాఘవులు బలం చూపించసాగాడు. ఆ వయసులో కూడా అతడి బలం అలివేలు బలాన్ని మించింది.

వేణులో ఆవేశం పెరిగింది. మంచంకింద చిన్న ట్రంకు పెట్టి వుంది. దాన్నతడు కసిగా బయటకొక తోపు తోశాడు.

చప్పుడుకు రాఘవు లులిక్కిపడి లేచాడు.

అలివేలు మంచం దిగి బట్టలు సవరించుకుంది.

వేణు మంచం కిందనుంచి బయటకు వచ్చి లేచి నిలబడి తండ్రిని పట్టుకుని కుదుపుతూ—"నువ్వు మనిషివి

కాదు. రాక్షసుడివి— ....” అన్నాడు.

“నువ్విక్కడికెలా వచ్చావ్?” అన్నాడు రాఘవులు తెల్లబోతూ.

“ఎలాగో వచ్చాను....నీకు నీ వయసు గుర్తుందా? నా వివరసలు గుర్తున్నాయా?” అన్నాడు వేణు.

అలివేలు అక్కణ్నించి వెనక్కు వెళ్ళింది. మంచం కింద నుంచి నూటిగా వెళ్ళి గోడకు తగుల్కున్న చిన్న ట్రంకు మూతవిడి వుంది. ఆమె పెట్టెని సరిచేస్తూ లోపలి గుడ్డలనోసారి విదిపింది.

ఖంగుమన్న శబ్దమైంది.

పనసకాయ కత్తి ఒకటి నేలమీద పడిన శబ్దమది!

వేణు వెనక్కు తిరిగి ఆ కత్తిని చూశాడు.

“ఇందులో నా తప్పేమీ లేదు. ఈ అలివేలు కులట.... ఇదే నన్ను ప్రోత్సహించి గదిలోకి రప్పించుకుంది....” అన్నాడు రాఘవులు తడబడుతూ.

“ఛీ....అది రమ్మంటే మాత్రం నీ బుద్దేమయింది?”

అలివేలు ఆ తండ్రీ కొడుకులను....పనసకాయ కత్తిని మార్చి మార్చి చూస్తోంది. వేణు ఆమె నుద్దేశించి— “అలివేలూ! అమ్మను పిల్చుకుని రా! ఈ నీతిపరుడి అసలు రంగు బయటపెడతాను....” అన్నాడు.

అలివేలు గదిలోంచి బయటకు వెళ్ళింది. ఆమె పార్వతమ్మను నిద్రలేపుతూండగా హృదయవిదారకమైన ఆర్త నాదం ఒకటి వినబడింది.

## 12

“శభాష్ అలివేలూ!” అంది మధురనాయకి.

ఆ గదిలో ఆమె, అలివేలు కాక—మరో వ్యక్తి

వున్నాడు. అతడు కాషాయాంబరాలు ధరించి ఉన్నాడు.

"ఇందులో నేను చేసిందేమీ లేదు. అంతా మీరు చెప్పినట్లు జరిగింది—" అంది అలివేలు మధురనాయకి వంక చూస్తూ.

కాషాయాంబరధారి అలివేలువంకే చూస్తూ—"నాకిద్దరు చెల్లెళ్ళు ఇద్దరూ చదువులకు సరస్వతులు. అందంలో దేవకన్యలు. అమ్మా నాన్నా లేని కారణంగా వాళ్ళను నా ప్రాణంగా పెంచాను. ఎలా పడ్డారో వాళ్ళిద్దరూ రాఘవులు పన్నిన ఉచ్చులో పడ్డారు. ఒకరికి తెలియకుండా ఒకరిని గుళ్ళో దొంగ పెళ్ళి చేసుకున్నాడు రాఘవులు. సమయం వచ్చేదాకా పెళ్ళి విషయం రహస్యంగా ఉంచాలన్నాడు.

ఇలాంటి రహస్య మెంతో కాలం దాగదు. వాళ్ళిద్దరూ గర్భవతులయ్యారు. ఇద్దరికీ భర్త ఒకడేనని తెలిసేక చెల్లెలి కోసం అక్క ప్రాణాలు తీసుకుని త్యాగం చేసింది. అప్పుడు రాఘవులు తనకు అప్పటికే పెళ్ళయిందనీ—నా చెల్లెలి గురించి తనకేమీ తెలియదనీ చెప్పాడు. ఆమె కూడా ఆత్మహత్య చేసుకుంటున్నట్లు చీటీ రాసి నన్ను వదిలి వెళ్ళిపోయింది.

వాళ్ళిద్దరూ మోసపోయారని తెలుసుగానీ ఎవరివల్ల మోసపోయారో నాకు తెలియదు. జీవితమంటే విరక్తి పుట్టింది. ప్రాణాలు నిలబెట్టుకునేందుకు బ్రతుకుతూ, బ్రతకడానికి ప్రాణాలు నిలబెట్టుకుంటూ రోజులు గడుపుతూన్న నాకు—అనుకోకుండా నా రెండో చెల్లి దర్శనమయిందిక్కడ. ఆమెను మధురనాయకి రక్షించి బ్రతికిం

చిందని తెలిసి సంతోషించాలో యేడ్వాలో అర్థం కాలేదు.

మధుర నాయకి నా కథ విని రాఘవులుకి బుద్ధి చెప్పా అంది. నా చెల్లి ద్వారా నాకు రాఘవులు ఆచూకీ తెలిసింది. రాఘవులి కెలా బుద్ధి చెప్పాలా అని ఆలోచిస్తూండగా వేణు మధురనాయకింట్లో ప్రవేశించాడు. అప్పుడు నేను పార్వతమ్మ యింట్లో సన్యాసిగా ప్రవేశించాను. నాకు వచ్చిన హిప్నాటిజంతో నాలో మహిమ లున్నట్లూ మెను భ్రమ పెట్టాను. చెడిన ఆడదిగా నువ్వు రాఘవులింట్లో ప్రవేశించావు. వేణు బాగుపడ్డాడు. రాఘవులి అసలు రంగు బయటపడింది...."

మధుర నాయకి నిట్టూర్చి—"మోసపోయిన ఆడపిల్లలు ఆత్మహత్యలు మాని—హత్యలు చేయాలి. అప్పుడే మగాడిలో భయం పుడుతుంది. ఈ ప్రపంచంలో నే నెవరినైనా క్షమించగలను కానీ స్త్రీని మోసం చేయాలనుకున్నవాడిని క్షమించలేను. అలాంటి వాళ్ళను వెతికి వెతికి వేటాడాలన్నది నా శపథం!" అంది.

"చెడిపోయిన కొడుకు బాగుపడ్డాడు. బాగుపడిన తండ్రి చెడిపోయాడు. చెడి బాగుపడ్డ కొడుకు బాగుపడి చెడిన తండ్రిని—ఆవేశం పట్టలేక కత్తితో పొడిచి చంపేశాడు.... శిక్ష బాగుంది కదూ!" అన్నాడు కాషాయాంబరధారి.

"బాగుపడిన కొడుకు వైభవం కళ్ళారా చూసుకోవాలని యే తండ్రికైనా ఉంటుంది. ఆ అవకాశానికి దూరం కావడానికి మించిన శిక్ష ఏ తండ్రికీ వుండదు. ఆ కొడుకే తండ్రిని హత్య చేయడం.... ఊహ కందనంత

భయంకర శిక్ష....అంది మధురనాయకి.

"స్త్రీ సంక్షేమాన్ని కోరి మీరింత దారుణానికి ఒడి గట్టగలిగారు. కానీ ఆ స్త్రీలలోనే పార్వతమ్మ వంటి త్యాగమూర్తులూ వున్నారు. వాళ్ళు చెడ్డవాళ్ళకు ప్రాణం పోస్తున్నారో, మంచితనానికి బాసట అవుతున్నారో నాకర్థం కావడంలేదు—" అంది అలివేలు సాలోచనగా.

"పార్వతమ్మ త్యాగం కూడా స్త్రీ సంక్షేమానికే!" అంది మధురనాయకి—"తను తప్పు చేస్తూ—కూతురు లాంటి పిల్లని కాంక్షిస్తూ—అందుకా పిల్ల బుద్ధినే తప్పు పట్టిన తండ్రి ప్రవర్తన కొడుకులో ఎలాంటి ఆవేశాన్ని రెచ్చగొట్టిందో కళ్ళారా చూసిన పార్వతమ్మ—కొడుకు చేసినది మంచిపనే అని గ్రహించింది. ఆమెపై సన్యాసి మాటల ప్రభావమూ వుంది.

ఆ కత్తి కొడుకు ప్రాణాలు తీస్తుందంటే అర్థం— అతడు దానితో హత్య చేయబడతాడనే కాదు. దానితో హత్య చేసినా—హంతకుడై ఉరి తీయబడతాడు కదా! కొడుకు చంపింది ఓ దుర్మార్గుణ్ని! అందుకే ఆమె కొడుకును కాసేపు కాంతించమంది. ఈ లోగా ఓ చీటీ రాసింది. రాఘవులు చేయబోయిన తప్పును వివరిస్తూ— ఆ ఆవేశంలో తనే అతణ్ని చంపానని రాసింది. తర్వాత రాఘవులు హత్యచేయబడ్డ కత్తితో తన ప్రాణాల నంతం చేసుకుంది. హంతకుడు కేణు హంతకుడు కాకుండా తప్పించుకున్నాడు. అతడి ప్రవర్తన అతడి తల్లి చేత త్యాగాన్ని చేయించింది—...."

అలివేలు ఆలోచిస్తోంది.

## 46

వేణు హత్యకేసు నుంచి తప్పించుకున్నాడు. కానీ అతడి మనసు తప్పించుకోగలదా?

హంతకుడయిన వేణును తన భర్తగా అంగీకరించ గలదా?

....కాలమే అన్ని గాయాలూ మాన్పగలదు. అన్ని ప్రశ్నలకూ బదులివ్వగలదు.

మరో ఆరోమాసాల తర్వాత వేణు అలివేలును పెళ్ళి చేసుకున్నాడు.

—:అ యి పో యిం ది:—

# దెయ్యం పిలుస్తోంది!

సుంకరి రాంప్రసాద్

అరకు రైల్వేస్టేషన్‌కు రెండు కిలోమీటర్ల దూరంలో ఉంది ఆ జలపాతం.

నీలి కొండలమీద పచ్చగా పరచుకుని వున్న దట్టమయిన అడవి కనుల విందు చేస్తూంది.

వనకన్య ధరించిన తెల్లని పయ్యెద పిల్లగాలికి అల్లల్లన ఎగురుతూందా అన్నట్లుగా వుంది పర్వత శిఖరం నుండి జాలువారుతున్న ఆ జలపాతం. చెవులు గింగురుమనేలా వినిపిస్తున్న ఆ జలపాతపు హోరుతో ఆ లోయంతా ప్రతిధ్వనిస్తూంది.

ఆ మనోజ్ఞ దృశ్యం చూస్తూ పరవశంతో వళ్ళు మరిచిపోతూంది సునంద.

అంత ఆనందంలోనూ ఆ ఉధృత జలపాతాన్ని చూస్తుంటే ఆమె గుండెల్లో యేదో తెలియని తీయని భయం. ఒకప్రక్క ఆ హోరును, ఆ జలపాతపు జోరును చూద్దామని కొండంత ఆశ, ఆరాటం. కనులువిప్పి చూస్తే

ఏదో భయం, బెరుకు. దీనినే తీయని భయం అంటా
రేమో!

తన భర్త విజయ్ చేతిని గట్టిగా పట్టుకుని చూడ
సాగింది ఆమె. ఈ మధ్యనే పెళ్ళయిన క్రొత్త దంపతులు
వారు. ఒకవిధంగా వారి కిది హనీమూన్ ట్రిప్.

మనసుకు మత్తెక్కిస్తున్న ఆ ప్రకృతి అందాల మధ్య
ఒకరికోసం ఒకరులా తామిద్దరమే ఉన్నామన్న భావన
వారిలో ఏదో తెలియని పరవశత్వాన్ని కల్గించసాగింది.
ప్రేమగా సునందను దగ్గరకు తీసుకున్నాడు విజయ్.
గువ్వలా అతడి కౌగిలిలో ఒదిగిపోయిందామె.

కళ్ళల్లో ఆరాధన ఉట్టిపడుతుంటే ఆమె రెండు
చెక్కిళ్ళనూ దోసిలిలోనికి తీసుకున్నాడతడు. పరవ
శత్వంతో అరమోడ్చిన ఆమె సోగ కన్నులలోని
ఆహ్వానం, ఎర్రని పెదవులమీద సన్నగా మెరిసిన దర
హాసం అతడిని వివశుడ్ని చేసాయి. పట్టలేని తమకంతో
ఆమె పెదవులను గాఢంగా చుంబించాడతడు.

యుగాలు క్షణాలుగా కాలం తీయగా కరిగే వేళ,
వారి ఆనందానికి రసభంగం కల్గిస్తూ వారి చెవులకు
సోకింది ఒక స్త్రీ ఆర్తనాదం.

భరించలేని బాధతో అరచినట్లున్న ఆ ఆక్రందనతో
ఆ లోయంతా మారుమ్రోగింది. ఆర్తితో గుండెలు పిండే
సేలా ఉంది ఆ గొంతు.

మరుక్షణం వారు ఆ ఆర్తనాదం వినవచ్చిన దిక్కుకు
పరుగెత్తారు. ఎంతోదూరం పరుగెత్తవలసిన పనే లేక
పోయింది వారికి. సుమారు వెయ్యిగజాల దూరంలో
ఏపుగా పెరిగిన పొదలమాటున కనిపించింది వారికి
అత్యంత బీభత్సమైన దృశ్యం.

ఆ దృశ్యాన్ని చూసిన మరుక్షణం 'కెవ్వు'మని కేక పెట్టింది సునంద. ఆ ఆర్తనాదం యెలా వినవచ్చిందో వారికి ఆ క్షణంలోనే అర్థమయిపోయింది.

అక్కడున్న కొండరాళ్ళ మధ్య పడివుంది ఒక అందమయిన యువతి శవం. సుమారు పాతికేళ్ళ లోపే వయసుంటుంది. చక్కగా తీర్చిదిద్దినట్లున్నాయి పొంకమైన ఆమె అవయవాలు.

ఆమె తల రక్తసిక్తమయి వుంది. ఆమె పడివున్న బండరాయిమీద, ఆమె తల వున్న భాగంలో రక్తం మడుగు కట్టివుంది. ఆమె వంటిమీదున్న తెల్లని చీరమీద చిందిన ఎర్రని రక్తపుమరకలు మరింత బీభత్సంగా కనిపిస్తున్నాయి.

పదిగజాల దూరంలో నుండి చూస్తున్నా వారు ఆ శవాన్ని గుర్తుపట్టగలిగారు. ఆమె నాగమణి.

అరుకులో వారుంటున్న ట్రావెలర్స్ బంగళాలో వారి ప్రక్కగదిలోనే నాగమణి కూడా వుంటూంది. తాను పాడేరులోని ఎలిమెంటరీస్కూల్లో టీచర్‌గా పని చేస్తున్నానని, వారిలాగే తాను కూడా అరకులోయలు చూడటానికి వచ్చానని, ఏదో మాటల సందర్భంలో సునందతో చెప్పింది నాగమణి.

వారు ఒకరినొకరు కలుసుకున్నది కేవలం రెండు రోజుల క్రితమే అయినా, యెప్పుడూ గల, గల నవ్వుతూ యెంతో కలుపుగోలుగా కబుర్లు చెప్పే నాగమణి పట్ల సునందకు ఒకరకమైన యిష్టం యేర్పడింది.

అలాంటి నాగమణిని యిలా ఆకస్మాత్తుగా శవంగా చూసేసరికి, సునంద ఆ షాక్ తట్టుకోలేకపోయింది.

భయంతో, పాలిపోయిన ముఖంతో తోటకూర కాడలా వడలిపోతున్న సునంద భుజాలు పట్టుకుని మెల్లగా నడిపించుకుంటూ ఆ ప్రదేశం నుండి దూరంగా తీసుకుపోయాడు విజయ్.

మళ్ళీ వారు కనీసం వెనుతిరిగి కూడా చూడలేదు. ఒకవేళ చూసే ఉండినట్లయితే....?

ముందు ముందు ప్రారంభం కానున్న మారణహోమానికి నాందిగా. సన్నగా అస్పష్టంగా, వికృతంగా నవ్వుతున్న నాగమణి శవాన్ని వారు గమనించేవారేమో!

## 2

"సునందా! ఫర్ గాడ్ సేక్ మనం ఆ విషయాన్ని పూర్తిగా మరచిపోవడం మంచిది" అన్నాడు విజయ్.

"కానీ....దిక్కులేని ఆ శవం ..."

"సునందా" అంటూ భార్య మాటలను మధ్యలోనే కట్ చేసాడతను.

"నేనెందుకు చెబుతున్నానో కాస్త అర్థం చేసుకో డార్లింగ్. ఇప్పుడు మనం ఆ శవాన్ని చూసినట్లు నిజమే చెప్పామనుకో. ఏముంటుంది....పోలీస్ కేస్ ప్రారంభమవుతుంది. అది హత్యా? ఆత్మహత్యా? అని దానిపై ఎంక్వయిరీ. ఆమెకూ మనకూ యేమిటి సంబంధమని లక్ష యక్ష ప్రశ్నలు. ఓహ్! మనకెందుకూ లేనిపోని తద్దినం?

"కనీసం ఆ నాగమణి యెవరో కూడా, యిక్కడకు వచ్చేవరకూ మనకు తెలియదు. ఏదో హాల్లో అంటే హాల్లో అనుకున్నాం. దట్సాల్. యిప్పుడు కోరి ఆమె చావును మన పీకలమీదకు తెచ్చుకోవడం ఎందుకు?"

ట్రావెలర్స్ బంగళాలోని తమ గదిలో కూర్చుని భార్యకు నచ్చచెప్పసాగాడు విజయ్.

"అంటే మీరనేది నాగమణి చనిపోయిన విషయం" అంటూ భర్తవైపు సందిగ్ధంగా చూసింది సునంద.

"అసలు నాగమణి ఎవరో కూడా మనకు తెలియదు డార్లింగ్. మనం అక్కడేమీ చూడలేదు. అంతే! ఆ విషయం నీ దగ్గర కూడా నోరు జారనని నాకు ప్రామిస్ చేయాలి...." అంటూ ఆమె కుడిచేతిని తన తలపై వేసుకున్నాడు విజయ్.

ఒట్టుపట్ల హిందూ స్త్రీలకుండే నమ్మకం, గౌరవం విజయ్‌కు తెలుసు. అందుకే భార్యతో ఆ వాగ్దానం తీసుకున్నాడతడు. ఎంతో ఆనందంగా గడవాల్సిన తమ వివాహపు తొలి దినాలను ఈ వ్యవహారంలో తలమునకలు పాడు చేసుకోవడం మనసులో యే మూలో ఆమెకు కూడా ఇష్టంలేదు. అందుకే తన భర్తకు ప్రామిస్ చేసిందామె.

ఆ రోజు మధ్యాహ్నమే వారు తమ గదిని ఖాళీ చేసేశారు. సాయంత్రం నాలుగు గంటల ప్రాంతంలో వైజాగ్‌నుండి కిరండోల్‌కు వెళ్ళే ప్యాసింజరు రైలు వుంది. అందులో జయపూర్‌కు ప్రయాణమయ్యారు వారు.

జయపూర్‌లో వారికి పెద్ద ఎస్టేట్ వుంది. కొన్ని వందల ఎకరాలుండే కాఫీ, మల్బరీ తోటలకు యేకైక వారసురాలు సునంద. తల్లి, తండ్రీ చిన్నతనంలోనే చనిపోవడంతో జయపూర్‌లోని తాతగారి దగ్గరే పెరిగి పెద్దయిందామె. తన తాతగారి దగ్గర మేనేజర్‌గా చేరిన విజయ్‌ను ప్రేమించి, పెళ్ళిచేసుకుంది సునంద.

వారి పెళ్ళికి నెలరోజులముందే గుండె జబ్బుతో మరణించాడు ఆమె తాతగారు. తాతయ్య మరణానంతరం అతని యావదాస్తీ ఆమెకే సంక్రమించింది.

ఎస్టేట్‌నూ, తననూ కంటికి రెప్పలా చూసుకొనే

విజయ్ భర్తగా లభించడం తన అదృష్టమనుకుంది ఆమె.

కిటికీ ప్రక్క సీటులో కూర్చుని చివరిసారిగా అరకు అందాలను చూస్తూంది సునంద. రైలు నెమ్మదిగా వేగం పుంజుకొని సాగింది. అరకు స్టేషన్ క్రమ, క్రమంగా కనుమరుగవసాగింది.

# 3

కోరాపుట్ జిల్లాలోని మారు మూల గ్రామమది. నాగరిక ప్రపంచానికి దూరంగా అడవి అంచున విసిరేసినట్లుంది ఆ ఊరు. ఆ ఊరి చివరున్న ఒక రెల్లు గుడిసెలో ఇద్దరు వ్యక్తులు కూర్చుని వున్నారు.

మట్టి నేల చక్కగా పేడతో అలకబడి వుంది ఆ గుడిసె లోపలిభాగం. దక్షిణ దిక్కుగా నక్షత్రాకారంలో వేయబడిన ముగ్గు మధ్య కూర్చుని ఉన్నాడు ఒక మధ్య వయస్కుడు. అతనికి కొద్ది దూరంలో ఆ గదిలోని ఒక మూల కూర్చుని అతడు చేస్తున్న పూజా కార్యక్రమాన్ని ఆసక్తితో గమనిస్తున్నాడు ఒక వ్యక్తి.

ఆ ముగ్గు చుట్టూ యేవో విచిత్రాక్షరాలు రక్తంతో వ్రాయబడి వున్నాయి. తల కోయబడ్డ నల్లకోడిపెట్ట, చెక్కలుగా కోయబడ్డ నిమ్మకాయలు. ఆ గదినంతా కప్పేస్తున్న గుగ్గిలపు ధూపం.... ఆ గదిలో ఒక విచిత్రమయిన వాతావరణాన్ని సృష్టిస్తున్నాయి.

ముగ్గు మధ్య కూర్చున్న వ్యక్తి చిన్న గోచీ మాత్రం ధరించాడు. అప్పుడే తలారా స్నానం చేసినట్లు విరబోసుకుని వున్న అతని తల నుండి బొట్లు, బొట్లుగా నీరు కారుతోంది. ఎర్రని కుంకుమబొట్టు అతని నుదురులో సగ భాగాన్ని కప్పేసింది. అతని పెదవులు మెల్లగా యేవో మంత్రాలను ఉచ్చరిస్తున్నాయి.

కొద్ది నిముషాల తరువాత అతడు మెల్లగా కళ్ళు తెరి చాడు. గది మూలను కూర్చున్న యువకుని దగ్గరకు రమ్మని పిలిచాడు.

"ఆ యమ్మ కాలిగోరు, తలవెంట్రుక తెచ్చేవా బాబూ?" అన్నాడతడు మెల్లగా.

ఆ యువకుడు తెచ్చానన్నట్లు తలూపాడు. తన చొక్కా జేబులోని ఓ కాగితపు పొట్లాన్ని అతడికిచ్చాడు ఆ యువకుడు. ఆ కాగితపు పొట్లంలోని తల వెంట్రుకను, కాలిగోరును చూసి సంతృప్తిగా తలాడించాడతడు.

తన ముందు మానవ ఆకారంలో చేయబడ్డ పిండి బొమ్మ మీద, ఆ గోరును, తల వెంట్రుకను ఉంచా డతడు.

"ఆ యమ్మ పేరేమిటన్నావు బాబూ?"

'సు....న....ంద" ఒక్కొక్క అక్షరమే వత్తి పలు కుతూ మెల్లగా అన్నాడా యువకుడు.

కొద్ది నిముషాలసేపు మంత్రోచ్చాటనలో మునిగిపోయా డతడు. మెల్లగా కళ్ళు తెరిచి రెండు నిమ్మకాయలను చేతిలోనికి తీసుకున్నాడు. వాటిని ముక్కలుగా చేసి ఆ పిండి బొమ్మకు అటూ, ఇటూ పడేశాడు. ఆ నిమ్మచెక్క లను చూసిన యువకుడు ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టాడు.

అవి ఎర్రని రక్తపు ముద్దలులా ఉన్నాయి.

అరచేతిలో కర్పూరాన్ని వెలిగించాడతడు, గాలిలో దేనికో ఆహ్వానిస్తున్నట్లు చేతిని చాచి వెలుగుతున్న ఆ కర్పూరాన్ని ఆ పిండిబొమ్మపై వేశాడు.

అంతే! కన్నులు మిరుమిట్లు గొలిపే కాంతితో ఆ బొమ్మ దగ్ధమై పోయింది. ఆ తంతు నంతా విస్మయంగా చూస్తున్నాడా యువకుడు. ఇక పూజ పూర్తయిందన్నట్లు

లేచాడతడు.

జేబులో నుండి పది వందరూపాయల నోట్లను లెక్క పెట్టి అతని చేతిలో పెట్టాడా యువకుడు. వాటిని అందు కొని రొంటిలో దోపుకున్నాడతడు.

"ఆ యమ్మకు ఎరిగున్న జీవుడే దయ్యమై వస్తది. నీ కోర్కె పండవుతదిలే. ఎల్లిరా" అన్నాడతడు.

అతడి దగ్గర శెలవు తీసుకొని ఆ గది బయటకు నడి చాడు ఆ యువకుడు. ఇప్పుడు అతని మనసు ఎంతో తేలి కగా వుంది.

ఆ యువకుని పేరు దివాకర్. సునందకు వరుసకు బావ అవుతాడు. సునంద తనను పెళ్ళాడుతుందని గంపెడు ఆశలు పెట్టుకున్నాడతడు. కాని సునంద విజయ్‌ను పెళ్ళాడటంతో అతని ఆశలన్నీ వమ్మయినాయి.

కోట్ల విలువచేసే ఆ స్త్రీ, కోరుకున్న వరసైన మరదలు ఎవరో అనామకుడిపాలై పోతుంటే చూస్తూ సహించ లేకపోయాడు. అసలు సునందే లేకుంటే సునంద తాత గారికి దాయాదులైన దివాకర్ కుటుంబానికే ఆ ఆస్తంతా సంక్రమించి వుండేది.

ఇప్పుడు సునందకు పెళ్ళి కావడంతో అతనికి ఇద్దరు అడ్డు తలయ్యారు. ఒకరు సునంద, రెండవవాడు విజయ్. ఆస్తికోసం వారిని తన దారిలో నుండి తప్పించడం పెద్ద సమస్య కాదు అతనికి. కాని వారు మరణించిన మరు క్షణం ఆ నేరం ఆ ఆస్తికి తదుపరి వారసుడైన అతడిమీదకే వస్తుంది.

కాని, చూస్తూ, చూస్తూ అంత ఆస్తిని ఎలా వదులుకో గలడు? అందుకే యెవరికీ అనుమానం రాని ఈ మార్గాన్ని ఎన్నుకున్నాడతడు.

ఒరిస్సాలోని కొండవారు, సవరలు, మంత్రాలలో ప్రసిద్ధులని వినికిడి. అందుకే తన కార్యం కోసం అతి కో కోయదొరగారిని పట్టుకున్నాడు.

'చిల్లంగో.... చేతబడో....ఆ కోయదొర యేం చేస్తే తన కెందుకు? తనకు కావలసింది సునంద, విజయ్‌ల చావు.

కోయదొర చెప్పిన ఆ రహస్యాన్ని సునందకు ఆవహింపజేస్తే ...ఆమెతోనే విజయ్‌ని హత్య చేయించాలి. హత్యకు ఆమెకు ఉరిశిక్షయినా పడుతుంది. లేకున్నా పర్వాలేదు. తన భర్తను తానే చేజేతులారా చంపుకున్నానన్న నిజాన్ని జీర్ణించుకోలేక సునందే మరణిస్తుంది. ఇంకా కావాలనుకుంటే సునందకు జీవితంపట్ల విరక్తిని పుట్టించి ఆత్మహత్యకు తానే ప్రోత్సహిస్తాడు'

ఆలోచనలలో తేలిపోతూ మెల్లగా నడుస్తున్నాడు దివాకర్. అతడు కనుమరుగయ్యేదాకా చూసి తనవారి గుడిసెలోకి నడిచాడు కోయదొర.

అయితే ఆ గుడిసెలో జరిగిన తంతునంతా ఒక జత కళ్ళు గమనిస్తున్నాయని వారిద్దరికీ తెలియదు.

## 4

"దివాకర్ యేదో ప్రక్కదారి పడుతున్నట్టుంది సునందా!" అన్నాడు లాయర్ రఘు.

ప్రశ్నార్థకంగా అతడివైపు చూశారు విజయ్, సునందలు.

జయపూర్ సిటీకి దూరంగా, కోరాపుట్‌కు వెళ్ళే మార్గంలో వుంది ఆ అధునాతన భవంతి. అది సునంద తాతగారి బంగళా. అందులోని డ్రాయింగ్ రూమ్‌లో

కూర్చుని మాట్లాడుకుంటున్నారు వారు.

సునంద తాతగారి స్నేహితులైన లాయర్ విశ్వనాథం గారి అబ్బాయి రఘు. తండ్రి తరువాత అతడే వారి ఎస్టేట్ యొక్క లీగల్ వ్యవహారాలన్నీ చూస్తూంటాడు.

నిజానికి సునంద తాతగారికి సునందను రఘుకిచ్చి పెళ్ళి చేద్దామని ఉండేది. కాని తన మనసులోని కోరిక కన్నా, కలసి కాపురం చేయాల్సిన సునంద అభిప్రాయానికే విలువనిచ్చాడతడు.

చిన్నతనం నుండీ పరిచయం ఉండటంచేత వారిద్దరి మధ్యా పేర్లతో పిలుచుకునేపాటి చనువుంది. లాయర్ రఘు యోగ్యుడు, చురుకైనవాడు. సునంద తనను కాదని విజయ్‌ను పెళ్ళి చేసుకుందని అతనికి తెలుసు. కాని ఆ కారణంచేత వారితో తనకున్న వృత్తి సంబంధాలను తగ్గించుకోలేదు అతడు.

ఒక్కసారి వారిద్దరివైపు చూసి లోగొంతుతో చెప్పడం ప్రారంభించాడతడు.

"నిన్న సాయంత్రం కోరాపుట్ నుండి కోర్టుకు వెళ్ళి వస్తున్న నాకు ఫారెస్టులో నుండి వెళ్తున్న దివాకర్ కనిపించాడు. చీకటిపడే వేళ అడవిలో నడుచుకుంటూ వెళ్ళాల్సిన పని అతనికేముందనిపించింది నాకు. అనుమానంతో అతడిని అనుసరించాను" అంటూ రాత్రి ఆ గుడిసెలో వారు నిర్వహించిన తాంత్రిక పూజ గురించి చెప్పాడు రఘు

"చాటు నుండి చూస్తూన్న నన్ను బహుశా వారు గమనించలేదనుకుంటాను."

అతను చెబుతున్న మాటలను నిశ్చేష్టురాలై వింటోంది సునంద.

"ఆ.. యింకా ఈ దెయ్యాలూ, చేతబడులూ యేమి టండీ రబ్బిష్. ఐ కాంట్ బిలీవ్ ఆల్ దీజ్ థింగ్స్" అతని మాటలను తేలిగ్గా కొట్టిపారేశాడు విజయ్.

"ఏనీ హౌ మీరు కాస్త జాగ్రత్తలో ఉండటం మంచిది" అంటూ లేచాడు.

అతడిని గేటువరకూ సాగనంపాడు విజయ్.

## 5

రాత్రి తొమ్మిది గంటల సమయం.

డైనింగ్ హాల్లో కూర్చుని సప్పర్ తీసుకుంటున్నారు విజయ్, సునందలు. వారిని డిస్టర్బ్ చేస్తూ కాలింగ్ బెల్ మ్రోగింది. విసుగ్గా చూసింది సునంద.

రాత్రి ఏడుగంటలకే పనివారిద్దరూ పని పూర్తిచేసు కొని వెళ్ళిపోయారు. పుట్టింటికి వెళ్ళిన వాడి భార్యకు ఆరోగ్యం బాగులేదని ఉత్తరం రావడంతో వాచ్ మేన్ వారం రోజులు శలవు తీసుకొని ఊరికి వెళ్ళాడు. అంత పెద్ద బంగళాలో ఉండేది తామిద్దరే మేనన్న భావన ఒకప్పు డయితే ఆమెకు యెంతో ఆనందాన్నిచ్చేది. కాని యిప్పు డెందుకో ఆమెకు అసహనంగా వుంది.

విసుక్కుంటూ లేచి సింక్ లో చేయి కడుక్కొని తలుపువైపు నడిచింది ఆమె. తలుపు తెరిచిన ఆమెకు యెదురుగా ఉన్న ఆకారాన్ని చూసేసరికి భయంతో ముచ్చెమటలు పట్టాయి.

ఎదురుగా నవ్వుతూ నిలుచుని వుంది నాగమణి.

భయంతో మాట పెగలక అలానే వుండిపోయింది సునంద.

సునంద కళ్ళలోకే చూస్తూ మెల్లగా గొంతు విప్పింది నాగమణి. నూతిలో నుంచి మాట్లాడుతున్నట్లుంది ఆ

గొంతు. రహస్యం చెబుతున్నట్లు వినీ వినబడనట్లున్నాయి ఆమె మాటలు.

"రా....రా....సునందా! నాతో వచ్చేయ్!"

"రా....సునందా!....రా....!"

సునందవైపు ఆహ్వానిస్తున్నట్లు చేతులు చాచింది నాగమణి. చల్లగా వీస్తున్న గాలికి ఆమె కట్టుకొన్న చీర, విరబోసుకున్న నల్లని కురులూ ఎగురుతున్నాయి.

భయంతో నిలువెల్లా వణికిపోయింది సునంద.

తలుపు తీయడానికి వెళ్ళిన భార్య బొమ్మలా అక్కడే నిలుచుండిపోవడం చూసిన విజయ్ తను కూడా చేయి కడుక్కొని సునంద దగ్గరకు వచ్చాడు. మాటా. మంతీ లేకుండా నిలువుగ్రుడ్లు వేసుకొని చూస్తున్న భార్యను చూశాడతడు. ఆమె రెండు భుజాలనూ పట్టుకుని కుదిపాడు.

"సునందా .... సునందా! వాట్ హేపెండ్ డార్లింగ్ ...."

అనునయంగా అడుగుతున్న భర్త వంక చూస్తూ బావురుమంది సునంద. కొండంత ఆసరా దొరికినట్లు అతని గుండెల్లో ముఖం దాచుకుంది ఆమె. తల తిప్పకుండానే వాకిలివైపు చేతిని చూపిస్తూ వణుకుతున్న గొంతుతో అందామె,

"అక్కడ....అక్కడ....నాగమణి....ఉందండి"

భార్య మాటలకు ఛటుక్కున తలెత్తి చూశాడతడు.

"ఛ....ఛ....యిక్కడెవరూ లేరోయ్. కావాలంటే చూడు" మెల్లగా భార్య చుబుకాన్నెత్తాడతడు.

భర్త మాటలకు మెల్లగా కళ్ళెత్తి చూసిందామె,

సన్నగా నవ్వుతూ—అక్కడే నిలబడి ఉంది నాగమణి.

"రా....వచ్చేయ్ సునందా!"....అదే గొంతు, అదే రూపం.

"అదిగోండి....నాగమణి అక్కడే నిలబడి వుంది. నన్ను రమ్మంటోంది" గుండెల్లో నుండి దుఃఖం పొంగుకొస్తూ చేతి కన్నీళ్ళతో బేలగా భర్త వంక చూస్తూ అంది సునంద.

మరోసారి సునంద చూపిస్తున్న దిక్కువంక చూశాడతడు. భార్యను బుజ్జగిస్తున్నట్లు దగ్గరకు తీసుకున్నాడు.

"ఎవరూ లేరోయ్ అదంతా నీ భ్రమ. అక్కడ నాగమణి శవాన్ని చూశావు. ఇంతకు క్రితం రఘు అన్న మాటలు తలచుకుని వుంటావు. నాగమణీ లేదూ దెయ్యమూ లేదు. కమాన్, రిలాక్స్!"

అనునయంగా ఆమె చెక్కిళ్ళు నిమురుతూ ఆమెను మెల్లగా లోపలకు నడిపించుకు వెళ్ళాడు విజయ్.

భర్త తలుపు క్లోజ్ చేస్తూండగా చివరిసారిగా వాకిలిలోకి చూసిందామె. నాగమణి అదే భంగిమలో అక్కడే నిలబడి వుంది.

'తనకు పిచ్చిగాని పట్టలేదు కదా' అనుకుంది ఆమె. 'తనకు అంత స్పష్టంగా నాగమణి కన్పిస్తూంది, ఆమె గొంతు విన్పిస్తూంది.కాని తనభర్తకు ఎవరూ కనిపించటం లేదంటే విచిత్రంగా వుంది.'

కోయదొర దివాకర్‌తో చెబుతూండగా తాను విన్నానని రఘు చెప్పిన మాటలు హఠాత్తుగా గుర్తుకు వచ్చాయి ఆమెకు.

'ఆ యమ్మకు ఎరికున్న జీవుడే దెయ్యమై వస్తది.'

'అంటే తనకు తెలిసిన నాగమణే దెయ్యమై వచ్చిందా?' ఆ ఊహాకే భయంతో మరోమారు కంపించి పోయింది ఆమె.

ఆ రాత్రి బాగా పొద్దుపోయే వరకూ నిద్ర పట్టలేదు ఆమెకు.

## 6

మరునాడు ఉదయం ఎస్టేట్ కు బయలుదేరుతున్న భర్తతో, ఒంటరిగా ఉండలేక తను కూడా బయలు దేరింది సునంద.

వీపులపై చిన్న చిన్న వెదురుబుట్టలను ధరించి కాఫీ గింజలను యేరుతున్న కూలీలను చూస్తూ ... ఆ కాఫీతోట లోనే కాంప్ ఫైర్ వేసుకుని మధ్యాహ్నం వరకూ కూర్చుందామె. ఆ అందమైన ప్రకృతి మధ్య ఆ అమాయక జీవులను చూస్తూ తన మనసులోని క్లేశాన్ని మరచి పోయిందామె.

మధ్యాహ్నం ఒంటిగంట సమయంలో ఎస్టేట్ వ్యవహారాలు పూర్తిచేసుకొని ఆమె దగ్గరకు వచ్చాడు విజయ్. ఆసరికి యింటిదగ్గర నుండి భోజనం కారేజ్ లో తెచ్చి యెస్టేట్ లోని గెస్టు హౌస్ లో ఉంచాడు డ్రైవర్.

డ్రైవర్ ను అక్కడే వదిలేసి భార్యతో సహా గెస్టు హౌస్ కు కారులో బయలుదేరాడు విజయ్. గెస్టుహౌస్ ఆవరణలో భార్యను దింపాడతడు.

"నేను కారును చెట్టునీడలో పార్క్ చేసి వస్తాను. నీవు పద డార్లింగ్!" అన్నాడతడు.

భర్త వచ్చేసరికి అన్నీ సర్దించి సిద్ధంగా ఉంచుదామని గెస్టుహౌస్ లోకి నడిచింది ఆమె. డైనింగ్ హాలు

తలుపును తోసింది. కిర్రుమని శబ్దంచేస్తూ మెల్లగా తెరుచు కుందది.

ఆమె కడ్డించవలసరం లేకుండా నే ఆ డైనింగ్ టేబిల్ మీద నున్న డిషెస్‌లో పదార్థాలన్నీ కడ్డించివున్నాయి. ఎదురుగా నున్న కుర్చీలో ఆమెకోసమే ఎదురుచూస్తు న్నట్లు నాగమణి కూర్చుని వుంది.

"రా....సువందా....! నీ కోసమే కాచుకుని వున్నాను." నవ్వుతూ అందామె.

అంతే! కెవ్వుమని కేకవేస్తూ గిరుక్కున వెనుతిరిగి బయటకు పరుగెత్తిందామె. అప్పుడే లోపలికి అడుగు పెడుతున్న విజయ్ భార్యవంక ఆశ్చర్యంగా చూశాడు.

'డైనింగ్ హాల్లో నాగమణి కూర్చుని వుందన్న భార్య మాటలకు ఫక్కుమని నవ్వాడతడు. భార్యను బుజ్జగించి మళ్ళీ మామూలు మనిషిని చేసేసరికి అతనికి పావుగంట పైనే పట్టింది.

భర్త చేయిని గట్టిగా పట్టుకొని బెరుకు, బెరుకుగానే మళ్ళీ డైనింగ్ హాలులోకి అడుగుపెట్టిందామె. ఈ సారి కనిపించిన దృశ్యంతో ఆమెకు తల తిరిగిపోయింది.

అక్కడ....ఆ కుర్చీలో నాగమణి లేదు. అయితే అది కాదు ఆమెను ఆశ్చర్యంలో ముంచెత్తుతున్నది. డైనింగ్ టేబిల్ మీద నున్న డిసెష్ అన్నీ ఖాళీగా వున్నాయి. తను కొన్ని నిముషాల ముందు ఆ డిసెష్‌లో పదార్థాలు వడ్డింపబడి వుండటం తన రెండు కళ్ళతో చూసింది.

కానీ ఇప్పుడవి ఖాళీగా తనను వెక్కిరిస్తున్నట్లు న్నాయి. గబగబా వెళ్ళి వాటిని పట్టుకొని చూసిందామె. నీట్‌గా శుభ్రంగా గుడ్డతో తుడిచినట్లున్నాయి ఆ పింగాణీ పాత్రలు. తన అనుమానం తీరక కారేజీను

విప్పి చూసిందామె. నిండుగా పదార్థాలతో వున్న కప్పులను చూసేసరికి ఆమె తల తిరిగిపోయింది.

తను చూసింది భ్రాంతో.... నిజమో తెలియక తల పగిలిపోసాగింది ఆమెకు. అన్యమనస్కంగానే భోజనం ముగించిందామె. అప్పటికే భోజనం పూర్తిచేసి, నేప్కిన్‌తో చేయి తుడుచుకుంటూ ఆ గది బయటకు నడిచాడు విజయ్.

సింక్‌లో చేయికడుగుకుని నేప్కిన్ కోసం హాంగర్ పై చూసింది. ఖాళీగా వున్న హాంగర్ వంక విస్తుగా చూసిందామె.

“నేప్కిన్ కావాలా సునందా! ఇదిగో తీసుకో.”

తన వెనుక అకస్మాత్తుగా వినిపించిన మాటలకు గిరుక్కున వెనుతిరిగి చూసిందామె.

నేప్కిన్‌ను అందిస్తూ నిలుచున్న నాగమణిని చూసేసరికి ఆమె పై ప్రాణాలు పైనే పోయాయి.

“ఏమండీ!” భయంతో అరుస్తూ బయటకు పరుగెత్తిందామె.

## 7

సునంద చెప్పినదంతా వినేసరికి ఆశ్చర్యంతో తల మునకలయిపోయాడు లాయర్ రఘు.

డైనింగ్ హాలులో ఆ సంఘటన జరిగాక, మరో నిముషంసేపు కూడా ఆ ఎస్టేట్‌లో ఉండలేకపోయిందామె. భర్తతో చెప్పి డ్రైవర్‌ను తీసుకుని జయపూర్‌కు వెళ్ళిపోయిందామె. అయితే ఆమె వెళ్ళింది తమ బంగళాకు కాదు. లాయర్ రఘు ఇంటికి.

భర్తకు యెంత ప్రామిస్ చేసినా, ఇప్పుడు నాగమణి చావును గూర్చి యెవరో ఒకరికి చెప్పుకోవాలి. తప్పదు.

తన గుండెల్లో భారాన్ని దింపుకోవడానికి, భయంతో అనుక్షణం తల్లడిల్లిపోతున్న తనను అర్థం చేసుకోవడానికి తనకో తోడు కావాలి. దురదృష్టవశాత్తు ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన భర్త తన మాటలను నమ్మటం లేదు. కేవలం భయం అని తేలిగ్గా కొట్టి పారేస్తున్నాడు.

రఘు కేవలం తన ఫ్యామిలీలాయర్ మాత్రమే కాదు. చిన్నప్పటి నుండీ కలసి చదువుకున్నారు వారు. వారిద్దరూ మంచి స్నేహితులు కూడాను. అందుకే తన మనసులోని ఆందోళను రఘుతో చెప్పుకుంది ఆమె.

సునంద వెళ్ళిపోయాక, ఆమె చెప్పిన విషయాలను మరోసారి నెమరువేసుకున్నాడు రఘు. ఇంతవరకూ జరిగిన సంఘటనలను క్రోడీకరించుకుంటూపోయా డతడు. అతని చేతిలోని కలం లెటర్‌పాడ్‌పై చక, చకా పాయింట్స్‌ను వ్రాసుకుంటూ పోసాగింది.

1. దివాకర్ ఆస్తికోసం సునందపై పగబట్టాడు.
2. తాంత్రిక విద్యల ద్వారా సునందపై యేదో ప్రయోగం చేయించడానికి ప్రయత్నించాడతడు....
3. తాంత్రిక పూజతరువాత కోయదొర దివాకర్‌తో ఇలా అన్నాడు:

   'ఆ యమ్మకు ఎరికున్న జీవుడే వస్తది.'

   అంటే....నాగమణి దయ్యాన్ని ...ఆ కోయదొర సునందపై ప్రయోగించాడా....?
4. నాగమణి నిజంగా దయ్యమేనా....?
5. నాగమణి చావును తాము కళ్ళారా చూశామంటోంది సునంద.

6. నాగమణిది హత్యా? ఆత్మహత్యా?
7. డైనింగ్ హాలులోని సంఘటనలను పరిశీలిస్తే అవి మాయలు మనుషులు కూడా సులువుగా చేయగలరు. డ్రైవర్ తెచ్చిన కారేజ్ లోని పదార్థాలను గాక వేరే పదార్థాలను సునంద వచ్చేసరికి డిషెస్‌లో వడ్డించి వుంది. ఆమె భయంతో పారిపోగానే, ఆ పదార్థాలన్నింటినీ తీసి వేసి ఆ పింగాణీ పాత్రలను గుడ్డతో శుభ్రం చేసి ఉంచవచ్చు.

   ఎందుకంటే: సునంద తన భర్త విజయ్‌తో కలసి డైనింగ్ హాలులోకి తిరిగిరావడానికి ఐదు నిముషాలకుపైనే పట్టిందని చెప్పింది. ఆ మాత్రం వ్యవధి చాలు ఆ ఖాళీ డిషెస్‌ను అమర్చడానికి.

   అలాగే కేక్ కిని విషయంలో కూడా.
8. ఇది మనుషులు ఆడుతున్న నాటకమే అయితే చనిపోయిన నాగమణి డైనింగ్ హాలులో ఎలా ప్రత్యక్షమయింది?
9. ఒకవేళ చనిపోయిన నాగమణి వేషంలో ఇంకెవరైనా నటిస్తున్నారా? ఏ ప్రయోజనం కోరి ఎవరు ఆ నాటకాన్ని ఆడిస్తున్నారు?

   దివాకరా?

   ఎందుకంటే సునందకు కీడు చేయడం ద్వారా ప్రయోజనాన్ని ఆశిస్తున్నదతడు మాత్రమే.
10. దివాకర్ ఈ నాటకాన్ని ఆడిస్తుంటే....అతడు సునందపై ప్రయోగిస్తున్నది మనిషిని కాదు, దయ్యాన్ని. నాగమణి మనిషయితే విజయ్‌కు ఎందుకు కనిపించదు?

అతడు ఇప్పుడు మొదట వ్రాసిన ఆరు పాయింట్లను

చివరకు తెచ్చాడు. తను వ్రాసినదంతా అమూలాగ్రం చదివాడు.

ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉన్నట్లనిపించిందతనికి. యేది యేమైనా నాగమణి ఎవరో ముందుగా తెలుసుకోవాలి. ఆమె పూర్తి వివరాలు తెలిస్తేగాని ఈ కేసులోని మిస్టరీ విడిపడదు.

ఆ నిర్ణయానికి వచ్చిన మరుక్షణం అతడు లెటర్ పాడ్‌ను మూసి, లేచి నిలబడ్డాడు.

## 8

పాడేరు స్టాండ్‌లో బస్సు ఆగింది. మెల్లగా బస్సు దిగాడు రఘు. అతని భుజానికి చిన్న ఎయిర్ బ్యాగ్ వ్రేలాడుతూంది.

'తాను పాడేరులోని ఎలిమెంటరీ స్కూల్లో టీచర్‌గా పనిచేస్తున్నానని' తనతో నాగమణి చెప్పినట్లు సునంద చెప్పింది. నాగమణి గురించి తెలుసుకోవడానికి అతని కున్న ఆధారమల్లా అదొక్కటే. అందుకే పాడేరు ప్రయాణమయ్యాడతడు.

పాడేరు గిరిజన ప్రాంతం. కొండలూ, అడవుల మధ్యనున్న చిన్న ఊరు. పల్లె చిన్నదే అయినా ఇటు సీలేరు, అటు మాచ్‌ఖండ్లకు పోయే రోడ్డు కూడలి కావడంతో ఆ గిరిజన వాడలో కూడా అక్కడక్కడ నాగరికతా చిహ్నాలు కన్పిస్తున్నాయి.

ఎలిమెంటరీ స్కూలును కనుక్కోవడం పెద్ద కష్టం కాలేదు అతనికి. కాని ఆ స్కూలు హెడ్‌మాస్టర్ చెప్పిన సమాధానం వినేసరికి అతను తెల్లబోయాడు.

'నాగమణి పేరుగల అమ్మాయెవరూ ఆ స్కూల్లో

పని చేయడం లేదు. అసలు గత రెండు సంవత్సరాలుగా ఆ స్కూల్లో లేడీ టీచర్సే లేరు.'

నాగమణిని గూర్చి తెలుసుకోవడానికి తనకున్న ఒకే ఒక్క ఆధారమూ పోయేసరికి అతడికి ఏం చేయాలో తోచలేదు. నిరాశగా కాళ్లీడ్చుకుంటూ బస్టాండువైపు నడిచాడు.

టీ బంక్ ముందున్న చిన్న చెక్క బల్లమీద కూర్చున్నాడతడు. ఒక 'స్ట్రాంగ్ టీ' అని చెప్పాడు. కాకీ నిక్కరు మాత్రం వేసుకున్న చిన్న కుర్రాడు 'టీ' గ్లాసును అందించాడతడికి. టీని త్రాగుతూ ఆలోచనల్లో మునిగిపోయాడతడు.

ఈ కేసులో యెలా ప్రొసీడ్ కావాలో అర్థం కావటంలేదతనికి.

సరిగ్గా అదే సమయంలో అతని ఆలోచనలను చెదరగొడుతూ 'బాంయ్'మంటూ బస్సు హారన్ వినిపించింది. తలెత్తి చూసాడతడు.

"వైజాగ్ .... వైజాగ్ ...." అంటూ బస్సు క్లీనరు కేకలు పెడుతున్నాడు.

వైజాగ్ అన్న మాట విన్న వెంటనే తన మెదడులో బల్బు వెలిగినట్లనిపించింది రఘుకు.

"దివాకర్ చదువుతున్నది వైజాగ్‌లో. దివాకర్‌కూ నాగమణికీ యేదైనా సంబంధం వుందా? లేదా? అన్నది తేలాలంటే వైజాగ్‌లో ఎంక్వయిరీ చేస్తే సరి."

ఆ ఆలోచన వచ్చినందుకు తనను తాను అభినందించుకుంటూ బస్సువైపు నడిచాడు రఘు.

అదే సమయానికి తన గుడిసెలోని ముగ్గు మధ్య కూర్చుని ప్రేతాత్మను ఆహ్వానించడానికి సర్వం సిద్ధం

చేస్తున్నాడు కోయదొర. ఆ గుడిసెలోనే ఒక మూల ఒద్దికగా కూర్చుని అతడు చేస్తున్న పూజా విధానాన్ని ఆసక్తిగా గమనిస్తున్నాడు దివాకర్.

ప్రేతాత్మలకు స్వాగతం పల్కుతూన్నట్లు మసక చీకట్లు ముసురుకోసాగాయి. ఆకాశంలో గుమిగూడుతున్న పిశాచాల్లా కారుమబ్బులు క్రమ్ముకోసాగాయి. భూమ్యాకాశాలను రెండుగా చీల్చేస్తున్నట్లు ఉరుములూ, మెరుపులూ ప్రారంభమయ్యాయి. కొండలనూ, అడవినీ ముంచెత్తుతూ వర్షం కుండపోతగా కురియసాగింది.

భూమి, ఆకాశం, నీరు, గాలి, అగ్ని అనెడి ఈ పంచభూతములూ, పాంచభౌతికమైన దేహాన్ని విడిచి వచ్చిన ఆత్మలకే సహాయపడతాయంటారు.

ఏమో! అది నిజమేనేమో! అనిపించింది దివాకర్‌కు ఆ వర్షాన్ని చూస్తుంటే. కోయదొర ఉచ్ఛరిస్తున్న మంత్రాలు ఆ ప్రళయ భీకరమైన వర్షపు హోరులో కలసిపోతున్నాయి.

# 9

మంచంపై అసహనంగా అటూ, ఇటూ దొర్లసాగింది సునంద. వర్షం అంటే చిన్నతనంనుండీ సునందకు తగని చిరాకు. అందులో హోరు గాలితో ధారాపాతంగా కురుస్తున్న ఈ వర్షం ఆమెలో యేదో అనీజీనెస్‌ను కలుగజేస్తూంది.

బెడ్ రూమ్‌కు ఎదురుగా వున్న స్టడీ రూంలో కూర్చుని వున్నాడు భర్త విజయ్. అతని ముందున్న ఎక్కౌంట్స్ పుస్తకాలలో మునిగిపోయాడతడు.

రైడ్ చేస్తూంది కాబట్టి ఎక్సైజ్ వారి కోసం, ఎస్టేట్ ఎక్కౌంట్సన్నీ అప్టుడేట్‌గా వుంచాలి. అందుకే

అరుణ వెళ్ళి వచ్చినప్పటినుండీ పీకలదాకా పనిలో మునిగి పోయాడతడు.

ఎత్తయిన అద్దాల కిటికీలనుండి కనిపిస్తున్న తోటలోని వృక్షాలు జుత్తులు విరబోసుకొని వర్షంలో స్నానం చేస్తున్న పిశాచాల్లా వున్నాయి. ఎదురుగా భర్త కనిపిస్తున్నా ఏదో తెలియని ఒంటరితనం ఆమెను పీడించ సాగింది.

అదే సమయంలో ఆ భవంతిలోని దీపాలన్నీ ఆరి పోయాయి. అంతటా చిక్కని చీకటి క్రమ్ముకుంది.

'కరెంట్ పోయింది కాబోలు' అనుకుందామె. కానీ అది ఎలక్ట్రిసిటీ ఫెయిల్యూర్ కాదని, కేవలం తమ భవనంలోని దీపాలు మాత్రమే ఆరిపోయాయని ఆమెకు తెలియదు.

చీకటిలో చూడటానికి ఆమె కళ్ళు అలవాటుపడ టానికి కొద్ది క్షణాలు పట్టింది ఆమెకు. ఎవరో త్రోసి నట్లు ఆ బెడ్‌రూమ్ తలుపులు విసురుగా తెరచు కున్నాయి. రివ్వుమంటూ చల్లని గాలి ఆ గదిలోనికి ప్రవే శించింది.

అప్పుడు చూసిందామె ఆ గదిలోకి అడుగు పెడుతున్న తెల్లని ఆకారాన్ని. విసురుగా వీస్తున్న గాలికి ఆమె విర బోసుకున్న కురులు, తెల్లని చీర చెంగు గాలిలో లేచి పోతుంటే.... అస్పష్టంగా వున్న ఆమె ఆకారం గాలిలో తేలివస్తున్నట్లు వుంది.

ఆమె తలచుట్టూ కిరీటంలా ఏదో చుట్టబడి వుంది. అందులో నుండి మిణుకు, మిణుకు మంటూ ఎర్రని కాంతులు చిమ్ముతున్నాయి. ఆ ఎర్రని కాంతిలో ముఖం స్పష్టంగా కనిపిస్తోంది. వికృతంగా నవ్వుతున్న ఆమె పెద

వులు వంకరలు తిరిగివున్నాయి.

ఆమె.... నాగమణి.

"సునందా....! రా....సునందా....వచ్చేయ్!"

ఆ నీరవ నిశీధిలో ఆమె గొంతు తన చెవిలోనే గుస, గుసలాడుతున్నట్లు వినిపించింది సునందకు.

'కెవ్వు' మంటూ కేక వేసిందామె.

అరచేతిని రెండు కళ్ళకు అడ్డుపెట్టుకొని భయంతో వణికిపోతూ కళ్ళను గట్టిగా మూసుకొంది సునంద.

అదే సమయంలో చేతిలోని టార్చిలైట్‌తో ఆ గది లోకి పరుగెత్తుకొని వచ్చాడు విజయ్ ఎలక్ట్రిసిటీ ఫెయి లయిన వెంటనే డెస్క్‌లో వున్న టార్చ్‌లైట్‌ను తడుము కుంటూ వెలికి తీశాడు అతడు. సెల్స్‌ను ఫిట్ చేసేసరికి సునంద కేక వినిపించిందతనికి.

ఆత్రుతగా భార్య పడుకొని వున్న బెడ్‌ను సమీపిం చాడు. "వాట్ హాపెండ్ డార్లింగ్. సునందా.... సునందా యేదీ కళ్ళు తెరు. ఆరె ... నేనోయ్" అంటూ కళ్ళకు అడ్డంగా పెట్టుకున్న ఆమె చేయిని తొలగించాడు.

భర్త గొంతువిన్నా ఆమెలో భయం పోలేదు. మెల్లగా సంకోచిస్తూ కళ్ళు తెరచింది. ఎదురుగా తనను పొదివి పట్టుకున్న భర్త.

"అక్కడ....అక్కడ నాగమణి....ది....య్యం వుందండి" తలుపువైపు చేయి చూపిస్తూ వణుకుతున్న గొంతుతో అందామె.

"ఏదీ" అంటూ అటు టార్చిని ఫోకస్ చేశాడతడు. ద్వారానికి వ్రేలాడుతున్న తెల్లని డోర్ కర్టెన్ గాలికి యెగురుతూ కనిపించింది వారికి.

"డోర్ కర్టెన్‌ను చూసి దయ్యమనుకున్నావా.

గొప్ప భాగ్యవంతురాలివే" పక, పకా నవ్వుతూ అన్నాడు విజయ్.

తను చూస్తున్నది కలో, నిజమో అర్థంకావేదు ఆమెకు. భర్త వంక బేలగా చూసిందామె.

"సునందా .... యిక్కడున్నాను సునందా .... యిక్కడ."

ఎవరో తన చెవి దగ్గరే మెల్లగా అనడంతో త్రుళ్ళిపడి చూసిందామె. బెడ్ కు అవతలప్రక్క ఆమె తలభాగం వైపు నిలుచుని వుంది నాగమణి. ఆమె పెదవులపై అదే వికృతహాసం.

భర్త చేతిని గట్టిగా పట్టుకొని నాగమణివైపు చేయి చూపించిందామె. ఈసారి ఆమె నిలువెల్లా వణికిపోతూంది. "అదిగోండి. అక్కడ.... నా బెడ్ ప్రక్కనే."

టార్చ్ ని అటు ఫోకస్ చేశాడతడు.

"ఎక్కడోయి. నా కెవరూ కనిపించరేం?"

భర్త మాటలకు మళ్ళీ అటు తల త్రిప్పి చూసిందామె. నాగమణి అక్కడే నిలుచుని వుంది. ఆమె మెల్లగా పెదవులు కదల్చింది.

"వచ్చేయ్ సునందా. ఇటు వచ్చేయ్."

"అదిగోండి.... ఆ దయ్యం అక్కడే వుంది."

కన్నీళ్ళతో ముఖం తడిసిపోతుంటే బావురుమంది ఆమె.

"ఛ.... ఛ.... ఏంటది చిన్నపిల్లలా. సునందా మై డార్లింగ్ .... ఊరుకో .... ఏడుపు ఆపేయాలి మరి. నీ మెంటుకో ఊహకే భయపడుతున్నావోయ్. ఏదీ మరి నాకే దయ్యమూ కనిపించడంలేదేం? అయినా నేను ప్రక్కనే ఉన్నాగా. ఇంకా భయమెందుకు?"

అంటూ ఆమెను అనునయిస్తూ మెల్లగా బెడ్ పై పరుండబెట్టాడు. అప్పటికే మానసికంగా బాగా అలసిపోయింది ఆమె. నిస్త్రాణంతో కనురెప్పలు మూతలు పడుతున్నాయి. భర్తకు "గుడ్ నైట్" చెబుదామని కళ్ళు తెరిచి అతనున్న వైపు చూసిందామె.

అంతే! భయంతో చిగురుటాకులా కంపించిపోయిందామె. అక్కడ అన్నది ఆమె భర్త విజయ్ కాదు. నాగమణి.

భయంతో ఆమె వేసిన కేక గొంతులోనే వుండిపోయింది. అంత చలిగా వున్న వాతావరణంలోనూ ఆమెకు నిలువెల్లా చెమటలు పట్టాయి. వడలిపోయిన తీగెలా అలాగే ఆ బెడ్ మీదే మూర్ఛపోయింది ఆమె.

## 10

వైజాగ్ లో చదువుకుంటున్న రోజులలో తాను డాబా గార్డెన్స్ లో వుంటున్నట్లు—ఏదో మాటల సందర్భంలో చెప్పాడు దివాకర్. లాయర్ రఘుతో.

కాని డాబా గార్డెన్స్ సెంటర్ లో నిలబడి చుట్టూ ఒక్కసారి పరికించి చూశాక, దివాకర్ ఎడ్రస్ సంపాదించడం తాను అనుకున్నంత సులువేమీ కాదనిపించింది రఘుకు.

అయితే అతడి లాయర్ బుర్ర తెలివిగానే పని చేసింది. సాధారణంగా స్టూడెంట్స్ కు గదులు అద్దెకివ్వడానికి ఎవరూ యిష్టపడరు. కేవలం స్టూడెంట్స్ కోసమే ఒక యింటిని కేటాయించి అందులోని చిన్న, చిన్న గదులను ఇద్దరు ముగ్గురు స్టూడెంట్స్ కు కలిపి అద్దెకిస్తుంటారు కొందరు అయితే అలాంటివారు చాలా అరుదు.

అలాంటి యిళ్ళగూర్చి వాకబు చేసుకుంటూ పోయా

డతడు డాబా గార్డెన్స్‌లో అలా స్టూడెంట్స్‌కోసం రూమ్స్‌ను అద్దెకిచ్చే యిళ్ళు మూడు అని తెలిసింది. ఒక్కొక్క ఇంటిలో ఎంక్వయిరీ చేసుకుంటూ పోయాడతడు. తనతో దివాకర్ ఫోటో లేవడంచేత అతని పని మరింత సులువైంది.

కాని అతడు ఊహించినట్లుగా దివాకర్ ఆ మూడిళ్ళలో ఎందులోనూ అద్దెకు ఉండలేదు. మూడవ యింటినికూడా వాకబుచేసి నిరాశగా వెనుదిరిగి వచ్చేస్తున్నాడతడు.

పిట్టగోడకున్న చిన్న చెక్క గేటును తెరుచుకొని బయటకు అడుగుపెట్టే సమయంలో అతడిని రాసుకుంటూ పోయాడు పన్నెండేళ్ళ కుర్రాడు. ఎదురుగావున్న హోటల్ నుండి వస్తున్నాడా అబ్బాయి. అతడి చేతిలోని వైరుతో అల్లిన హేంగర్‌లో టీ గ్లాసులున్నాయి. ఆయిల్లోని స్టూడెంట్స్‌కు టీలుగట్రా సప్లై చేస్తుంటాడతడు.

ఆ కుర్రాడి వంక విసుగ్గా చూసి రెండడుగులు ముందుకు వేసాడు రఘు. అతని కెందుకో తన చివరి ప్రయత్నంగా ఆ కుర్రాడిని దివాకర్ గూర్చి అడుగుదామనిపించింది.

'ఏమో? ఎవరికి తెలుసు. వాడేమైనా చెప్పగలడేమో! అసలు స్టూడెంట్స్ గురించి కరెక్టు ఇన్ఫర్మేషన్ ఇవ్వగలిగేది వాళ్ళ పనులు చేసే యిలాంటివారే.'

రఘు తన ఆలోచనల్లో వుండగానే ఆ కుర్రాడు స్టూడెంట్స్‌కు 'టీ'లు సప్లై చేసి వచ్చేశాడు. ఆ కుర్రాడిని చేయిపట్టుకు ఆపాడతడు.

"చూడు బాబూ" అన్నాడు రఘు.

"నా పేరు మాడు బాబూ కాదండి సూరిబాబు" అన్నాడా కుర్రాడు టక్కున.

చాకులాంటి కుర్రాడే అనుకున్నాడతడు. తన జేబు లోని దివాకర్ ఫోటో తీశాడు. ఆ కుర్రాడికి చూపించాడు.

"సూరిబాబూ.... ఈ ఫోటోలోని అబ్బాయిని నీ వెప్పుడైనా చూశావా?"

ఒక్క క్షణం దీక్షగా ఆ ఫోటో వంక చూశాడతడు. "చూశానండి. దివాకర బాబుగారు కదండి".

"ఆయన నీకు తెలుసా" ఆత్రంగా అడిగాడతడు.

"తెలుసునంటే తెలుసుకదండి. ఇక్కడ స్టూడెంట్ కుర్రాళ్ళందరూ తెలుసండి."

"దివాకర్ ఎక్కడుండేవాడు?"

"అదిగోనండి ఆ రావిచెట్టు కనబడుతుందండి. దాని యెదురుగా వున్న యింట్లో వుండేవారండి. ఆ రావిచెట్టు క్రిందే ఈ టీ కొట్టు వుండేదండి. రావిచెట్టు అక్కడే వుందండి. టీ కొట్టు మాత్రం యిక్కడకు వచ్చేసిందండి."

"వీడు వాగుడుకాయ కూడానూ" అనుకున్నాడు రఘు.

"పోనీ ఆ యిల్లు అయినా ఉంది కదా" అన్నాడు నవ్వుతూ.

"ఇల్లు ఉందండి. కానీ యింటాయన లేరండి! యిల్లు అమ్మేసి ఉత్తరాదెల్లి పోయారండి."

ఆ కుర్రాడి మాటలకు హతాశుడైపోయాడు రఘు. దివాకర్ గూర్చి చెప్పగలిగే ఆ ఒక్క యిల్లుగలాయన యెక్కడికో పోయారట. ఏమిటి చెయ్యడమని క్షణంసేపు ఆలోచించాడు. గాలిలోకి బాణంలా నాగమణిగూర్చి

కూడా వీడినే అడిగేస్తే సరి అనుకున్నాడతడు.

"సూరిబాబూ....దివాకర్‌కు గర్లు ఫ్రెండ్స్ యెవరయినా ఉండేవారా....?"

"సినిమాల్లోనయితే ఇట్లాంటి ప్రశ్నలు ఊరికినే యెవరూ అడగరండి" తల గోక్కుంటూ అన్నాడు సూరిబాబు.

'పోరి పిడుగా....' అనుకుంటూ జేబులోనుండి ఐదు రూపాయల నోటును తీసి అతడి చేతిలో పెట్టాడతడు.

ఆ నోటును చూసిన వెంటనే వాడికి ఎక్కడలేని ఉషారూ వచ్చేసింది. ఇక గడ, గడా వాగడం మొదలు పెట్టాడు.

"ఒకమ్మగోరుండేవారండి. సానా అందంగుంటారండి. ఎప్పుడూ సెంటర్‌లోనే ఇద్దరూ కలుసుకొనేవారండి. బస్టాప్‌లో అమ్మగారు నిలబడితే నేను పరుగెత్తికెళ్ళి దివాకర్ బాబుగారితో అమ్మాయిగారొచ్చారని సెప్పేవాడినండి. అమ్మాయిగోరు అప్పుడప్పుడు రూపాయిచ్చేవారండి."

"అంటే వారిద్దరూ ప్రేమించుకున్నారా....ఐ మీన్ చాలా క్లోజ్. అంటే ఒకరికొకరు దగ్గరగా ఉండేవారా?" ఆ ప్రశ్న ఆ కుర్రాడిని ఎలా అడగాలో తెలియక తానే సతమతమయ్యాడు రఘు.

కుర్రాడు మాత్రం టక్కున జవాబిచ్చాడు.

"ఓసారి ఇంటాయన ఊరికెళ్ళినప్పుడండి. అమ్మాయిగార్ని, దివాకర్ బాబు తీసుకవచ్చేశారండి. గదిలోకి వెళ్ళాక తలుపు వేసుకున్నారండి. అంటే ప్రేమించడానికే కదండి"

"మరి ఆ అమ్మాయిగారి పేరేమిటన్నావు సూరి

బాబూ!" చాలా క్యాజువల్ గా అడిగాడు రఘు. కాని అతని గొంతులోని క్యూరియాసిటీని ఆ కుర్రాడు సైతం కనిపెట్టేశాడు.

"ఇంకా అనలేదండి. ఇప్పుడంటానండి. అమ్మాయి గారు పేరు.... పేరండి...."

అంటూ అతడి జేబువైపు మళ్ళీ ఆశగా చూశాడు సూరిబాబు.

'శ్రీరి నీ సినీ పరిజ్ఞానం దొంగలు తోలా' అనుకున్నాడు రఘు. జేబులోనుండి మరో ఐదురూపాయల నోటుతీసి అతడి చేతిలో పెట్టాడు. అది చేతిలోపడ్డ మరుక్షణం సూరిబాబు అమ్మాయిగారి పేరు చెప్పాడు.

ఆ పేరు విన్న వెంటనే....రఘు ముఖం ఒకవిధమైన విజయగర్వంతో వెలిగిపోయింది. తాను ఊహించినదే కరక్టయిందన్న భావం అతడి పెదవులపై చిరునవ్వాయి విరిసింది.

దివాకర్ ప్రేమించిన అమ్మాయి పేరు ....నాగమణి.

## 11

"నాగమణి యిప్పుడెక్కడుంది దివాకర్?"

ఆ ప్రశ్నకు ప్రక్కలో బాంబు పడ్డట్టు ఉలిక్కిపడి లాయర్ రఘు వంక చూశాడు దివాకర్.

ఆ అమ్మాయి పేరు నాగమణి అని తప్ప, ఆమెగూర్చి మరే వివరాలూ చెప్పలేకపోయాడు సూరిబాబు. నాగమణి, దివాకర్లగూర్చి మరే వివరాలనూ అక్కడ సంపాదించలేనని ధృవపర్చుకున్నాక వైజాగ్ నుండి వచ్చేశాడు రఘు.

సునందను భయపెడుతున్న దయ్యం....నాగమణి అని తెలిశాక, నాగమణి దివాకర్ ప్రియురాలని తెలి

పోయాక. ఇక ముసుగులో గుద్దులాట లేకుండా దివాకర్‌తో తాడో, పేడో తేల్చుకోవడం మంచిదనిపించింది అతనికి. అందుకే తిన్నగా వెళ్ళి దివాకర్‌ని కలిసాడతడు.

"నాగమణి ఎవరు?" ఆశ్చర్యం నటించాడు దివాకర్.

"నీ మాజీ ప్రియురాలు దివాకర్. కాలేజ్ చదివే రోజులలో డాబా గార్డెన్స్‌లో ఉన్నప్పుడు పూసుకొని తిరిగావే ఆ నాగమణి."

"ఏమో నాకేం తెలుసు. అప్పుడేదో కొన్నాళ్ళు కలసి తిరిగాం. కాలేజ్ అయిపోయాక నేను జయపూర్ వచ్చేసాను. ఇన్నేళ్ళ తరువాత ఇప్పుడు నాగమణి ఎక్కడుందంటే ఏం చెప్పమంటారు?"

విసుగ్గా చూశాడు దివాకర్.

"పోనీ నాగమణి అప్పుడెక్కడ ఉండేది దివాకర్?"

"అసలు మీకీ వివరాలన్నీ ఎందుకు?" చిరాగ్గా అన్నాడతడు.

"చెబుతాను దివాకర్. ముందు నా ప్రశ్నకు సమాధానం చెప్పండి."

"చెప్పకపోతే" రెట్టించాడతడు.

"మీకే నష్టం. కోరి ఒక హత్యలో ఇరుక్కోవడం ఎవరికీ ఇష్టం ఉండదు కదా" కూల్‌గా దివాకర్ కళ్ళలోకే చూస్తూ అన్నాడు రఘు.

రఘు వంక కలవరంగా చూశాడు దివాకర్.

"మీరంటున్నదేమిటో నాకర్థం కావటంలేదు" అన్నాడు మెల్లగా.

"అర్థమయ్యేలా చెబుతాను. ముందు జవాబు చెప్పండి."

"నాగమణి యేదో ప్రైవేట్ ఫర్మ్‌లో టైపిస్టుగా

పనిచేస్తుంరేది. వారి స్వగ్రామం కాకినాడట. వైజాగ్‌లో వర్కింగ్ వుమెన్స్ హాస్టలులో వుంరేది. ఏదో సరదా కోసం ఆమెతో కలసి తిరగాను కాబట్టి ఆమె మిగిలిన వివరాల జోలికి పోలేదు - ఆమెతో ఎఫైర్ అక్కడితో త్రెంచుకోవడమే నా ఉద్దేశం కాబట్టి. వైజాగ్ నుండి వచ్చేసేటప్పుడు కనీసం ఆమెను కలుకవుండానే వచ్చేశాను."

ఇంక చెప్పాల్సిందేమీ లేదన్నట్లు ఆగాడు దివాకర్.

"కానీ.... నాగమణే మీకోసం జయపూర్ రావచ్చుగా" అన్నాడు రఘు.

"ఆమెకు నా వివరాలేమీ చెప్పలేదు రఘూ. మాది బొంబాయి అని చెప్పాను ఆమెకు. ఇప్పుడు చెప్పండి యేమిటి యేదో హత్య అన్నారు."

"మీకు నిజంగా తెలియదా?" కవ్వించాడు రఘు. అతడి వంక తీవ్రంగా చూశాడు దివాకర్.

"నాగమణి చనిపోయింది దివాకర్."

నమ్మలేనట్లు చూశాడు దివాకర్. అతడి ముఖంలో షాక్ వలన వచ్చిన ఆశ్చర్యం కొట్టవచ్చినట్లు కనిపించింది.

"ఎప్పుడు?" అతని గొంతులో యేదో ఆత్రం.

"ఆమెను హత్యచేసిన మీకే ఆమె యెప్పుడు చనిపోయిందో తెలియదంటారా?" అతని కళ్ళలోకి చూస్తూ అన్నాడు రఘు.

"వాట్ నాన్‌సెన్స్ ఆర్ యూ టాకింగ్....?" కోపంగా అరిచాడు దివాకర్.

"కూల్ డౌన్ మై ఫ్రెండ్. టేకిట్ ఈజీ. నిజం నేను చెబుతాను విను. ఎలాగో నీ అడ్రస్ సంపాదించింది నాగమణి. తనను పెళ్ళిచేసుకొమ్మని నిన్ను వత్తిడిచేసింది.

కాని నీ కన్ను సునందమీద, ఆమె ఆస్తిమీద వుంది. అందుకే గుట్టుచప్పుడుకాకుండా ఆమెను హత్యచేసి వదిలించుకున్నావు."

అతని ముఖంలోని భావాలను ఓరకంటితో గమనించ సాగాడు రఘు.

"ఏదైనా పత్రికకు కథ వ్రాసి పంపు రఘూ బాగుం టుంది" వ్యంగ్యంగా అన్నాడు దివాకర్.

చిరునవ్వు నవ్వాడు రఘు.

"అన్నట్లు ఈమధ్య నాగమణి దయ్యమై వచ్చి రోజూ సునందను భయపెడుతూందట. నీకు తెలుసా?" యధాలాపంగా అన్నట్లు అన్నాడు రఘు.

ఆశ్చర్యంతో నోరు తెరిచాడు దివాకర్. అతన్ని చూస్తుంటే గొప్ప నటుడనిపించింది రఘుకు.

"మరీ అంతలా నటించనవసరంలేదు దివాకర్. నాగమణి చావును చూసిన వ్యక్తులున్నారు. చనిపోయిన నాగమణి వేషంలో ఇంకెవరినో పంపించి నీవాడిస్తున్న నాటకం నాకు తెలుసు.

నాగమణిని నీవే హత్య చేశావా, లేదా అన్నది తరు వాత చూసుకుందాం. కాని ఈ నాటకాన్ని నీవింత టితో ఆపకపోతే నీవు తీవ్రమైన పరిణామాలను ఎదు ర్కొనవలసి వస్తుంది.

"లేదూ, నిజంగా నాగమణి దయ్యమే నంటావా? అదీ చూస్తాను"—తీవ్రమైన కంఠంతో అన్నాడు రఘు.

ఆ మాటలకు కోపంగా ఊగిపోయాడు దివాకర్.

"రఘూ....నా ఇంట్లోకి వచ్చి నన్నే బెదిరిస్తావా? నీకెంత ధైర్యం? నేనిప్పుడే నీమీద పోలీస్ కంప్లయింట్ యిస్తాను."

"నేను లాయర్ని దివాకర్. నాకు చట్టం నీకంటే బాగా తెలుసు."

గేటుదాకా వెళ్ళి కనుతిరిగి చిరునవ్వుతో అన్నాడు రఘు.

రఘు వెళ్ళిన వంకే ఎర్రబడిన ముఖంతో చూస్తూ ఉండిపోయాడు దివాకర్. అయితే అతనికి ఒక్క విషయం ఆనందంగా ఉంది. అది తోయవోరద్వారా చేస్తున్న ప్రయోగం గురించి రఘుకు తెలియకపోవడం. ఇదంతా కేవలం మనుషులు ఆడుతున్న నాటకమని అనుకుంటున్నాడు అతడు.

'కాని ఇది ప్రేతాత్మ పని అని అతడికి తెలియదు' అనుకున్నాడు దివాకర్.

కాని, తను చేస్తున్న తాంత్రిక ప్రయోగం గురించి కూడా రఘుకు తెలుసని అతడికి తెలియదు.

## 12

రఘు ఊరినుండి వచ్చాడని తెలిసిన వెంటనే అతడిని కలుసుకుంది సునంద. వర్షం కురిసిన రాత్రి తన భయంకర మైన అనుభవమంతా అతడికి పూస గుచ్చినట్లు చెప్పింది.

"ఒకవేళ మిస్టర్ విజయ్ అన్నట్లు నీవు గాలికి ఎగురుతున్న ఆ హైఓల్టేజ్ కరెంట్‌ను చూసి దయ్యమని భ్రమపడ్డావేమో సునందా!" అన్నాడతడు.

"లేదు రఘూ.... నేను నాగవేణిని చాలా స్పష్టంగా చూశాను. అదీగాక ఈసారి ఆమె తలమీద మిణుకు మిణుకు మంటూ వెలుగుతున్న కిరీటం లాంటిది ధరించింది కూడానూ."

కొన్ని నిముషాలపాటు అతడు దీర్ఘాలోచనలో మునిగి

పోయాడు. అతని మనసులో నాగమణి మనిషేమో అన్న అనుమానం సునంద చెప్పిన ఆ వర్ణనతో బల పడింది.

నక్షత్రాకారంలో ఉన్న చిన్న చిన్న గాజు బల్బుల సీరియల్ సెట్‌ను నడుముకు ధరించి తిరగడం యిప్పుడు స్టూడెంట్స్‌కు క్రేజ్. పాకెట్ సైజు మినీ బ్యాటరీవలన ఆ బల్బులు వెలుగుతుంటే చీకటిలో చూసేవారికి అతని నడుముకు యేదో కాంతి వలయాన్ని చుట్టుకున్నట్లు గమ్మత్తుగా ఉంటుంది.

కాని....ఆ ఫాషన్ యింకా ఢిల్లీ, బొంబాయి లాంటి నగరాలను దాటి మిగిలిన చోట్ల విస్తరించలేదు. నాగ మణి అలాంటి సెట్‌ను ధరించి సునందను భయపెట్టిందా? అంటే నాగమణి మనిషా?

లేక తన మానవాతీతమైన శక్తితో, ఆ ప్రేతాత్మ ఆ వింత కాంతివలయాన్ని సృష్టించిందా?

తన మనసులోని ఆలోచనలను అతడు సునందకు చెప్ప లేదు.

"ఒక్క రెండురోజులు ఓపికపట్టు సునందా! ఈ మిస్టరీని ఛేదించే బాధ్యత నాది" అన్నాడు రఘు.

ఇక వస్తానన్నట్లు లేచింది సునంద. ఆమెను గేటు వరకూ సాగనంపి వచ్చాడతను.

ఆ రోజు సాయంత్రమే నాగమణి ప్రేతాత్మ విషయం తేల్చేయదలచుకున్నాడు అందుకోసం కోయవాగ వున్న గూడేనికి ప్రయాణమవుతున్నాడు అతడు. చిన్న హాండ్ బాగ్ లో తనకు కావాల్సిన వస్తువులన్నీ సర్దుకున్నా డతడు.

కొన్ని నిముషాల తరువాత అతడు డ్రయివ్ చేస్తున్న

కారు కోరాపుట్ పోయే రోడ్డుమీద శరవేగంగా సాగి పోతోంది.

అదే సమయంలో....విజయ్, సునందలు తమ వైజాగ్ క్యాంపు కోసం బట్టలు సర్దుకొంటున్నారు.

రోజు రోజుకు భయంతో నీరసించిపోతూ, నెర్వస్ అయిపోతున్న సునందను విశాఖలోని మానసిక వైద్యునికి చూపించాలని నిశ్చయించుకొన్నాడు విజయ్. అందుకే ఈ ప్రయాణం.

ఈ ప్రయాణం సునందకు అట్టే ఇష్టంలేదు. కాని ఈ రూపంగానైనా కాస్త స్థలం మారితే కొంత మానసిక విశ్రాంతి లభిస్తుందని ఆశించిందామె. అందుకే ఈ ప్రయాణానికి అంగీకరించింది. అందులో ఆమె వైజాగ్ ఎప్పుడూ చూడలేదు కూడాను.

రఘు డ్రయివ్ చేస్తున్న కారు కోయదొర వుంటున్న గుడిసె ముందు ఆగే సమయానికి, జయపూర్ స్టేషన్‌ను విడిచిపెట్టి వాల్తేరువైపు దూసుకుంటూ పోతోంది ప్యాసింజరు ట్రయిన్. అందులోని ఫస్టుక్లాస్ కంపార్టులోని మెత్తని సీట్లలో కూర్చుని వున్నారు విజయ్ సునందలు.

ఆ ట్రయిన్ ఉదయం ఆరుగంటలకు వాల్తేర్ స్టేషన్ చేరుకుంటుంది.

## 13

తన గుడిసె ముందు ఆగిన కారులో నుండి దిగుతున్న రఘును ఆశ్చర్యంగా చూశాడు కోయదొర.

"మీతోనే పనుండి వచ్చాను దొరా!" అన్నాడు రఘు

నాగరికులు తన దగ్గరకు ఎందుకు వస్తారో ఆ కోయ దొరకు తెలుసు అతడు చిన్నగా నవ్వాడు.

గుడిసెలోనికి నడిచారు వారు. చిన్న చిరుచాపలమీద కూర్చున్నారు వారు.

“ఒక యువతిపై దయ్యాన్ని ప్రయోగించాలి దొరా” అన్నాడు రఘు.

రఘువంక ఒక్క నిముషంపాటు చూశాడు ఆ దొర. తనకు తెలిసినంతవరకూ యిలాంటి విషయాల్ని యింత సూటిగా చెప్పినవారు యెవరూ తనకు తారసపడలేదు.

“దానికి సానా తంతు వుండాది సామీ” అన్నాడు దొర.

చిన్నగా నవ్వాడు రఘు. తన హాండ్ బాగ్ లో నుండి ఒక కాగితపు పొట్లాం తీశాడు. మెల్లగా ఆ పొట్లాన్ని విప్పాడు. అందులో పొడుగ్గా వున్న తల వెంట్రుక, కొన్ని గోళ్ళు వున్నాయి. వాటిని ఆ దొరకు అందించాడు.

“ఇవిగో నీకు కావాల్సిన ఆ యువతి వస్తువులు. ఇక డబ్బెంటావా నీ కెంత కావాలో చెప్పు....” అన్నాడతడు.

అతనివంక ఆశ్చర్యంగా చూశాడు దొర.

“ప్రేతాత్మలకు ప్రీతికరమైన చీకటి క్రమ్మేసింది దొరా ఇక నీవు పూజ ప్రారంభించవచ్చు.”

జేబులో నుండి పర్సు తీసి వందరూపాయల నోట్లను యిన్ని తీసి, నిర్లక్ష్యంగా ఆ దొరకు అందించాడతడు. ఆ నోట్లను చూసినవెంటనే ఆ దొరకళ్ళు ఆశతో మెరిసాయి. ఆత్రంగా వాటిని అందుకొన్నాడతడు.

తలారా స్నానంచేసి, దక్షిణదిశలో ముగ్గువేసి, ఆ

ముగ్గు మధ్య కూర్చున్నాడు దొర. యథావిధిగా ఆ కార్యక్రమాన్నంతా నెరవేరుస్తూ ఆ యువతి పేరు అడిగాడు అతడు.

"సునంద" అన్నాడు రఘు.

ఛెర్నాకోలతో ఎవరో తన వీపుమీద చరిచినట్లయింది దొరకు. అతడు విస్మయంగా చూశాడు.

"మరీ అంత ఆశ్చర్యంపోనవసరంలేదు దొరా! అదే పేరు గల యువతిమీద, నీవు దివాకర్ దగ్గర డబ్బు తీసుకుని దయ్యాన్ని ప్రయోగించావని నాకు తెలుసు.

ఆ దయ్యం వద్దులే. ఇంకో క్రొత్త దయ్యాన్ని ప్రయోగించు. రెండు దయ్యాలూ కలసి ఒకే అమ్మాయిని పీడిస్తుంటే భలే తమాషాగా ఉంటుంది కదూ!"

రఘువంక కోపంగా చూశాడు దొర. మౌనంగా పూజను పూర్తిచేశాడు. ఇక ముగ్గులోంచి నిలబడతాడనగా "దొరా!" అంటూ రఘు పిలిచాడు.

రఘువంక చూశాడతడు. హాండ్ బ్యాగ్ లో నుండి నిమ్మకాయలు, చిన్న చాకు, మానవాకారంలో చేయబడ్డ చిన్న పిండిబొమ్మ, హారతికర్పూరం, అగ్గిపెట్టె.... ఒక్కొక్కటీ తీసి మెల్లగా తన ముందు పేర్చాడు. ఆ వస్తువులను చూసిన కోయదొర కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. దొరవంక చూసి చిరునవ్వు నవ్వాడు రఘు.

"ఏంలేదు దొరా! నీలాగే నేనూ పూజ చేస్తే ఆ దయ్యం నాకూ కనిపిస్తుందో లేదో చూద్దామని.... అంతే!"

అంటూ నిమ్మకాయను చేతిలోకి తీసుకొన్నాడు. కుడి చేత్తో చాకును పట్టుకొని "ఓం ఎ బి సి డి ఇ ఎఫ్.... నిమ్మా సఫా" అంటూ నిమ్మకాయను కోశాడు.

విచిత్రం! ఆ నిమ్మకాయ చెక్కలు ఎర్రగా రక్తపు ముద్దలులా వున్నాయి.

"అరె.... నాకూ మంత్రాలు వచ్చేశాయి దొరా. చూశావా నిమ్మకాయల్లో నుండి రక్తం వస్తోంది. అన్నట్లు నీకో రహస్యం చెప్పనా? అది రక్తం కాదు. నిమ్మకాయల్లోకి ముందే చిక్కని ఎర్ర సిరాను సిరంజ్‌తో ఇంజక్ట్ చేశాను. బహుశా నీవు సింధూరాన్ని నీటిలో కలిపి ఎక్కిస్తావనుకుంటాను."

రఘు మాటలకు కోయదొర ముఖం వెల వెలా బోయింది ఓరకంటితో ఆ దొర ముఖంలోని భావాలను పరికించాడు రఘు.

అర చేతిలో హారతిని వెలిగించి "హాం.... హూం.... ఫట్...." అంటూ తన ముందున్న బొమ్మమీద వేశాడు. అంతే! కన్నులు మిరుమిట్లు గొలిపే కాంతితో ఆ బొమ్మ దగ్ధమై పోయింది.

"ఏమిటో నాకూ మంత్రశక్తి వచ్చేసినట్లుంది దొరా! బొమ్మ చూశావా యెలా కాలిపోయిందో? దీపావళికి మతాబులు కాలుస్తారు చూడు, ఆ మందుతో చేశాను దీన్ని. మెగ్నీషియమ్, సల్ఫర్‌ల మిశ్రమం దొరా అది. నీకు తెలియదు లే. అవునూ... నీవు దేంతో ఆ బొమ్మను తయారు చేస్తావు?" నవ్వుతూ అన్నాడు రఘు.

తన యెదురుగా కూర్చున్నది సామాన్య వ్యక్తి కాదని గ్రహించాడు కోయదొర. ఏమీ చేయలేని ఉక్రోషంతో అతడి ముఖం ఎర్రబారింది. అగ్నిలో ఆజ్యం పోసినట్లు రఘు మళ్ళీ పెదవి విప్పాడు.

"దయ్యం ఎప్పుడొస్తుంది దొరా!"

"ఇంతకూ యేమంటావు సామీ?" అసహనంగా

అన్నాడా దొర.

"అది మంచివారి లక్షణం దొరా. ఇప్పుడు అసలు కథకు వచ్చేద్దాం. నీవు చేసే గారడీలను శ్రద్ధగా నమ్మడానికి నేను దివాకర్ లాంటి వెంగళాయిని కాను. అది నీకు నిరూపించడానికే నీవు చేసే ట్రిక్స్‌ను నీ యెదుటనే చేసి చూపించాను.

"నీవు దయ్యాన్ని ప్రయోగించడమంతా వట్టి నాటకమని నాకు తెలుసు. కాని నిజం నీ నోటివెంటనే వినాలని వచ్చాను.

"ఇప్పుడు నిజం నిజం చెప్పు దొరా! మళ్ళీ కాకమ్మ కథలు చెప్పడానికి ప్రయత్నిస్తే కటకటాల వెనుక ఉంటావు."

ఆ మాటలు విన్నంతనే రక్తం లేనట్లు తెల్లగా పాలిపోయింది కోయదొర ముఖం. పోలీసులు, కటకటాలు మాటతో భయంతో గజ గజ వణికిపోసాగాడతడు.

"ఏదో పొట్ట కూటికోసం తంత్రాలు చూపిస్తూ బతికేవోన్ని సామీ. మీ లాంటి సాముల దగ్గర కాసుల కాస పడి పూజలు సేత్తును" అన్నాడతడు దీనంగా.

"అంటే నీవు దయ్యాన్ని ప్రయోగించడం ...?" సాలోచనగా దొరవంక చూశాడు రఘు.

"అంత శక్తి నా కేవది దొరా! ప్రేతాన్ని పట్టి ఆడించే మంత్రగాళ్ళుందేవారని వింటిని దొరా! కాని ఈ కంటితో కానలేదు" అన్నాడు దొర.

చిరునవ్వుతో తల పంకిస్తూ లేచాడు రఘు. కోయ దొర వినయంగా అందించిన నోట్లను తీసుకొని పర్స్‌లో పెట్టుకొన్నాడు. కారు డ్రయివ్ చేసుకొంటూ పోతున్న రఘువంక రిలీఫ్‌గా చూశాడు దొర.

రఘుకు మాత్రం అంతా గజిబిజిగా వుంది. కోయదొర దయ్యం ప్రయోగం అబద్ధమని తేలిపోయింది. అదే నిజమైతే సునందకు కనిపిస్తున్న దయ్యం ఎవరు?

చనిపోయిన నాగమణి నిజంగా దయ్యమై వస్తుందా? లేక నాగమణి వేషంలో యెవరో స్త్రీ....దయ్యంలా నాటకం ఆడుతుందా?

అయితే దివాకర్ కోయదొర దగ్గరకు రావడం, పూజలు చేయించడం, కేవలం తమను తప్పుదోవ పట్టించడానికి ఆడుతున్న మరో నాటకమా?

అన్నీ ప్రశ్నలే! చిక్కు ముడులు పడిన ప్రశ్నలు.

# 14

రాత్రి పదకొండు గంటలు దాటింది.

ప్యాసింజర్ ట్రయిన్ అరకు స్టేషన్‌లో ఆగింది. ఫస్టు క్లాసు కూపేలో నిద్రపోతున్న సునంద ఉలిక్కిపడి లేచింది. గాఢంగా నిద్రపోతున్న తనను ఎవరో తట్టిలేపి నట్లనిపించింది ఆమెకు.

“అరకు వచ్చింది. లే సునందా! నాతో రావూ?” అంటూ ఎవరో చెవిలో చెప్పినట్లనిపించిందామెకు. కన్నులు నులుముకుంటూ చుట్టూ చూసిందామె.

ఎదురుగా నవ్వుతూ నిలుచుంది నాగమణి.

అంతే! కెవ్వుమని కేక వేసిందామె. ఆమె కేక ట్రయిన్ కూతలో కలిసిపోయింది. ట్రయిన్ కదిలింది.

“రా....రా! సునందా!” అని నాగమణి చేతులు చాచింది.

“నో....నో....నో!” సునంద గొంతు బాధగా అరిచింది. ఇదేమీ తెలియని విజయ్ పక్క బెర్తుమీద గుర్రు పెడుతూ నిద్రపోతున్నాడు.

నాగమణి మెల్లగా ముందుకు కదలింది. భయంతో సునంద వణికిపోతోంది. చెవుల్లో భరించలేని హోరు. అదురుతున్న పెదవులు. చెమటతో ఒళ్ళంతా తడిసి ముద్దయిపోతోంది.

"వచ్చేయ్ సునందా!" మార్దవంగా వుంది నాగమణి గొంతు.

"ఏమండీ" డెస్పరేట్‌గా అరిచింది సునంద. కాని ఆమె గొంతు పెగలలేదు. అదే సమయంలో ఆమెమీదకు చేతులు చాచింది నాగమణి.

అంతే! భరించలేని టెన్షన్‌తో తల తిరిగి పోతోంటే అచేతనంగా అలాగే వెనక్కి వాలిపోయింది సునంద.

మళ్ళీ ఆమెకు తెలివి వచ్చేసరికి ఎదురుగా భర్త విజయ్ ఉన్నాడు. నాగమణి ఉందేమోనని బెరుకుతూ చూసిందామె. కాని ఆ రూమ్‌లో తామిద్దరూ తప్ప ఎవరూ లేరు.

ఉదయం ఏడుగంటల ప్రాంతంలో వాల్తేరు స్టేషన్‌లో దిగారు వారు. టాక్సీలో హోటల్ అప్సరాకు చేరుకున్నారు.

ఉదయం పదిగంటల సమయంలో బయలుదేరి వారు డాక్టర్ దగ్గరకు వెళ్ళారు.

'డాక్టర్ రుక్మిణి హిప్నాథెరపిస్టు'

అన్న నేమ్ ప్లేట్‌లోని అక్షరాలు చదివింది సునంద. ఉదయాన్నే రావడంచేత ఆ క్లినిక్‌లో వారు తప్ప పేషెంట్లెవరూ లేరు. అదీగాక, హిప్నాథెరపీ గురించి తెలిసిన వ్యక్తులు చాలా కొద్దిమంది ఉంటారు యీ దేశంలో.

ఎంతో జటిలమైన మానసికరోగాలను సైతం,మందుల సహాయం లేకుండా హిప్నోథెరపీ సహాయంతో నయం చేయవచ్చు. పాశ్చాత్య దేశాలలో ఎంతో ప్రాచుర్యాన్ని పొందిన ఈ మానసిక వైద్యవిధానం యిప్పుడిప్పుడే మన దేశంలో కూడా వెలుగులోనికి వస్తూంది.

వారు కన్సల్టింగ్ రూంలో ప్రవేశించారు. నీట్ గా సర్దబడి వుంది ఆ గది. ఓ మూలనున్న వాష్ బేసిన్ వద్ద నిలబడి చేతులు కడుక్కుంటోంది డాక్టర్ రుక్మిణి.

వారు ఆమెను విష్ చేసి, కుర్చీలలో కూర్చున్నారు. డెట్టాల్ సోపును చేతులకు రాసుకుంటోందామె. వెనుతిరిగి చూడకుండానే "చెప్పండి" అంది ఆమె. డాక్టర్ వీపు భాగం మాత్రమే తనకు కన్పిస్తున్నా 'చిన్న వయసే' అనుకుంది సునంద. ఆమె అందమైన ఆకారాన్ని చూస్తూ.

అరకులో మొదటి సారి నాగమణి శవాన్ని చూసినప్పటి నుండి, యిప్పటివరకూ జరిగిన సంఘటనలన్నీ క్లుప్తంగా చెప్పాడు విజయ్ రాత్రి ట్రెయిన్ లో జరిగిన సంఘటనలతో సహా.

ఉదయం లేవగానే నాగమణి వచ్చి తనను యెలా భయకంపితురాల్ని చేసిందీ భర్తకు చెప్పుకొని ఏడ్చింది సునంద. విజయ్ ఆమెను అనునయించాడు. డాక్టర్ తో, లాయర్ తో కేసును గూర్చి చెప్పేటప్పుడు ఏ రహస్యం దాచకూడదని అతనికి బాగా తెలుసు. అందుకే యే చిన్న విషయాన్ని కూడా వదిలిపెట్టలేదు అతడు.

"సో....షి ఈజ్ సఫరింగ్ విత్ హాల్యూసినేషన్. అంటే ఆమె ఒక రకమైన భ్రాంతిలో వుందన్న మాట. బహుశా నాగమణి శవాన్ని చూసిన షాక్ లో నుండి ఆమె పూర్తిగా తేరుకోలేదు. అందుకే దేనిని చూసినా

ఎవరిని చూసినా నాగమణే దెయ్యమయి వచ్చిందని ఆమె భయపడుతున్నారు."

టవల్‌తో చేతులు తుడుచుకొంటోందామె. డాక్టర్ గొంతు తనకు చిరపరిచితమైందిలా అనిపించసాగింది సునందకు. కాని విశాఖ రావడం, డాక్టర్ రుక్మిణిని కలుసుకోవడం జీవితంలో తనకు యిదే మొదటిసారి. మరి?....? సాలోచనగా డాక్టర్ వంకే చూస్తోంది సునంద.

టవల్‌ను హాంగర్‌పై వేసి మెల్లగా వెనుతిరిగింది డాక్టర్.

అంతే! డాక్టర్‌ను చూసిన మరుక్షణం భయంతో కంపించిపోయింది సునంద. ఆమె వేసిన కేకకు త్రుళ్ళిపడ్డాడు విజయ్....భర్త చేతిని గట్టిగా పట్టుకొంది ఆమె.

"నా....నా .. గమణి....నాగమణండి" వణుకుతున్న చేయితో డాక్టర్‌ను చూపిస్తూ అందామె.

భార్యవంక విసుగ్గా చూశాడతడు. 'డోంట్ బి చైల్డిష్ సునందా! డాక్టరుగారిని పట్టుకొని యేమిటా మాటలు?" భార్యను మెత్తగా మందలించాడతడు.

"లేదండీ, ఆమె డాక్టర్ కాదు. నాగమణి. చూడండి ఎలా వికృతంగా నవ్వుతూందో."

తనవైపే వస్తూన్న డాక్టర్‌ను చూస్తూ కంపిస్తూన్న గొంతుతో అంది సునంద.

"చూశారా డాక్టర్! ఇదీ పరిస్థితి. చివరకు మిమ్మల్ని చూసి కూడా నాగమణే అనుకుంటోంది" అన్నాడు విజయ్.

"ఇట్సాల్ రైట్. ఈ రోగులకు ఇది మామూలే!

ఏదమ్మా నిన్నొకసారి టెస్టు చేయనీ" మార్దవంగా పలికింది డాక్టర్ గొంతు.

తనను ముట్టుకోబోతున్న డాక్టర్‌వంక పామును చూసినట్లు చూసింది సునంద.

"వద్దు....వద్దు....నన్ను తాకొద్దు ...నాగమణీ ప్లీజ్! నన్ను వదిలేయ్!"

ఆయాసంతో గుండెలు ఎగిసి ఎగిసి పడుతుంటే భయంతో వణికిపోతోంది ఆమె గొంతు. తెల్లగా రక్తం లేనట్లు పాలిపోయి వుంది ఆమె ముఖం. తెలియని భీతితో విప్పార్చుకున్న ఆమె కళ్ళ నుండి ధారగా నీళ్ళు కారుతున్నాయి.

డాక్టరు చేయి మెల్లగా ఆమె భుజంమీద పడింది.

అంతే!

"నో!" అని కంఠనాళాలు తెగేలా అరుస్తూ వెనక్కి విరుచుకుపడిపోయిందామె.

## 15

సునంద, విజయ్‌లు విశాఖ నుండి వచ్చేసారని తెలిసిన వెంటనే వారి బంగళాకు వెళ్ళాడు రఘు.

నిస్త్రాణగా మంచంమీద పడుకున్న సునందను చూసే సరికి బాధగా తోచింది రఘుకు. తను సరిగ్గా గమనించలేదుగాని, అరుకు నుండి వచ్చాక సునంద చాలా చిక్కిపోయింది.

లోతుకు పోయిన బుగ్గలు, గుంటలుపడ్డ కళ్ళల్లో అనుక్షణం కదలాడుతున్న భయం....భీతి. చేతులు చిక్కి తోటకూర కాడల్లా ఉన్నాయి. మెడమీద నరాలు కన్పిస్తున్నాయి. ఇదే స్థితిలో మరి కొన్నాళ్ళుంటే సునంద తనకు దక్కుతుందా....? అనిపించిం

దతనికి.

రఘును చూసిన వెంటనే ఆనందంతో సునంద కళ్ళు మెరిశాయి. ఈ ప్రపంచంలో తన్ను నమ్ముతున్నది రఘు ఒక్కడే. లేని ఓపిక తెచ్చుకొని, హీనస్వరంతో....తమ వైజాగ్ క్యాంప్ గురించి అంతా పూస గ్రుచ్చినట్లు చెప్పింది ఆమె.

ఆమె చెప్పిందంతా వినేసరికి అతడి తల తిరిగి పోయింది. సునంద నిజంగా భ్రాంతిలో ఉందేమోనన్న అనుమానం మొదటిసారిగా కల్గిందతడికి.

ఆమెకు ధైర్యం చెప్పి బయటకు నడిచాడతడు. ఆ రోజే అతడు విశాఖపట్టణం బయలుదేరాడు. డాక్టర్ రుక్మిణిని కలుసుకుంటే గాని ఆ మిస్టరీ ముడి విడేట్లు లేదు అనుకొన్నాడు.

నిజంగా డాక్టర్ రుక్మిణినే చూసి, నాగమణి అని సునంద భ్రమపడినట్లయితే....ఈ కేసు తేలిపోయినట్లే. ఆమెకు మంచి వైద్యం చేయిస్తే చాలు సరిపోతుంది అని అనుకొన్నాడతడు.

డాక్టర్ రుక్మిణి క్లినిక్‌ను క్లోజ్ చేసేసరికి రాత్రి ఎనిమిది గంటలు దాటింది. పేషెంట్స్ అందర్నీ చూసేసి క్లినిక్ మూసేయడానికి సిద్ధపడుతోంది డాక్టర్.

సరిగ్గా ఆ సమయంలో వెళ్ళాడు రఘు. అతని అభ్యర్థనను కాదనలేక పోయింది డాక్టర్ రుక్మిణి. సుమారు గంటసేపు మాట్లాడుకున్నారు వారిద్దరూ.

డాక్టరు మాటలను విన్నాక 'తనుగాని భ్రాంతిలో' లేను కదా అనుకొన్నాడు రఘు.

డాక్టర్‌ను చూసి సునంద....నాగమణి.....నాగమణి అని పిచ్చిగా అరచిందట. 'కాని క్లినిక్‌లో మూర్ఛ

పోలేదు ఆమె' అంటూంది డాక్టర్.

"అయినా మూర్ఛపోవడానికి ఆమె శరీరకంగా చాలా ఆరోగ్యంగా వున్నారు. ఎంతో బ్రైజెట్‌గా వున్న ఆమె కళ్ళు, నిండయిన బుగ్గలు. షి ఈజ్ పెర్‌ఫెక్ట్లీ హెల్దీ" అంది డాక్టర్ రుక్మిణి.

పీక్కు పోయిన బుగ్గలతో, గుంటలుపడ్డ కళ్ళతో వున్న సునందనను చూశాడు తాను. నిండయిన బుగ్గలతో ఆరోగ్యంగా సునంద ఉంది అంటూంది డాక్టర్. కేవలం పన్నెండు, పదహారు గంటల మధ్య మనిషి శరీరంలో అంత మార్పు ఎలా సంభవం?

అదే అర్థంకాక పిచ్చెక్కినట్లుంది అతనికి.

అదీగాక డాక్టర్ చెప్పిన మరో రెండు విషయాలు సునంద చెబుతున్న దానికి భిన్నంగా ఉన్నాయి.

ఒకటి: ఉదయం పదిగంటల ప్రాంతంలో డాక్టరు దగ్గరకు వెళ్ళామని చెప్పింది సునంద. అప్పు డెవరూ పేషెంట్స్ లేరనికూడా చెప్పిందామె. కాని....

సునందను ఆమె భర్త విజయ్ తన దగ్గరకు తీసు కొచ్చేసరికి పన్నెండు దాటిందని. వారిని చూశాక తాను మరో పేషెంట్‌ను మాత్రం చూసి లంచ్‌కు వెళ్ళానంటూంది డాక్టర్. వారు క్లినిక్‌కు వచ్చే సరికి కనీసం ఐదారుగురు పేషెంట్స్ ఉండవచ్చు నంటుందామె.

రెండు: తాము కన్సల్టింగ్ రూమ్‌లోనికి ప్రవేశించేసరికి డాక్టర్ చేయి కడుక్కుంటోందని, అక్కడి నుండే తాము చెప్పిందంతా విన్నదని— చెప్పింది సునంద.

కాని—

వారు వచ్చి, వెళ్ళేంతవరకూ వక్కీలోనుండి లేవ
నైనా లేదని చెబుతూంది డాక్టర్.

ఇది యెలా జరిగిందో అర్థం కావటంలేదు అతనికి. హాలూసినేషన్‌లో ఒకరిని చూసి ఒకరని, తనకేదో దయ్యం పట్టిందని....ఇలా రక రకాలుగా భ్రాంతి పడటం సహజం. కాని సునంద చెప్పిన మొత్తం సంఘటనలోనే ఎంతో తేడా కన్పిస్తూంది.

"హౌ! హౌ కన్ ఇట్ బి పాజిబుల్!"

ముఖ్యంగా అతన్ని తికమక పెడుతున్నది సునందను ఆరోగ్యవంతురాలిగా చూశానన్న డాక్టర్ మాటలు.

# 16

"సునందా! నేను రాత్రి యింటికి రావడం కాస్త ఆలస్యం కావచ్చు. నీవు నా కోసం వెయిట్ చేయకుండా భోజనం కానిచ్చేయ్."

ఎక్జిట్ కు వెళ్ళే ముందు భార్యతో చెప్పాడు విజయ్! అప్పటికింకా ఆమె నిస్త్రాణగా మంచంమీద పడుకునే వుంది.

ముందురోజు రాత్రి కూడా మళ్ళీ నాగమణి వచ్చింది. భర్త విజయ్ ఆమె ప్రక్కనే పడుకొని వున్నాడు. కాని ఏం లాభం. ఆమె ఎంత ఏడ్చి మొత్తుకున్నా....యెదురుగా నాగమణి కన్పిస్తుందంటే అతడు నమ్మలేదు. భయంతో ఆ రాత్రంతా ఆమెకు నిద్రపట్టలేదు.

ఆ దయ్యం తన భర్తకు ఎందుకు కన్పించటంలేదో ఆమెకు అర్థం కావటంలేదు. ఆమె భయానికి అసలు కారణం అదే.

విజయ్ వెళ్ళిపోయాక ఒక గంటసేపటి తరువాత

ఆమె వద్దకు వచ్చాడు రఘు.

గత రాత్రి దెయ్యం వచ్చిన సంగతి అతడితో చెప్పిందామె. విజయ్ రావడం ఆలస్యమవుతూందని అంతవరకూ ఒంటరిగా ఉండటమంటే తనకు భయం వేస్తోందని అందామె.

రఘు ఆమెకు ధైర్యం చెప్పాడు. కాసేపు మాట్లాడి వెళ్ళిపోయాడతడు.

రాత్రి ఎనిమిది గంటలు అయింది.

చిక్కని చీకటి అంతటా పరచుకున్న వేళ. జయపూర్ నుండి కోరాపుట్ రోడ్డు మీద శరవేగంగా పోతూంది ఒక నల్లని కారు. దానిని డ్రయివ్ చేస్తున్నది దివాకర్. ఈ రోజు రాత్రితో తన ప్లాన్ సక్సెస్ కాబోతూంది. రేపీపాటికి తాను కొన్ని లక్షలకు అధికారి కాబోతున్నాడు.

అందుకే అతడికి పట్టలేనంత ఆనందంగా వుంది. హుషారుగా విజిల్ వేస్తూ డ్రయివ్ చేయసాగాడతడు. కారు కోయగూడెం వైపు మలుపు తిరిగింది.

రాత్రి తొమ్మిది గంటలు అయిందె—

మంచంమీద పడుకున్న సునంద అసహనంగా కదిలింది. ఎదురుగా నున్న రూమ్ తలుపులు ధఢాలున తెరచుకున్నాయి. తోటలో ఎగురుకుంటూ పోతున్న యేదో పిట్ట గొంతు వికృతంగా వినిపించిందామెకు.

మెల్లగా ఆ గదిలోనికి అడుగుపెట్టిన ఆకారాన్ని చూసేసరికి సునంద గొంతు అర్చుకుపోయింది.

ఆమె నాగమణి ...

ఈసారి ఎర్రగా రక్తం పూసినట్లు వుంది ఆమె ముఖం. నోటిలోనుండి రెండు పెదవుల చివరా పైకి

వచ్చిన రెండు కోరలు ఆమె ముఖాన్ని మరింత వికృతం చేస్తున్నాయి.

తనను కబళించడానికి వస్తున్న మృత్యువులా అనిపించింది సునందకు.

"రా ...సునందా! ఈ రాత్రికి యిలాగైనా నిన్ను తీసుకుపోతాను. వచ్చేయ్.... నాతో వచ్చేయ్!"

నూతిలోంచి వస్తున్నట్లున్నాయి ఆమె మాటలు.

నాగమణి ఒక్కొక్క అడుగూ ముందుకు వేస్తుంటే.. ఏవో రాక్షస పాదాలతో తన గుండెలమీద నడుస్తున్నట్లుంది సునందకు. భయంతో గజ గజ వణికిపోసాగిందామె.

నాగమణి మెల్లగా ఆమె మంచాన్ని సమీపించింది.

ఒక్కసారి వికృతంగా నవ్విందామె. గుండెలను వణికించే నవ్వు, శరీరాన్ని చల్లబరిచే నవ్వు. వెన్నును వణికించే నవ్వది.

సరిగ్గా ఆ సమయానికి....

కోరాపుట్‌లోని ప్రముఖ డాక్టర్ సదానందం యిస్తున్న పార్టీలో వున్నాడు విజయ్. కేవలం ఫార్మాలిటీ కోసమే ఆ పార్టీకి ఎటెండ్ కాలేదతడు. వీలుంటే తన భార్య సునంద ఆరోగ్యం గురించి అతడితో మాట్లాడదామనుకున్నాడు కానీ వీలుచిక్కటం లేదతనికి.

డి.ఎస్.పి. జిల్లా న్యాయమూర్తి, డాక్టర్ సదానందం ఒక టేబిల్ దగ్గర కూర్చున్నారు. తమ టేబిల్‌కు కాస్త దూరంలో ఒంటిరిగా కూర్చున్న విజయ్‌ను చూశాడు డాక్టర్.

"అరె....విజయ్ వంటరిగా కూర్చున్నావేమిటి కమాన్ మై బోయ్....హావ్ ఎ షేర్ విత్ అజ్."

తన సీట్లోనుండి లేచి విజయ్‌ను సాదరంగా ఆహ్వానించాడతడు. కేవలం ఆ ఆహ్వానంకోసమే విజయ్ తమకు కనిపించేటట్లు అక్కడ ఒంటరిగా కూర్చున్నాడని అతడికి తెలియదు.

విజయ్‌ను డి.ఎస్.పి.కు, జడ్జీకు పరిచయం చేశాడతడు. సుమారు గంటసేపు ఆ టేబిల్ దగ్గరే గడిపాడు విజయ్. ఒకసారి చేతికున్న వాచీవంక చూసాడు.

"అరె... పది గంటలు దాటింది. డాక్టర్ సాబ్, ఇక నేను వెళ్ళొస్తాను" అన్నాడు విజయ్.

"ఏమిటోయ్ తొందర....సునందగాని వేగంగా రాకపోతే తప్పుకోనందా యేమిటి?" నవ్వుతూ అన్నాడు డాక్టర్.

డాక్టర్ సదానందం, సునంద తాతగారు మంచి ఫ్రెండ్స్. విజయ్. సునందలపట్ల అతడికీ వాపాటి చనువుంది.

"అది కాదు డాక్టర్" అంటూ సునంద అనారోగ్యం గురించి డాక్టర్ రుక్మిణికి తాను చూపించడం అంతా వివరంగా చెప్పాడు. అతడు చెప్పినదంతా డాక్టర్ సదానందంతోపాటు, డి.ఎస్.పి. జడ్జీలుకూడా ఆలకిస్తున్నారు.

అయితే అసుపత్రిలో తాము నాగమణి శవాన్ని చూశామన్న విషయం మాత్రం అతడు చెప్పలేదు.

అతడు పార్టీనుండి బయటపడేసరికి పదకొండు గంట అయింది.

## 17

"నాగమణీ...."

ఖంగుమంటూ వినవచ్చింది ఒక గొంతు.

సునందను సమీపించబోతున్న నాగమణి ఆ పిలుపుకు ఉలిక్కిపడింది. గిరుక్కున వెనక్కి తిరిగింది.

తలుపులను దగ్గరగా మూసి. నవ్వుతూ ద్వారందగ్గరే నిలుచుని వున్నాడు లాయర్ రఘు.

డెస్పరేట్ గా గది నాలుగు ప్రక్కలా చూసిందామె. ఆమె ముఖంలో యేదో కలవరం.

"సారీ ... నాగమణీ ఈ గదినుంచి నీవు తప్పించుకో లేవు. అన్నట్లు నీవు దయ్యానివి కదూ .... తలుపులు మూసినా గాలిలో తేలిపోతూ మాయమైపోతావను కుంటా" వ్యంగ్యంగా అన్నాడు రఘు.

ఆశ్చర్యంగా రఘును, నాగమణిని చూడసాగింది సునంద. అంతలో ఎటుక్కున చీరచెంగుమాటున దోపు కున్న రివాల్వర్ తీసింది నాగమణి

ఒక్కక్షణం షాక్ తిన్నాడు రఘు. కాని వెంటనే తేరుకొని చిన్నగా నవ్వాడు.

"అంటే దెయ్యాలుకూడా రివాల్వర్స్ కాలుస్తా యన్నమాట. నేనింకా భయపెట్టి మాత్రమే మనుషుల్ని చంపుతాయనుకున్నాను."

హేళన చేస్తున్న రఘువంక కోపంగా చూసిందామె. రివాల్వర్ ను సూటిగా అతడికే గురిపెట్టి ముందుకు అడుగు వేసిందామె

నాగమణి దయ్యం కాదని తెలిసిన వెంటనే ఎక్కడ లేని ధైర్యమూ వచ్చేసింది సునందకు. మెల్లగా చేతిలోకి దిండును తీసుకుంది. నాగమణి సూటిగా రఘునే చూస్తుంది. విసురుగా దిండును ఆమె చేతిమీదకు విసిరింది.

అంతే! ఆ అదగుడు నాగమణి చేతిలోని రివాల్వర్ క్రింద పడింది. ఆ దేసమయంలో ఒక్క గంతులో నాగమణిని సమీపించాడు రఘు ఆమెను కదలకుండా బంధించాడు.

రివాల్వర్ పై తన వ్రేలిముద్రలు పడకుండా కర్చీఫ్ వేసి, మెల్లగా తీశాడు. ఆతి డి వం క ఆశ్చర్యంగా చూస్తోంది సునంద.

# 18

కారును గ్యారేజ్ లో పెట్టి హుషారుగా విజిల్ వేసు కుటూ బంగళాలో ప్రవేశించాడు విజయ్. మెల్లగా తన బెడ్ రూమ్ తలుపులు తెరిచాడు.

మంచంపై అడ్డంగా, అచేతనంగా పడివుంది సునంద. భయంతో ఆమె కళ్ళు విప్పార్చుకొని వున్నాయి. పెదవులమీదుగా బుగ్గమీదకు ప్రాకిన ఒక రక్తపుచారిక ఆమె గక్తం కక్కుకుందని తెలియజేస్తూంది. అతడు మెల్లగా ఆమెను సమీపించాడు. ముక్కు దగ్గర వ్రేలు పెట్టి చూశాడు. శ్వాస ఆడటంలేదు.

అంటే సునంద మరణించిందా....?

అతడు మెల్లగా టెలిఫోన్ను సమీపించాడు. ఏదో నంబర్ డయల్ చేయసాగాడు.

"డాక్టర్కు ఫోన్ చేస్తున్నారా మిస్టర్ విజయ్."

చివ్వున చూశాడతడు ఎవరా అని. ద్వారం దగ్గర నిలుచుని వున్నాడు రఘు.

"సునంద చచ్చిపోయింది విజయ్. రాత్రి ఎనిమిదీ తొమ్మిది గంటలమధ్య. ఆ సమయంలో మీరు డాక్టర్ సదానందంగారి ఇస్తున్న పార్టీలో వున్నారుకదూ. పార్టీ మీకు తెలియదనుకుంటా."

అసహనంగా చూశాడు విజయ్. తన ముఖంలో మారుతున్న భావాలను అతికష్టంమీద అణచుకుంటున్నాడతను.

"అన్నట్లు నాగమణి చనిపోలేదు విజయ్. బ్రతికే వుంది. ఒ సందరం దయ్యామనుకున్నామా. విచిత్రం. ఆమే మనిషే. ఇక్కడే ఉంది. మీరూ చూస్తారా?" అన్నాడు రఘు.

తప్పు చేసినట్లు తలవంచుకుంటూ ఆ గదిలోనికి ప్రవేశించింది నాగమణి. ఆమె వంక కలవరంగా చూశాడు విజయ్. కాని క్షణంలో సర్దుకున్నాడతడు.

"మీ ప్రియురాలు లలితను పలుకరించరేమిటి విజయ్. పాపం మీకోసం శ్రమపడి దయ్యంలా చక్కగా నటించింది కూడానూ."

"రఘూ" కోపంగా అరిచాడు విజయ్. "మీరేమి మాట్లాడుతున్నారో నాకర్థం కావటంలేదు. ఆమె ఎవరో, దయ్యంలా నాటకం ఆడటం యేమిటో. అసలు నా భార్య సునంద చనిపోయిందన్న షాక్ నుండే తేరుకోలేకపోతున్నాను" బాధగా అన్నాడు.

"యూ ఆర్ ఎ జీనియస్ విజయ్. ఆస్తికోసం పెళ్ళి చేసుకున్న సునందను ఆస్తికోసమే అంతం చేద్దామనుకున్నావు. అయితే సునందను హత్యచేస్తే ఆ అనుమానం నీ మీదికే వస్తుంది కాబట్టి. ఎవ్వరికీ అనుమానం రానివిధంగా ఈ అద్భుతమైన ప్లాన్‌ను రూపొందించావు. మీ ఆస్తికి తదుపరి వారసుడైన దివాకర్‌ని అనుమానితుడ్ని చేయడానికి మీరు పన్నిన వ్యూహం రియల్లీ ఫెంటాస్టిక్.

దివాకర్ ప్రియురాలు నాగమణిగా, మీ ప్రియు

రాత్రైన లలితను రంగంలోకి దించావు. ఆయువులోని జల పాతం దగ్గర శవంలా పడుకున్న లలితను సునందకు చూపించడం మీ ప్లాన్‌లోని మొదటి భాగం.

ఆ తరువాత దయ్యంలా నీ ప్రియురాలు లలిత వచ్చి సునందను భయపెట్టడం. ఆ దయ్యం నీకు కనిపించనట్లు అమాయకంగా నీవు నటించడం నీ నాటకంలోని రెండవ భాగం.

చివరకు డాక్టర్ రుక్మిణిగా కూడా నీ ప్రియురాల్నే చూపించి సునందను మరింత నెర్వస్ చేశావు. ఎవ్వరికీ అనుమానం రాకుండా లలితకే సునందలా వేషం మార్చి మళ్ళీ డాక్టర్ రుక్మిణి దగ్గరకు తీసుకువెళ్లావు.

ఎంత తెలివైనవాడైనా హంతకుడు యెక్కడో ఒకచోట తప్పు చేయక మానడు విజయ్.

లలితకు సునంద వేషమైతే వేయగల్గావుగాని, ఆమె ఆనారోగ్యాన్ని కాని తేలేకపోయావు.

పీక్కుపోయిన బుగ్గలతో, గుంట కళ్ళతో మంచం మీద పడివున్న సునందను చూశాను నేను. కాని, తన దగ్గరకు మీరు తెచ్చిన సునంద ఆరోగ్యంగా నిండుగా వున్న బుగ్గలతో, కాంతులీనే కళ్ళతో ఉందని చెప్పింది డాక్టర్ రుక్మిణి.

అప్పుడే మొదటిసారి మీమీద అనుమానం వచ్చింది. మొత్తం సంఘటనలన్నీ సమీక్షించి చూస్తే ...సునందకు దయ్యం కనిపించినప్పుడు మీరు మాత్రమే ప్రక్కన వుంటున్నారు. కాని మీకు ఆ దయ్యం కనిపించటం లేదు! అంటే మీరు నాటకం ఆడుతున్నారన్న అను మానం బలపడింది నాకు.

అందుకే ఈ రాత్రి నాగమణి దయ్యంకోసం మాటు

వేశాను. మీ ప్రియురాలు లలిత మామూలుగా దయ్యం వేషంలో వచ్చి, పాపం....నాకు పట్టుపడటంతో మీ నాటకానికి తెరపడింది విజయ్"

చెప్పడం ఆపి ఓరకంటితో విజయ్ ను చూశాడు రఘు.

"మీ కథ చాలా బాగుంది రఘూ! ఏదైనా డిటెక్టివ్ పత్రికకు పంపించండి. వేసుకుంటారు" వ్యంగ్యంగా అన్నాడు విజయ్.

"అలాగా! కాని లలిత తన నేరాన్ని ఒప్పుకుంది విజయ్. నిన్ను నేరస్థునిగా నిరూపించడానికి ఆమె సాక్ష్యం చాలదంటావా?" అన్నాడు రఘు.

"ఎవరో ఊరూ ... పేరూ తెలియని అనామకురాలి స్టేట్ మెంట్ ఆధారంగా నన్ను నేరస్థుడని అనుమానిస్తున్నారంటే మీరెలా లాయర్ అయ్యారో నాకర్థం కావటంలేదు.

నా భార్య మరణించింది. హెలూసినేషన్..అంటే భ్రాంతికల్గ యేర్పడ్డ భయంతో. దానికి మీరేవో ఈమె దయ్యంలా వచ్చి భయపెట్టిందంటూ క్రొత్త కథను సృష్టించడం వింతగా వుంది" చిరాకుగా అన్నాడు విజయ్."

"కాని ఈమెను....మీ భార్య సునంద ప్రత్యక్షంగా తన కళ్ళతో చూసింది విజయ్."

"కాని ఆ మాట చెప్పడానికి నా భార్య బ్రతికిలేదు రఘూ."

"సో....లలితే దెయ్యంలా వచ్చి తనను భయపెట్టిందని చెప్పడానికి చనిపోయిన మీ భార్యే బ్రతికి రావా అన్నమాట. వెల్. అలాగే కానీయండి.

"సునందా! ఒక్కసారి లేచి వస్తావా!"

అతడి చివరి మాటకు ప్రక్కలో బాంబుపడ్డట్టు ఉలిక్కిపడ్డాడు విజయ్. కంగారుగా సునందవైపు చూసాడు.

మెల్లగా మంచంమీదనుండి లేస్తూంది ఆమె. ఆమె 'కళ్ళు' అతడిని అసహ్యంగా చూస్తున్నాయి.

"నో....నో!" అంటూ పిచ్చివాడిలా అరిచాడు విజయ్.

"బట్ ఇట్స్ ట్రూ విజయ్! నీ కోసం నేనాడించిన చిన్న నాటకమిది" కటువుగా అన్నాడు రఘు.

ఎదురుగానున్న గదిలోనుండి ఒక చేతితో టేప్ రికార్డర్, మరో చేతితో సంకెళ్ళను పట్టుకొని ఆ గది లోనికి ప్రవేశించిన ఇన్‌స్పెక్టర్ వైపు వెర్రివాడిలా చూశాడు విజయ్.

—: అయిపోయింది :—

# అగ్నినేత్రాలు

ఎ. యస్. రావ్

(గతసంచిక తరువాయి)

## 19

ఆఖరిచుక్క విస్కీని నాలుక మీద పోసుకుని, బాటిల్ని పొదల్లోకి విసిరి కవాల్ సిగరెట్ వెలిగించాడు.

పరమేశ్వర్ మాటలు అతన్ని అసంతృప్తితో నింపేశాయి. విస్కీ, సిగరెట్, రుచికరమైన బ్రాందీ. ఆడదీ కాకుండా డబ్బు తృప్తి పొందని పరమేశ్వర్ లాంటి వాళ్ళు ఎందుకు ఆపోహపడతారో అతనికి అర్థంకావడం లేదు.

ఎవరైనా డబ్బుతో కొనగలిగేది ఈ సుఖాన్నే. కానీ రేపు ఎంత డబ్బైనా శిరీషలాంటి సౌందర్యాన్ని కొనలేదు!

తద్దాన్ని పని చేసినందుకు పరమేశ్వర్ మండిపడతాడు. ఏదో పొరపాటు చేసినందుకు పదివేలు తగ్గించి తన వాటా ఇమ్మంటే, కిక్కురుమనకుండా వూరుకుంటాడు,

శిరీషతో స్వర్గం చూడ్డానికి తన వాటిలో పదికేలు త్యాగం చేయడానికి తను సిద్ధంగా ఉన్నాడు.

కమల్ ఉద్రేకంతో లేచాడు. కర్టెన్ని తోసుకుని లోపల దూరాడు. భద్రం వోపిగ్గా మూటాముల్లే సర్దుతున్నాడు. కమల్ కళ్ళు వోరగా చూశాయి. కాళ్ళూ, చేతులూ ! లిపి బంధించబడిన శిరీష తల్లి గర్భంలో శిశువులా ముడుచుకు పడుకుంది.

కమల్ సామాన్లు సర్దేవాడిలా కాసేపు నటించాడు. సర్దుతూ తన మెడికల్ కిట్ ని తీసుకున్నాడతను. కిట్ లోకి వెళ్ళిన కమల్ చేతులు క్షణంలో అతని పాంటు జేబులోకి వెళ్ళాయి. ఎడం చేతిని మరో జేబులో దోపుకుని అతను శిరీష దగ్గరగా నడిచాడు. డేగ నీడ మీదపడిన కోడిపిల్లలా అదిరిపడి శిరీష తలతిప్పి చూసింది. కమల్ పళ్ళు ఇకిలించాడు.

"డార్లింగ్, నీ మొగుడు నిన్ను విడిపించుకెళ్తాడు.... ఐ విల్ మిస్ యూ!" అన్నాడు బిగ్గరగా. గొర్రెను చూసిన తోడేలులా భద్రం చిటికెలో కమల్ పక్కకి చేరుకున్నాడు. అతని చెయ్యి బలంగా కమల్ భుజమ్మీద పడింది.

"ఆమెను సతాయించక. బైటికెళ్ళు!" భద్రం కటువుగా అన్నాడు.

"సతాయించలేదు.... ఫేర్ వెల్ చెప్తున్నా.... సరే.... అదీ ఇదీ సర్దుతా" కమల్ భద్రం చూపుల్ని గమనించి బెదురుతూ అన్నాడు.

"నీకా శ్రమ అక్కర్లేదు. బైట కాపలాకాయ్. గెటౌట్!" భద్రం కమల్ని తోస్తూ అన్నాడు. కమల్ భుజాలు ఎగరేసి వికిలిగా నవ్వాడు.

"ఫ్లాష్. రథంలాగే వాళ్ళున్నప్పుడు రాజాలా చూచే దానికి మనకేం అభ్యంతరం లేదు!" అంటూ అవతలికి అడుగులేశాడు.

అంతలోనే—

"త్రాచుపాము.... మైగాడ్ ....త్రాచు కాటేసింది!" కమల్ కీచుగా అరిచాడు. భద్రం అతని దగ్గరగా పరుగెత్తాడు. కమల్ వొగరుస్తున్నాడు.

"అక్కడ నిలబడమంటే ఇక్కడికెందుకొచ్చావ్?" భద్రం విసుగ్గా అన్నాడు.

"అబ్బా.... నాలుగడుగులు వేశాను.... తొక్క తొక్కినట్టున్నా .... ఓహ్ .... కాటేసి.. జరజరా పాకిపోయింది."

"అరవకు. ఫస్టు ఎయిడ్ కిట్ యెక్కడుంది?" భద్రం ప్రశ్నించాడు.

కమల్ బుస్సుమని నిట్టూర్చాడు. "పత్రాలేదు.... నా లిస్టులో అదిలేను...."

"ఎవడయ్యా నిన్ను డాక్టరంది? ఇప్పుడేంచేద్దాం?" నేలమీద గొంతుకూర్చుంటూ భద్రం అడిగాడు.

"కాటేసినచోట రెండు గాట్లు పెట్టాను. పళ్ళతో పట్టుకుని రక్తం పీల్చేయి...." అంటూ కమల్ జేబులోంచీ అగ్గిపెట్టెతీసి పుల్ల గీశాడు. భద్రం వొంగి చూశాడు. పాదం పైభాగంలో ప్లస్ ఆకారంలో ఎర్రటి గీతలు అవుపిస్తున్నాయి. కమల్ భయంతో వొగరుస్తున్నాడు.

"త్వరగా.... పీల్చేయి గురూ...." తొందర పెట్టాడతను గాబరాగా.

"వెలుగ్లోకి వెళ్దాం" అన్నాడు భద్రం లేవబోతూ. కమల్ చెయ్యి అతని ముఖాన్ని గాబరాగా పట్టుకుంది.

"వద్దు. కదిలితే విషం ఎగబాకిపోతుంది.... అబ్బా ..." కమల్ నీరసంగా అన్నాడు. మరో ఉగ్గిపుల్లగీశాడు. భద్రం ముందుకి వంగి కమల్ పాదాన్ని పళ్ళ మధ్య బిగించి పీల్చాడు. రెండు క్షణాల తర్వాత ఉమ్మేసి మళ్ళీ పీల్చసాగేడు. కమల్ మూలుగుతూనే వున్నాడు.

కమల్ కుడి చెయ్యి అతని తొడకిందికి జరిగింది. రెప్పపాటులో ఫార్టివిన్ లోడ్ చేయబడిన సిరెంజితో ఇవతలికి వచ్చింది. ఏకబిగిని రక్తం పీలుస్తూ తనకి ప్రథమ చికిత్స చేస్తున్న భద్రం మెడని కమల్ చిరునవ్వుతో చూశాడు. అతని చెయ్యి మెరుపులా కదిలింది. నీడిల్ కసుక్కున ఎద్దు అర్రులో దూరుతున్నట్టు భద్రం మెడలో దూరింది. కమల్ అరచెయ్యి ఆటోమాటిక్ గా సిరెంజిని నొక్కింది.

ఆందోళనతో కదలబోయిన భద్రం తలని కమల్ ఎడమచెయ్యి గట్టిగా అదిమిపెట్టింది. సిరెంజిని లాగి, పాదాన్ని వదిలించుకుంటూ కమల్ లేచాడు. మరుక్షణం అతని బూటుకాలు భద్రం కణతమీద సుత్తిలా రెండు మూడుసార్లు తాకింది.

కమల్ కసిగా మరోసారి భద్రం డొక్కలో బలంగా తన్నాడు. రెండు కాళ్ళూ పట్టుకుని భద్రాన్ని నిర్దాక్షిణ్యంగా ఈడ్చుకుంటూ వెళ్ళాడు. గుహకిపక్కగా దూరంగా వున్న రెండు బండరాళ్ళ మధ్య ఇరికించాడు.

నుదురుకి పట్టిన చెమట తుడుచుకుంటూ తనలో నవ్వుకుంటూ గుహాముందు భాగంలో ప్రవేశించాడు.

లోపల వెలుగుతున్న పెట్రోమాక్స్ లైటు కాంతిలో వాచీ చూసుకున్నాడు. వాళ్ళు తిరిగిరావడానికి అరగంట

పైనే పట్టొచ్చు. తన పనికి అరగంట చాలు! నవ్వుకుంటూ అతను శిరీష వున్న అరలోకి అడుగులు వేశాడు....

# 20

ఏదో నీడ తనమీద పరేసరికి, పాము పడగ నీడమీద పడిన చిన్నారి పక్షికూనలా శిరీష ఉలిక్కిపడి, ఆందోళనతో తల తిప్పి చూసింది.

పళ్ళన్నీ కనిపించేలా ధారాళంగా నవ్వుతూ అతను నించున్నాడు. ఆమె కళ్ళు భద్రంకోసం అటూ ఇటూ చూశాయి. కమల్ చిన్నగా నవ్వాడు.

"నీ అంగరక్షకుడు కునుకుతున్నాడు, డార్లింగ్!" అన్నాడతను. రాక్షసి సాలీడు కాళ్ళలా ముడుచుకుంటూ సాగుతూ వున్న అతని చేతివేళ్ళని శిరీష భయంతో అసహ్యంతో చూసింది. ఎగతాళినీ, గర్వాన్నీ ఎగజిమ్ముతున్న కమల్ కళ్ళుఆమెలో ఆగ్రహాన్ని నింపుతున్నాయి.

"....డార్లింగ్...." కమల్ ప్రారంభించాడు.

"డోంట్ కాల్ మీ డార్లింగ్ యూ బ్రూట్!" శిరీష పళ్ళు కొరుకుతూ అంది.

"కోపంలోకూడా నువ్వు మగాడి మతి పోగొట్టేలా వుంటావని నీ 'రచయిత మొగుడు' ఎప్పుడేనా చెప్పాడా, డార్లింగ్?" చిరునవ్వుతో అంటూ అతను ఆమె దగ్గరగా జరిగాడు.

"దూరంగా పో! అరుస్తాను భద్రం వచ్చి నీ ముక్కు పచ్చడి చేస్తాడు!" అరిచిందామె. కమల్ నిర్లక్ష్యంగా నవ్వాడు. అతని మూపుడు వేలు ఛాతీ మీదున్న 'ఎంబ్రేస్ మీ' అన్న అక్షరాల్ని చూపించింది.

"ఈ ఛాతీమీదయేముందో చదువుకో డార్లింగ్...." అన్నాడతను రొమ్ము విరుస్తూ. శిరీష మొహం జేవురించింది,

"విల్సా! కట్టిపడేసిన నన్ను ఎందుకిలా వేధిస్తావ్? ప్లీజ్ గో!"

కమల్ చెయ్యి ఆమె శరీరాన్ని చూపుతూ గుండ్రంగా తిరిగింది. "వడ్డించిన విస్తర్ని వదిలివెళ్ళే చవటాయిని కాను, డార్లింగ్...." అంటూ తన టీషర్టుని తీసి దూరంగా విసిరాడు.

"నిండు చూలాల్ని. నన్ను అన్యాయం చెయ్యొద్దు" ఆమె కంఠం దీనంగా వుంది.

"నీ గర్భం మనకి అడ్డురాదు డార్లింగ్!" కమల్ నిర్లక్ష్యంగా అన్నాడు. రెండడుగులు వేసి ఆమె దగ్గరగా కూచున్నాడు. ఆమె కొంచెం దూరంగా పాకింది. కమల్ ఆమెవేపు ఆకలిగా, తదేకంగా చూశాడు.

"డార్లింగ్....నామాట విను. నేను గర్భస్రావాల ఎక్స్‌పర్టుని. మత్తుమందు ఇవ్వకుండా నీకు అబార్షన్ చేసేపని నాకు అప్పగించబడింది. నాతో సహకరించు. అబార్షన్ చేయకుండా వదిలేస్తాను. సెకండ్ ఛాన్స్ కోసం బైట కాచుక్కూచున్న భద్రం నీ జోలికిరాకుండా చేస్తాను...."

"నో!" శిరీష అరిచింది. "మొరిగే కుక్కలకి నా భర్త బిస్కట్స్ పారేస్తున్నాడు. నామీద అఘాయిత్యం జరగడానికి వీల్లేదు!"

కమల్ వెటకారంగా నవ్వాడు. "డార్లింగ్, ఇది అడివి రాజ్యం. ఇక్కడ రూల్సూ, వాగ్దానాలు నెరవేర్చడాలు వుండవ్! నీతో కబుర్లు చెప్పడానికి రాలేదు" అంటూ అతను ఆమె మోకాలిమీద చెయ్యివేశాడు. శిరీష మెలిక తిరుగుతూ విదుల్చుకోబోయింది. కమల్ నవ్వాడు. ఆమె కాళ్ళ బంధాలు తొలగించాడు. జాకెట్టు

ఫక్కున చిరిగింది.

శిరీష మొహంలో నెత్తురు ఇంకిపోయింది.

అతని శరీరం ఆమె శరీరాన్ని తాకుతూ కొండ చిలువలా కదుల్తోంది. అప్రయత్నంగా ఆమెలోని అణువణువూ శరీరాన్ని అతన్నుంచీ దూరంగా జరుపుతోంది. కమల్ జుట్టు ఆమె చెంపల్ని తాకుతోంది. కమల్ కుడిచెయ్యి ఆమె భుజంమీంచీ దూరంగా ఆమె కాళ్ళవైపు జరిగింది. శిరీష కళ్ళు మూసుకుంది.

ఆమె పిడికిళ్ళు యాంత్రికంగా బిగుసుకున్నాయి. కోరికతో అతని కళ్ళు రెండూ కొరుకుల్లా వున్నాయి. శిరీష పిడికిళ్ళు ఇంకా ఇంకా బిగుసుకుంటున్నాయి. పొడుగాటి గోళ్ళు ఆమె అరచేతుల్లో దిగిపోతున్నాయి. అరచేతులు మండుతున్నాయి.

శిరీషలో యేదో మెరుపులా మెరిసింది. తన అభిమాన ఆంగ్ల రచయిత జేమ్స్‌హాడ్లీ ఛేజ్ సృష్టించిన యువతిపాత్ర మిస్ బ్లాండిష్—ఆమెకి తటాలున గుర్తొచ్చింది.

కట్లు విడిపించుకోడానికి ఆమె చేతులు అసంకల్పితంగా గింజుకున్నాయి. కట్లు విడిపోకపోయినా కొద్దిగా వదులయ్యాయి. చేతులు కొద్దిగా ఎడంగా జరిగాయి. రెప్పలు పైకెత్తి ఆమె కమల్‌ని చూసింది.

ఆనంద సముద్రాన్ని ఒకేసారి, ఒకే గుక్కలో జుర్రుకోవాలన్న తాపత్రయంలో ఈ లోకంలో లేడు. శిరీష చేతులు ఆమె తల వెనకనుంచీ మెల్లగా పైకిలేచాయి. కమల్ మొహం ఆమె పెదిమలవైపు వాలుతోంది. శిరీష మొహాన్ని కొద్దిగా పక్కకి తిప్పింది.

తన్మయత్వంతో సగం మూసుకున్న కమల్ రెప్పల్లోంచీ ఆమె గోళ్ళు కత్తుల్లా దిగిపోయాయి. శరీరంలోని

శిరీష వేళ్ళు కౌగన్లోకి కేంద్రీకరిస్తూ ఆమె తన గోళ్ళని లోపలికంటా గుచ్చేసింది. తన కళ్ళకి ఏం జరుగుతుందో కమల్ తెలుసుకునేలోగానే ఆమె గోళ్ళు కొక్కెల్లా అతని కనుగుడ్లని తగులుకున్నాయి.

కమల్ బడితె దెబ్బతిన్న పందిలా కీచుగా అరిచాడు. అతని చేతులు క్షణంలో శిరీష చేతుల్ని బలంగా పట్టుకుని దూరంగా తోయసాగేయి.

కొక్కెల్లా వున్న గోళ్ళు కమల్ కళ్ళని పెకలిస్తున్నాయి. కమల్ భయంకరంగా అరవసాగేడు. ఆ అరుపులు ఆమె చెవులకి వినపడ్డంలేదు. కసికి మారురూపాలుగా మారిన శిరీష గోళ్ళు నిర్దాక్షిణ్యంగా అతని కళ్ళని దొల్చుకుపోతున్నాయి.

శిరీష వేళ్ళనీ, అరచేతుల్నీ రక్తం తడుపుతోంది. కమల్ కీచుగా, భయానకంగా అరిచాడు. రక్తసిక్తంగా శిరీష గోళ్ళు ఇవతలికి వచ్చాయి.

కమల్ పొలుసు విరిగిన పాములా విలవిల్లాడుతున్నాడు. రెండు కాళ్ళనీ పైకి ముడుస్తూ శిరీష అతని పొట్టలో బలంగా తన్నింది. నిస్సహాయంగా వున్న కమల్ బంతిలా కిందికి దొర్లిపోయాడు.

శిరీష ఈ లోకంలోకి వచ్చింది. కుప్పకూలిపోయిన కమల్ అరుస్తూ, మూలుగుతూ యమయాతన పడుతున్నాడు. రెండు కళ్ళనీ కప్పిన అతని వేళ్ళ సందులగుండా రక్తం కారుతోంది.

శిరీష తటాలున లేచింది. ఎన్నో యుగాల తరవాత తన కాళ్ళమీద నిలబడ్డట్టుందామెకి. తూలిపడబోతూ నిలదొక్కుకుంది. భయం భయంగా ద్వారం వేపు చూసింది. భద్రం రానందుకు ఆశ్చర్యపోతూ ఆలోచిస్తూ

సుహాంతటినీ కలయజూసింది. పెట్రోమాక్స్‌లైటు ఆమె దృష్టిని ఆకర్షించింది.

గబగబా నడిచి లైటుని సమీపించింది, తన రెండు మణికట్ల మధ్యా వున్న ప్లాస్టిక్ తాడుని లైటు గ్లాస్‌కి ఆనించి పెట్టింది. వేడికి తాడు కాలుతూ మాడుతోంది. క్షణంలో ఆమె రెండు చేతులూ దూరదూరంగా జరిగాయి. వణుకుతున్న వేళ్ళతో చేతుల్ని చుట్టి వేళ్ళాడుతున్న తాడు ముక్కల్ని తీసేసింది.

కిందికి వేళ్ళాడుతున్న పైటని చిరిగిపోయిన జాకెట్ మీదుగా కప్పి, కొంగుని నడుములో దోపుకుంది. ప్రేమగా తన కడుపుని నిమిరింది.

ఏడుపులా ధ్వనిస్తున్న కమల్ కంఠం ఆమెని హెచ్చరించింది. శిరీష అప్రయత్నంగా స్టౌవేపు నడిచింది. స్టౌ పక్కనే వున్న అగ్గిపెట్టెనీ, కిరోసిన్ డబ్బాను అందుకుంది. నేల మీద గొంతుక్కూచుని రోదనం చేస్తూన్న కమల్‌ని సమీపించింది. మహిషాసురుణ్ని చూస్తున్న భద్రకాళిలా కమల్ని సెగలుకక్కే కళ్ళతో రౌద్రంగా చూసింది.

"భద్రం ఎక్కడున్నాడు?" కమల్‌ని ప్రశ్నించిందామె.

కమల్ ఆమెవైపు తలెత్తి కళ్ళు తెరిచే ప్రయత్నం చేశాడు. "యూ బిచ్!....రాక్షసీ! నా కళ్ళు పీకేశావ్! నాకేమీ కనపడ్డంలేదు! అమ్మో...." కమల్ రొప్పుతున్నాడు.

అతని కళ్ళున్నచోట రెండు రక్తపు గుంటలున్నాయి. అతని వేళ్ళిప్పుడు వ్యాయామం చేయడంలేదు

"నా కళ్ళు! నా కళ్ళు! అమ్మో .... అబ్బా .... "

కమల్ బొబ్బలెట్టసాగేడు.

శరీష కిరోసిన్ డబ్బాని పైకెత్తి, కమల్‌ని కిరోసిన్‌తో అభిషేకం చేస్తూ దిమ్మరించింది. కిరోసిన్ వాసన వాసన గుహంతా వ్యాపించింది.

కమల్ గాభరాగా అరిచాడు. శరీష అగ్గిపుల్ల గీచింది....

"కిరోసిన్!..మైగాడ్!....ఏమిటి చేస్తున్నావ్...?" కమల్ గాభరాతో పొలికేకలు పెట్టాడు.

కిరోసిన్ అతని కళ్ళల్లో జొరబడింది. అతని మొహం మీద శరీష గోళ్ళు గీచిన గాలుగలు దారుణంగా మండుతున్నాయి. చూడలేని కళ్ళని, రెండు నెత్తురు మడుగుల్ని అతను శరీష వైపు ఎత్తాడు. "ఎందుకు?"

"నీమీద డబ్బాడు కిరోసిన్ పోశాను. అడిగే ప్రశ్నలకు చకచకా సమాధానాలు చెప్పు. భద్రం యెక్కడున్నాడు?" శరీష కంఠంలో వణుకులేదు.

"నువ్వు.. నువ్వు....నన్ను మోసం చేశావ్...." కమల్ బలహీనంగా వదురు ప్రారంభించాడు.

"నా చేతిలో అగ్గిపుల్ల వెలుగుతోంది. నేను మూడు అంకెలు పలికేలోగా ప్రశ్నకు జవాబు చెప్పాలి. లేకపోతే కాలుతున్న అగ్గిపుల్ల నీ జుట్టును ముట్టిసుంది!" శరీష కంఠం గంభీరంగా ధ్వనించింది. "ఒకటి....రెండు...."

"నో! చెప్తాను. భద్రం....రాళ్ళ చాటున నిద్రపోతున్నాడు....అతనికి మత్తు ఇంజక్షన్ ఇచ్చాను...." ఆక్రోశించాడు. "శరీషా....నా కళ్ళు....నాకేమీ కనిపించడం లేదు....అమ్మో....ప్లీజ్ నన్ను క్షమించు...నీస్కీమా చేత అంతా చేయించింది....నా కళ్ళు....తడిగుడ్డతో"

"షటప్!" శరీష గర్జించింది. "సిరెంజీ, మందూ

ఎక్కడున్నాయి?"

కమల్ క్షణకాలం తటపటాయించాడు. శిరీష ముందుకి వంగి, అతని చెవిపక్కనే మాచ్ అగ్గిపుల్ల గీచింది. పక్కలో బాంబు పడ్డట్టు కమల్ అదిరిపడ్డాడు.

"నోనోనో ప్లీస్....అగ్గిపుల్ల వద్దు! నా జేబులో వున్నాయి...." నిస్సహాయంగా రోదించాడు.

"తీసి, నీ చేతితో మారంగా పెట్టు....క్విక్!" శిరీష ఆజ్ఞాపించింది.

కమల్ చెయ్యి సిరంజనీ ఇంజెక్షన్ వయల్ని కింద పెట్టింది. శిరీష వాటిని అందుకుంది.

"శిరీషా....అది....నీకు....ఎందుకు?" కమల్ కంఠం వణుకుతోంది.

బాటిల్లోని ద్రవాన్ని సిరంజిలోకి ఎక్కించి శిరీష అతన్ని ఎగతాళిగా చూసింది "కళ్ళుపోయిన నొప్పి తెలీకుండా నీకు ఇంజక్షన్ ఇస్తాను డార్లింగ్!" అందామె వెటకారంగా నవ్వుతూ.

"నో! ప్లీస్....వొద్దు....వొద్దు....నీకు తెలీదు...." కమల్ కంగారుగా బొబ్బలెట్టాడు.

"నాకు తెలుసు....డార్లింగ్....భయపడొద్దు!" శిరీష ముందుకు వంగుతూ అంది. "డార్లింగ్....డాక్టర్! పిచ్చి వేషాలు వేయకు. అగ్గిపెట్టె నోటిలో పట్టుకుంటాను. ఎడంచేత్తో పుల్ల గీస్తాను. కుడిచేత్తో నీ జబ్బలో ఇంజక్షన్ ఇస్తాను! కదిలితే తలకి కొరివి పెడతాను!" అందామె కటువుగా.

"ప్లీస్....బెస్టుకోస్....ఎక్కువొద్దు..." కమల్ ప్రాధేయపడ్డాడు.

"డోంట్ వర్రీ డార్లింగ్ .... డోంట్ మూవ్ డార్లింగ్!" అంది శిరీష.

"ఒగ్లీ ఫుల్ల గీయకు .... కదలను .... ప్లీస్ .... బెస్టు డోస్ ...."

శిరీష చెయ్యి ముందుకి మూసుకెళ్ళింది. నీడిల్ కమల్ జబ్బలో లోతుగా, కసిగా దిగింది. అసంకల్పితంగా కమల్ కెవ్వుమన్నాడు. మందు సలుపురూపంలో అతని చేతిలోకి జొరబడింది. కమల్ యేడుస్తూ మూలుగుతున్నాడు. సిరెంజిని ఇవతలికి లాగి, శిరీష అతన్ని పరీక్షగా చూసింది.

మందు ఎంతసేపట్లో అతన్ని తన స్వాధీనంలోకి తీసుకుంటుందో ఆమెకి తెలీదు....

అరకాలుని కమల్ మొహంమీద ఆన్చి శిరీష బలంగా తోసింది. కమల్ అరుస్తూ వెనక్కి పడ్డాడు. అతని యేడుపు సన్నటి మూలుగుగా మారుతోంది.

శిరీష అరుగు దగ్గరగా నడిచింది. సిరెంజీని, బాటిల్ని జాగ్రత్తగా అరుగుమీద పెట్టి, ఆలోచిస్తూ వెనుదిరిగింది. కమల్ అచేతనంగా పడున్నాడు. శిరీష అతని తలవేపు నడిచింది. వొంగి అతని పొడుగాటి జుట్టుని రెండు చేతుల్తో పట్టుకుని లాగింది. వెనక్కి తూలిపోబోతూ, నిలదొక్కుకుని తన చేతుల్లోకి వూడివచ్చిన విగ్గునీ, కమల్ తలనీ ఆశ్చర్యంగా చూసింది....

తనకి కనిపించిన రూపాలు నేరస్థుల అసలు రూపాలు కావన్నమాట!

విగ్గుని కమల్ మొహంమీద పడేసి, అతని క్రాపు పట్టుకుని శిరీష అతన్ని కేన్వాస్ గుట్టవైపు లాక్కెళ్ళింది. క్షణంలో కేన్వాస్‌తో కమల్ శరీరాన్ని పూర్తిగా

కప్పేసి, అతని మెడికల్ కిట్ వైపు నడిచింది.

కిట్‌లో ఇంకా రెండు ఇంజెక్షన్ వయల్స్ వున్నాయి. ఆలోచిస్తూ ఆ రెండింటినీ ఆమె రొంటిన దోపుకుంది. అరుగుమీదున్న సిరంజినీ, బాటిల్నీ చేతుల్లోకి తీసుకుంది.

సాలోచనగా సీసాలోని ద్రవాన్ని సిరెంజిలోకి లాగ సాగింది....

## 21

కౌండిన్య కిందికి వొంగి, సూట్‌కేసుల్ని కిడ్నాపర్ చెప్పినట్టుగా పదకొండో ఊడకి ఆన్చాడు. లేచి నిలబడ్డాడు. నెత్తిమీంచి యేదో పర్వతాన్ని దించేసినట్టనిపించిందతనికి.

సూట్‌కేసులు తీసుకెళ్ళడానికి వచ్చిన వ్యక్తి యే ఊడ చాటున దాక్కున్నాడు? తనకి కనిపించకుండా యేవో కళ్ళు తన ప్రతి కదలికనూ కనిపెడుతున్నాయన్న ఆలోచన రాగానే అతని వొళ్ళు జలదరించింది.

ఎవరో తరుముతున్నట్టు కౌండిన్య కారువైపు నడిచి, డోర్ని తెరిచాడు. లోపల దూరి స్టీరింగ్ వెనక కూలబడ్డాడు. అప్రయత్నంగా రెండు చేతుల్తో తన మొహం తుడుచుకున్నాడు. చెమటతో అతని అరచేతులు పూర్తిగా తడిసిపోయాయి. జేబులోంచీ రుమాలు లాగి మొహానికీ, మెడకూ పట్టిన చెమటని తుడుచుకున్నాడు.

సిగరెట్ కాల్చాలనిపించిందతనికి. బ్లాక్ మెయిలర్ సూచన అతనికి గుర్తు వచ్చింది. అతను తనని సిగరెట్ ఎందుకు కాల్చమన్నాడు? అగ్గిపుల్ల వెలుగు అతనికి యేదేనా సిగ్నల్ ఇస్తుందా? కౌండిన్య సిగరెట్ వెలిగించి పుల్లని కిందపడేశాడు.

ఊపిరి తిత్తుల్లో జొరబడిన పొగ అతన్ని ఉక్కిరి

బిక్కిరి చేసింది. దగ్గుతూ పొగని బైటికి కక్కి, కార్ని స్టార్టు చేశాడు. కార్ని ముందుకి పోనిచ్చి, వెనక్కి తిప్పాడు. కారు కంకర్రోడ్డుమ్మీద వేగంగా వెళ్ళ సాగింది.

కౌండిన్యలో ఎన్నో ఆలోచనలు సాగుతున్నాయి. ఎవరో కాస్సేపట్లో సూట్ కేసులు తీసుకుంటారు. ఆ వ్యక్తిని వెంబడిస్తే తను శిరీషను చేరుకోగలడా? హెచ్చరికను నిర్లక్ష్యం చేసిన తనని వాళ్ళు వదుల్తారా? శిరీష గతి యేమిటవుతుంది?

ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ ఎక్కడున్నాడు? మెయిన్ రోడ్డులో అయిదు కిలోమీటర్లు వెళ్ళి తనని ఆగిపొమ్మన్నాడు? అలా చేస్తే ప్రమాదంకాదా?

తల విదిలిస్తూ కౌండిన్య కార్ని మెయిన్రోడ్డుమీద ఎడమకి తిప్పాడు. క్షణాలు గడుస్తున్నాయి. అంటు వున్న సిగరెట్ ఆరిపోయింది. దాన్ని బైటికి గిరాటేసి, స్టీరింగ్ మీద మోచేతుల్ని ఆన్చి అతను మరో సిగరెట్ వెలిగించాడు.

కారు మలుపు తిరిగింది. అప్రయత్నంగా కౌండిన్య బ్రేక్ నొక్కాడు. ఎదురుగా, రోడ్డుకి అడ్డంగా వాన్ ఆగివుంది. కారు ఆగింది. కౌండిన్య కళ్ళు చిట్లిస్తూ చూశాడు. వాన్లోంచి యెవరూ దిగలేదు.

క్షణంలో వాన్ వెనక భాగంనుంచీ తన కారువేపు అడుగులేస్తున్న ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ ఆకారం అతనికి కనిపించింది. తను ఇంకా రెండుకిలోమీటర్లుకూడా దాటలేదు .. కౌండిన్య ఆలోచిస్తున్నాడు.

“క్రిందికి దిగండి” కారు దగ్గర వచ్చి ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ అన్నాడు.

"ఇన్‌స్పెక్టర్.... యూ ఛైకిలో మీటర్లు వెళ్ళమని...."
కాండిస్యలోని భయం మాట్లాడింది.

"ప్లీస్ గెట్ డౌన్!" కాండిస్య డోర్ తెరిచి దిగాడు.

"రఘురామ్, కార్ని తోలుకుంటూ రోడ్డుమ్మట వెళ్ళిపో. ఆ తరవాత నేను చెప్పినట్టు చెయ్!" ఇన్‌స్పెక్టర్ తన వెనక నిలబడి అసిస్టెంట్‌ని ఆజ్ఞాపించాడు.

తనలాగే తెల్లటి దుస్తుల్ని ధరించిన రఘురామ్‌ని కాండిస్య ఆశ్చర్యంగా చూశాడు. రఘురామ్ క్షణంలో కార్ని ముందుకుపోనిచ్చి, వాన్‌ని తప్పుకుంటూ వెళ్ళి, రోడ్డుమ్మట దూసుకెళ్ళాడు. కాండిస్య చీకట్లో ఇన్‌స్పెక్టర్ వైపు తిరిగాడు.

"ఇప్పుడు మీరు తన ఆజ్ఞను ఖచ్చితంగా పాటిస్తున్నారని అతను అనుకుంటాడు!" ఇన్‌స్పెక్టర్ నవ్వుతూ అన్నాడు.

"ఇన్‌స్పెక్టర్..." కాండిస్య యేదో అడగబోయాడు.

"వాన్‌లో కూచుందాం. జరిగింది చెప్పండి. జరగాల్సింది నేను చేస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ వాన్ వైపు అడుగులేస్తూ.

## 22

వాన్ సీటుమీదున్న సూట్‌కేసుల్లోని నోట్లకట్టల్ని పెన్‌టార్చ్ కాంతిలో పరమేశ్వర్ సంతృప్తితో చూశాడు. స్టీరింగ్ ముందు కూచున్న భూషణ్ కంఠం నోట్లని చూడగానే ఉత్సాహంతో అర్థంకాని చప్పుళ్ళు చేసింది.

"భూషణ్, అతను అంతా చెప్పినట్లే చేశాడా?" పరమేశ్వర్ సూట్‌కేసులు మూస్తూ చెప్పాడు.

"అక్షరాలా.... కారు కాస్సేపట్లో మెయిన్‌రోడ్డమ్మట

దూసుకెళ్ళింది. ఇప్పటికి అతను దూరంగా వెళ్ళిపోయుంటాడు....." భూషణ్ నవ్వుతూ అన్నాడు.

పరమేశ్వర్ సగర్వంగా నవ్వాడు. "వంట పూర్తయింది. వడ్డించుకుతిందాం! త్వరగా పద!" అన్నాడు ఉత్సాహంగా. అతని చెయ్యి ప్రేమగా సూట్ కేసుల్ని నిమురుతోంది.

వాన్ స్టార్టయింది. చీకట్లో, కొండదారివేపు మెల్లిగా సాగింది.

రోడ్డుకి అడ్డంగా ఆగిన వాన్ని ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ స్టాపు చేసి, కుడివేపుకు తిప్పి, రోడ్డు వారగా ఆపాడు. రేడియం డయల్ వాచీ చూసుకుని పక్కనే కూర్చున్న కౌండిన్యవైపు తల తిప్పాడు.

"ఇన్‌స్పెక్టర్ గారూ, ఇప్పుడు ఏం చేద్దాం?" తన లోంచీ తన్నుకొస్తున్న ఎన్నో ప్రశ్నల్లో మొదటిదాన్ని కౌండిన్య ఉచ్ఛరించాడు.

ఇన్‌స్పెక్టర్ మళ్ళీ టైమ్ చూసుకున్నాడు. "పైకంతో వాళ్ళు తమ స్థావరానికి వెళ్తూవుంటారు. అక్కణ్నుంచీ పిట్టలన్నీ ఎగిరిపోతాయి...."

"శిరీష...." కౌండిన్య సందేహిస్తూ అన్నాడు.

"ఆమెని మళ్ళీ తమతో తీసుకెళ్తారని నేను అనుకోడం లేదు. బ్లాక్ మెయిలర్ మెడకి ఆమె గుదిబండ అవుతుంది. అతను ఆమెని ..."

"పూర్తిగా అతను చెప్పినట్టు నడుచుకోడం శిరీషకి క్షేమం అని నేను అనుకుంటున్నా...." కౌండిన్య వణికే కంఠంతో అన్నాడు. పృథ్వీరావ్ వాన్ని స్టార్టు చేశాడు.

"మిస్టర్ కౌండిన్యా, మీ పరిస్థితినీ, మీ భయాన్నీ

నేను ఊహించగలను. ఆమె నోరు శాశ్వతంగా నొక్క-బడేలోగా మనం ఆమెని రక్షించుకోవాలి. వాన్‌లో సూట్‌కేసులు పట్టుకెళ్ళారు...."

"మీ కెలా తెలుసు?"

"నాకు అందిన వైర్‌లెస్ మెసేజ్ ఆధారంగా వాళ్ళు వెళ్ళిన రోడ్డు కూడా నాకు తెలుసు. ఆ రోడ్డుని అడ్డంకాచి, వాళ్ళని బంధించగచ్చు. కానీ మనకి కావాల్సింది వాళ్ళు కాదు; మీ భార్య! ఆమెని రక్షించాక, వాళ్ళ గురించి ఆలోచిద్దాం...."

## 23

హెడ్‌లైట్స్ లేని వాన్ మలుపు తిరిగింది. "బాస్...." రాజు పిలిచాడు. అతని కళ్ళు గతుకుల రోడ్డుమీదే వున్నాయి.

"యస్, రాజా ..." పక్కనే శాంతియుతంగా కూచున్న పరమేశ్వర్ పలికాడు.

"ఆమెని వొదిలేసి ...అతనికి ఆమె వున్న జాగా తెలియజేసి ...మాయమైపోదాం....ఆమెని కూడా తీసుకెళ్ళడం...."

పరమేశ్వర్ చిన్నగా నవ్వాడు. "ఆమె గురించి మరచిపో. మన గురించి ఆలోచించు!"

"బాస్...."

"ఆమెని మనతో తీసుకెళ్ళినా, ఇలాగే ఇక్కడో, మరెక్కడో వదిలేసినా మనకి ప్రమాదమే! అంచేత మన ప్లాన్‌కి కొత్త రూపం ఇచ్చాను. ఎందుకేనా మంచిదని మొదట్లో మీకు చెప్పలేదు...."

"నాకు అర్థం కావడంలేదు...." రాజు మెల్లిగా అన్నాడు.

"నువ్వు జీవించాలంటే నీ శత్రువు మరణించాలి, రాజా!"

రాజా అదిరిపడ్డాడు. "ఛాప్.... ఆమెని.... చంపడం అనవసరం.... మనం అడిగింది మనకిచ్చారు...."

పరమేశ్వర్ కళ్ళు నిశితంగా, సూటిగా చూశాయి. "పొట్ట నిండాలంటే పొట్టేల్ని చంపాలి! ఆమెని దారుణంగా చంపే అవసరంలేదు. అందుకే కమల్‌ని మనతో తెచ్చుకున్నా. అతనిదగ్గర ఇంకా మూడు ఫోర్ట్విన్ వయల్స్ వున్నాయి. ఆ మూడింటినీ ఆమెకి ఇంజెక్ట్ చేయిస్తే చాలు! ఏం జరిగిందో తెలీకుండా ఆమె ఇక మెలకువ లేని నిద్రలోకి జారుకుంటుంది! కమాన్, వాన్‌ని పోనీ!"

రాజా మాట్లాడకుండా వాన్‌ని పోనిచ్చాడు. పదిహేను నిమిషాల తర్వాత పర్వతపాదం దగ్గర వాన్ ఆగింది. పరమేశ్వర్ స్విచ్చి నొక్కాడు. వాన్‌లోని టాప్ లైట్ వెలిగింది. రాజా అతనివైపు తిరిగాడు. పరమేశ్వర్ చెయ్యి పాంటు జేబులోకి వెళ్ళి ఇవతలకి వచ్చింది. అతని చేతిలో నల్లగా మెరుస్తున్న రివాల్వర్‌ని చూసి, రాజా ఉలిక్కిపడ్డాడు.

"రాజా! ఈ రివాల్వర్ తీసుకో. గుహకి వెళ్ళు. ఆమెని హతమార్చే కార్యం కమల్‌కి అప్పగించు. కమల్‌కి ఆమె అందంమీద వ్యామోహం, ఆకలీ వున్నాయి. అతను నీ మాట వినకపోవచ్చు. రివాల్వర్‌ని అతని డొక్కలోకి ఆనించు. కమల్ కిక్కురుమనకుండా చెప్పింది చేస్తాడు. ఆమెను చంపేసి, మన సరంజామాతో ముగ్గురూ తిరిగిరండి. నే నిక్కడే వుంటా. ఆలస్యం కాకుండా ఆమె శరీరాన్ని రాబందులూ, తోడేళ్ళూ

హాయం చేసి వేస్తాయి!" అంటూ పరమేశ్వర్ రివాల్వర్‌ని రాజా ముందుకు చాచాడు.

రాజు రివాల్వర్ అందుకోలేదు. మెల్లిగా తలెత్తి పరమేశ్వర్‌ని చూశాడు. అతని మొహం చెమటతో తడిసిపోయి వుంది. "బాస్....ఆమె....నిండు చూలాలు.... మనందరం దాదాపుగ రూపాలు మార్చుకొన్నాం. మన అసలు రూపాలు ఆమెకి తెలీవు...."

"నీ నడక, నీ కంఠం. నువ్వు చేతులు ఆడించే విధానం నిన్ను పట్టిస్తాయి. రాజా! కమాన్! నేను చెప్పినట్టు చెయ్. త్వరగా వెళ్ళిపోవాలి!" పరమేశ్వర్ తొందర పెట్టాడు.

రాజు భయపడుతూ చూశాడు. "నా కెందుకో.... భయంగా వుంది....బ్లాక్ మెయిల్ ఒక రకం. హత్య.... చాలా ప్రమాదం "

పరమేశ్వర్ మొహంమీద చిరునవ్వు ప్రత్యక్షమైంది. ముందుకి వంగి స్విచ్చి నొక్కి లైట్‌ని ఆర్పేశాడు. రెండు సూట్ కేసుల్ని తీసుకొని కిందికి దిగాడు. వాన్ పక్కనే పరమేశ్వర్ కాసేపు నిలబడిపోయాడు.

"రాజా....నీకు అనుభవం తక్కువ. అందుకే భయపడుతున్నావ్! ఆల్ రైట్....ఆ పని నేను చేసివస్తాను. నువ్వు సూట్ కేసులు చూసుకుంటూ ఇక్కడే వుండు" అన్నాడు

రాజు తేలిగ్గా నిట్టూర్చాడు. "అలాగే బాస్!" అన్నాడు కొంచెం హుషారుగా.

"ఓకే....వాన్‌లో యెక్కు. లైటు వేయొద్దు...." అంటూ పరమేశ్వర్ సూట్ కేసుల్ని రెండు చేతుల్తో పట్టుకుని వాన్ మధ్యకి నడిచాడు. వాన్‌లోంచి రాజు

తొంగిచూశాడు. కిందికి వొంగి నుంచున్న పరమేశ్వర్ పైకి లేచాడు.

“రాజా, సూట్ కేసులు అందుకో” అంటూ పరమేశ్వర్ రెండు చేతుల్నీ పైకెత్తాడు. వాన్ కిటికీలోంచి రాజా చేతులు చాచాడు.

“ఇటుపక్కన ఒక చెయ్యి రానీ. రెండూ ఒక విండోలో పట్టవు!” అన్నాడు పరమేశ్వర్.

కుడిచేతిని లోపలికి తీసుకుని, విండో రాడ్ కి అటు వైపునుంచీ కిందికి జాపాడు రాజా. మరుక్షణం అతని రెండు చేతులకీ, మణికట్ల దగ్గర జేడీలు క్లిక్కుమన్నాయి. రెండు చేతులకీ అతుక్కున్న రింగుల్ని కలుపుతోన్న గొలుసుమధ్యలో రెండు సూట్ కేసులూ వేళ్లాడుతున్నాయి.

రాజా బిత్తరపోయాడు. క్షణకాలం అతనికి యేం జరిగిందో అర్థంకాలేదు. చేతుల్ని లాగాడు. బరువుగా సూట్ కేసులు అతని చేతుల్ని కిందికి లాగుతున్నాయి. జరిగిందేమిటో అతనికి అర్థమైంది. తనని సూట్ కేసుల్తో సహా పరమేశ్వర్ వాన్ కి బంధించాడు! తను ప్రయత్నించినా పారిపోలేడు!

“బాస్!....” రాజా, ఆశ్చర్యంతో అరుద్దాగా అన్నాడు.

పరమేశ్వర్ నవ్వాడు. “నో అఫెన్స్ రాజా! అపార్థం చేసుకోకద్దు. పైకి వెళ్ళి పని ముగించి నేను తిరిగివచ్చేలోగా నువ్వు దురాశతో డబ్బుతో మాయం అయిపోవచ్చు! అది నా కిష్టంలేదు....”

“బాస్!” రాజా కంఠం వణికింది.

“సారీ రాజా! వెళ్ళి తిరిగివచ్చేదాకా నువ్వు

వుంటావో, వుడాయించి వుంటావో అని తన్నుకుచావడం, నిన్ను శంకిస్తూ ఆలోచించడం నాకు ఇష్టంలేదు! అందుకే నిన్నూ, డబ్బునీ ఇలా బంధించాను....నువ్వు పైకి వెళ్ళి, పని చేసుకువస్తానంటే నేను నీలాగే బంధించబడడానికి సిద్ధంగా వున్నాను! నీ చేతుల్తో నా చేతులకి బేడీలు వేయొచ్చు! తీసివేయమంటావా?" పరమేశ్వర్ నవ్వుతూ అడిగాడు.

రాజు తేలిగ్గా నవ్వాడు "బాస్....నిజంగా భయపడిపోయాను. మీలా ముక్కుకి సూటిగా, నిజాయితీగా నేను ఆలోచించలేను! వెళ్ళిరండి!"

పరమేశ్వర్ నవ్వుతూ వెనుతిరిగి కాలిబాటమ్మట పొదల మధ్య జోరుగా అడుగులు వేయసాగేడు.

## 24

డబ్బు తీసుకోడానికి వెళ్ళిన ముఠా నాయకుడూ, అతని కుడిభుజం ఎప్పుడొస్తారో తనకి తెలీదు. కమల్ వ్యక్తంచేసిన తొందరగా, అతని ప్రవర్తనా వాళ్ళు త్వరలో రావచ్చని తెలియజేస్తున్నాయి.

తను ఇంకా యిద్దర్ని ఎదుర్కోవాల్సి వుంది. భద్రం ఇంకా ఎంతసేపు మైకంలో వుంటాడు? అతను లేచివస్తే తను ముగ్గుర్ని ఎదిరించాలి. తన కా శక్తి వుందా? శిరీష ఆలోచిస్తూ కూచుంది.

ఏం చేయాలో ఆలోచిస్తూ ఆమె గుహ మధ్యలో రాయిలా కాసేపు నిలబడిపోయింది. తన చేతిలో వున్న ఆయుధం ఒక్కటే మత్తుమందూ, సిరెంజీ!

గబగబా కపిల్ మెడికల్ కిట్‌ని సమీపించి, తెరిచింది. క్లోరోఫామ్, కాటన్, రెండు కత్తులూ, ఫోర్సెప్స్, సిజర్స్ వున్నాయందులో. కిట్‌నీ, అయుగుమీద

పెట్టిన సిరెంజినీ బాటిల్ని చేత్తో గట్టిగా పట్టుకుంది. పెట్రోమాక్స్‌లైటు దగ్గరగా నడిచి, గాస్ని కొద్దిగా రిలీజ్ చేసింది. వెనుతిరిగి, గబ గబా గుహాద్వారాన్ని సమీపించింది.

పెట్రోమాక్స్‌లైటు బాగా డిమ్ అయ్యింది. మసక చీకటి చుట్టూ వ్యాపించింది,

కర్టెన్ని తొలగించి ఆమె ఇవతలికి అడుగు వేసింది. చలిగాలి వీస్తోంది. చీకట్లో, రాళ్ళూ, పొదల ఆకారాలూ చెట్లూ ఆమెకి ఇప్పుడు కనిపిస్తున్నాయి. తన కళ్ళు చీకటికి అలవాటు పడ్డాయి. ఎత్తుగా వున్న ప్రదేశంలో తను వున్నట్టు ఆమె గ్రహించింది. కొండగుహ.... ద్వారం పక్కనే వున్న రాతిమీద శిలప కూచుంది. జాగ్రత్తగా గమనించి వాళ్ళు ఎటువేపు నుంచి వస్తారో తను కనిపెట్టాలి. తరువాత ఆ దారమ్మట జారుకోవాలి.

ఆమెకి భర్త గుర్తుకి వస్తున్నాడు. తను అందించిన రహస్య సంకేతాన్ని అతను అర్థం చేసుకున్నాడా? ఎన్నో చిత్రాలకి ఎన్నో సంభాషణలు రాసిన కౌండిన్య యువరాణి చిత్రంలోని డైలాగ్‌ని మరచిపోయాడా? ఒకవేళ అర్థం చేసుకుని వుంటే తనని రక్షించడానికి అతను యే విధంగా ప్రయత్నిస్తాడు?

ఎవరు ప్రయత్నించినా ప్రయత్నించకపోయినా తను ప్రయత్నించి తీరాలి....

## 25

ఇరుకుగా వున్న కోటలో వాన్ ఆగింది. కాసేపాగి, డోర్ తెరుచుకుని అతను కిందికి దిగాడు. కౌండిన్యని దిగమన్నాడు. కౌండిన్య ఆదరాబాదరా దిగాడు. "వచ్చేశామా?" అతను ఆత్రుతగా ప్రశ్నించాడు.

"తెలీదు. ముందు వాన్ వెళ్తున్న శబ్దం రావడంలేదు. అంటే వాన్ ఎక్కడో ఆగింది. అంటే మనం వాళ్ళని సమీపిస్తున్నాం. మన వాన్ శబ్దాన్ని వాళ్ళు వినొచ్చు. అంచేత ఇక్కణ్నుంచి కాళ్ళు ఉపయోగించుదాం" పృథ్వీరావ్ తగ్గు స్వరంలో చెప్పాడు. దారిపొడుగునా అయిదారుసార్లు ఇన్‌స్పెక్టర్ వాన్‌ని ఆపి, ఇంజన్ని ఎందుకు ఆఫ్ చేస్తూ వచ్చాడో కౌండిన్యకి అర్థమైంది. ఇన్‌స్పెక్టర్ సన్నగా విజిల్ వేశాడు.

వాన్ తలుపు తెరుచుకుంది. ఆరుమంది పోలీసులు నిశ్శబ్దంగా కిందికి దూకారు. కౌండిన్య వాళ్ళని ఆశ్చర్యంగా చూశాడు. చీకట్లో ఇన్‌స్పెక్టర్ వైపు తిరిగి ఏదో అడగబోయాడు.

"వాళ్ళు సీట్ల వెనుక నక్కి దాక్కున్నారు...." ఇన్‌స్పెక్టర్ చిన్నగా నవ్వుతూ "లెటస్ గో!" అంటూ కదిలాడు.

అందరూ చీకట్లో నీడల్లా అతన్ని వెంబడించారు. కాసేపట్లో వాళ్ళు రాజాని చుట్టుముట్టారు.

ఏదో చప్పుడు....రాజా కళ్ళు తెరిచాడు. పరమేశ్వర్ ఇంకా రాలేదు. ఏ జంతువో, పక్షో పొదల్లో దూరి వుంటుంది. రాజా మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు.

ఏదో వెలుతురు తన మొహాన్ని కమ్మినట్టనిపించి అతను తటాలున కళ్ళు తెరిచాడు. నేరుగా, సూటిగా తన కళ్ళల్లోకి వెలుతుర్ని చిమ్ముతోన్న టార్చిని గాబరాగా చూశాడు. అతని పెదవులు కదిలాయి. కాంతిని భరించలేక కళ్ళు మూతలుపడ్డాయి.

మరుక్షణం అతని మెడకి చల్లగా యేదో తాకింది. వెలుతురు మాయమైంది.

"కదలకు! అరవకు!" అందో కంఠం తగ్గుస్వరంలో. ఆ కంఠం బాస్‌ది కాదు. రాజు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. ఎదురుగా వాన్ కిటికీలోంచి రెండు మూడు ఆకారాలు కనిపించాయతనికి.
"ఎవరు? బాస్ ...." అన్నాడతను మెల్లిగా అనుమానంగా.
"పోలీస్. నీ బాస్ యెక్కడ?" తగ్గుస్వరంలో ఆ కంఠం గంభీరంగా ధ్వనించింది.
రాజు నమ్మలేకుండా వున్నాడు. కలా నిజమా?
"డోంట్ మూవ్!" ఆ కంఠం కోడె త్రాచులా బుస కొట్టింది.
ఎవరో వాన్ తలుపు తీశారు. ఎవరో లోపలికి ఎక్కుతున్నారు. రాజు కళ్ళ కొసల్లోంచి చూశాడు. అతని గుండె గంగజాతరలో డప్పులా మ్రోగుతోంది. ఎవరో అతని దగ్గరగా వంగారు. టార్చి తుపాకాలం వెలిగింది. వెలుతురు రాజు ఎదురుగా వున్న వ్యక్తిమీద పడింది. యూనిఫామ్‌లో వున్న పోలీస్ ఇన్‌స్పెక్టర్ని రాజు ఆందోళనతో చూశాడు.
"నీ పేరు?" ఇన్‌స్పెక్టర్ కంఠం ప్రశ్నించింది.
"రా.... రాజు...."
"త్వరగా చెప్పు. నీ బాస్ ఎక్కడున్నాడు? అతనితో యెందరున్నారు? శిరీష యెలా వుంది?" ఇన్‌స్పెక్టర్ కంఠంలో కాఠిన్యత లోహంమీద సుత్తి దెబ్బలా ధ్వనించింది.
రాజు తల తిరుగుతోంది. అతను తటపటాయించాడు. ఇన్‌స్పెక్టర్ చేతి వెనుకభాగం వెడల్పాటి అట్లకాడలా అతని మొహంమీద పడింది. ఫట్‌మన్న చప్పుడు వాన్‌లో

ధ్వనించింది. ముక్కుల్లోంచి యేదో ద్రవం కారుతోంది. రక్తం!

"జేబులోంచి బాకు తీస్తున్నా. బాకు ఇవతలికి వచ్చే లోగా అంతా కక్కేయి! లేకపోతే రెండు చెవుల్నీ వాయిదాలమీద కోస్తూపోతాను!" ఇన్స్పెక్టర్ కంఠం కర్కశంగా వాగ్దానం చేసింది.

"నో...." రాజు మూలిగాడు. రక్తం అతని నోట్లోకి జారింది. అతని చెవిమీద చల్లగా తగిలింది.

"చెప్తాను!" రాజు.... టార్చర్ కి అలవాటుపడని రాజు కంగారుగా అరచాడు.

రాజు నాలుకతో పెదాల్ని తడుపుకుని ప్రారంభించాడు.

## 26

ఆలోచనల్లో మునిగిపోయిన శిరీష ఒక్కసారిగా ఉలిక్కిపడింది. ఏదో చప్పుడు. రాళ్ళమీద జోళ్ళు చప్పుడు చేశాయి. ఏవో రెమ్మలు కదిలాయి. శబ్దం వచ్చినవయిపు ఆమె కళ్ళు చించుకుంటూ చూసింది. రెండు రాళ్ళ మధ్య యేదో నీడ కదుల్తోంది! ఎవరో వస్తున్నారు,

శిరీష గభాల్న రాయిమీంచి కిందికి జారింది. బాగా వంగి, కాన్వాస్ కర్టన్ని కొద్దిగా తొలగించి లోపలికి జొరబడింది. ఆమె గుండె వేగంగా కొట్టుకోవడం ప్రారంభించింది.

తెరిచివుంచిన కిట్ లోకి ఆమె చేతిని పోనిచ్చింది. కాటన్ కొద్దిగా తీసి ముక్కుల్లో దోపుకుంది. వణికే చేత్తో కాటన్ మీదికి కొద్దిగా క్లోరోఫామ్ని వొంపింది. మూత బిగించి క్లోరోఫామ్తో తడిపిన కాటన్ని పిడికిలిలో

బిగించింది.

అడుగుల చప్పుడు. ఆమె జాగ్రత్తగా వింటూ చెవులు రిక్కించింది ఒకే వ్యక్తి నడుస్తున్నట్టుంది. ఇద్దరైతే, కవాతు చేసే సిపాయిల్లా ఒకేసారి అద్భుతంగా ఇద్దరూ అడుగులు వేయాలి. అది అసంభవం. ఒక వ్యక్తే! ఇంకొకడు ఎక్కడున్నాడు? వెనక వస్తున్నాడా? ద్వారం ముందు అడుగుల చప్పుడు ఆగింది. శిరీష ఊపిరి బిగబట్టింది.

"భద్రం!" మూరా నాయకుడి కంఠం! మళ్ళీ వొకసారి పరమేశ్వర్ పిలిచాడు.

కర్టెన్ పక్కకి తప్పుకుంటోంది. వెనుకవున్న బండరాతికి బల్లిలా అతుక్కుపోయింది శిరీష. వారగా కర్టెన్ వైపు చూస్తోందామె.

పరమేశ్వర్ తల కర్టెన్ లోంచి గుహ లోపలికి తొంగి చూసింది. "భద్రం!" తగ్గుస్వరంతో పిలిచాడతను.

చక్కగా రిహార్స్ చేసి, అలవాటుపడిన విధంగా, అసంకల్పితంగా శిరీష చెయ్యి పాము పడగలా దూసుకెళ్ళింది. ఇంకా ముందుకి చొచ్చుకువస్తున్న పరమేశ్వర్ మొహంమీద వాలుతూ, అతని ముక్కుని గట్టిగా కప్పేసింది శిరీష అరచెయ్యి.

తనకి యేం జరుగుతోందో తెలుసుకునేలోగా, పరమేశ్వర్ ఊపిరితిత్తుల్లోకి క్లోరోఫామ్ వాసన తియ్యగా ధారాళంగా జొరబడింది ఉక్కిరిబిక్కిరవుతూ అతను తల విదిల్చే ప్రయత్నం చేశాడు. రెప్పపాటులో శిరీష ఎడమచెయ్యి అతని జుట్టుని పట్టేసుకుంది.

కాసేపట్లో గొడ్డలితో నరికిన చెట్టులా పరమేశ్వర్ బార్లా పడిపోయాడు. అతని చేతిలోని పెన్సిల్ టార్చి

చిన్నగా శబ్దం చేసింది.

మెరుపులా కిందకి వొంగి శరీష అతని వేళ్ళ మధ్య చిక్కుకున్న టార్చిని లాక్కుని, స్విచ్చి నొక్కింది. నిస్సహాయంగా పడున్న పరమేశ్వర్ని క్షణకాలం చూచింది. యాంత్రికంగా ఆమె కుడిచెయ్యి సిరెంజని అందుకుంది.

పరమేశ్వర్ ప్రేమగా, గర్వంగా రుద్దుకునే అతని బలసిన మెడలోకి నీడిల్ కసుక్కున దిగింది.

## 27

"అంతా నిజమే చెప్పావా?" ఇన్స్పెక్టర్ గద్దించాడు.

"....నిజంగా....అంతా....నిజమే చెప్పాను....నాకు శిక్ష పడకుండా చూడండి! ప్లీజ్!" రాజు ప్రార్థేయపూర్వకంగా గొణిగాడు.

"ఇన్స్పెక్టర్!" కాండిక్య దీనంగా అరిచాడు. "త్వరగా వెళ్దాం. ఇతను చెప్పేది నిజమే అయితే శరీష మనకి ప్రాణాలో దక్కదు! మైగాడ్!

"రావూ, నువ్విక్కడే వుండు. ఈ ఛాయాలకు ఎవరొచ్చినా రివాల్వర్ గురిపెట్టి, నిర్దాక్షిణ్యంగా ట్రిగ్గర్ నొక్కెయ్!" అర్థగుమా ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ కిందకి దిగాడు. రావు రాజు కూచున్న సీటు వెనుక ఒంగి నుంచున్నాడు.

మరుక్షణం రాజా నోట్లోకి యేదో మెత్తటి బంతిలా దూరింది. అతని కాలర్ కిందున్న రుమాలు లాగబడింది. గుడ్డబంతి నోట్లో కదలకుండా జేబురుమాలు అతని నోటి మీదుగా తల వెనుక గట్టిగా బిగించబడింది.

కిందికి దిగిన ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ చేతిలోని

సైలెన్సర్ అమర్చిన రివాల్వర్ ఉష్‌మంటూ చప్పుడు చేసింది. రాజు చేతిని బంధించిన గొలుసు తెగింది. నూలొ కేసులు కిందికి జారాయి.

విముక్తి పొందిన రాజు చేతుల్ని మరుక్షణంలో లోపలికి లాగి, మరో కానిస్టేబుల్ బేడీలు తగిలించాడు.

"కిందికి దిగు!" కింది నుంచీ ఇన్‌స్పెక్టర్ ఆజ్ఞాపించాడు. వణుకుతున్న రాజుని కానిస్టేబుల్ బలంగా తోశాడు.

"మా సింహాలు దాక్కున్న గుహకి తీసుకెళ్ళు! తప్పు దారిని తీసుకెళ్తే నిన్ను ఈ లోకంలోకి తెచ్చిన తల్లి దండ్రుల్ని తిట్టుకుంటూ చస్తావ్! పదిహేను నిమిషాల్లోగా అక్కడికి చేరాలి. ఆలస్యమైతే నువ్వు మమ్మల్ని అసలు చోటికి తీసుకుపోలేదని నిర్ణయించి, శిక్ష ప్రారంభిస్తా!" ఇన్‌స్పెక్టర్ గర్జించాడు.

రబ్బరు కాళ్ళతో తూలుతూ రాజు నడవసాగేడు. అతని డొక్కలో గుచ్చుకున్న ఇన్స్‌పెక్టర్ చేతిలోని రివాల్వర్, ఎద్దుని తోలే ముల్లుకర్రలా పొడవసాగింది.

# 28

పరమేశ్వర్ మెడలోంచి నీడిల్ లాగి, మెరుపులా కదిలి తిరిప కిట్‌ని అందుకుంది. ఇంజెక్షన్ వయల్‌లోకి నీడిల్ గుచ్చి ద్రవాన్ని నిండుగా లాగింది. మరో వ్యక్తి కోసం, వస్తు వదిలి పైకి లేచే భద్రం కోసం తను తయారుగా వుండాలి!

సిరెంజినీ, కిట్‌నీ, టార్చినీ రాతివారగా పెట్టి ఆమె చెవులు రిక్కించింది. ఏ అడుగులూ చప్పుడు చేయడం లేదు! మరో వ్యక్తి ఎక్కడున్నాడు? ఎప్పుడొస్తాడు?

కిందికి వంగి కాలర్ లేని అతని చొక్కా మెడ భాగాన్ని వేళ్ళమధ్య బిగించి శక్తినంతా ఉపయోగించి గుహ లోపలికి లాగసాగింది.

పరమేశ్వర్ భారీ శరీరం దూలంలా బరువుగా వుంది. శశిపలోని భయం, తననీ, తన గర్భంలోని చిన్నారినీ కాపాడుకోవాలన్న వాంఛా ఆమెలో శక్తిగా మారుతున్నాయి.

పరమేశ్వర్ శరీరం మెల్లి మెల్లిగా జారుతోంది. ఏదో లోహం రాయిమీద రాసుకుంటూ చిన్నగా చప్పుడు చేస్తోంది. కర్టెన్ దగ్గర్నుంచీ రెండో అరలోకి సరఫరా చేసిన పరమేశ్వర్ శరీరాన్ని శశిప చెమటలు కక్కుతూ చూసింది. కొంచెం ఎడంగా దొర్లించి, శబ్దం చేసిన వస్తువు కోసం ఆమె అతని పాంటుజేబులు వెతికింది కుడివైపు జేబులోవున్న రివాల్వర్‌ని ఆమె వేళ్ళు చుట్టేశాయి.

గుడ్డిగా వెలుగుతూన్న పెట్రోమాక్స్ కాంతిలో శశిప తన చేతిలోని రివాల్వర్‌ని కంగారుగా చూసింది. ఆమె గుండె దడదడ లాడింది. భయపెట్టిన ఆయుధం కాసేపట్లో ఆమెకు యేదో ధైర్యాన్నిస్తోంది.

కుప్పగా పడున్న కేన్వాస్‌ని లాగి పరమేశ్వర్ మీద కప్పేసి, క్షణంలో కర్టెన్ పక్కన తన మామూలు జాగాలో నిలబడిందామె.

తన చేతిలో ఆయుధా లున్నాయి; టార్చి లైటుంది. మరో వ్యక్తి, రాజా త్వరగా రావాలని ఆమె లోపల్లోపలే ప్రార్థించింది. తన కడుపులోని ప్రతిరూపంకోసం సమస్త లోకాన్నీ యెదిరించి, కూల్చివేయడానికి ఆమె సిద్ధంగా వుంది.

# 29

కరెన్ ముందు రాజు వణుకుతూ నిలబడ్డాడు.

ఏదో భయం, ఏదో ధైర్యం అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. రివాల్వర్ కొన నిర్దాక్షిణ్యంగా, బలంగా దిగింది. విపరీతమైన నొప్పి అతని వొళ్ళంతా వ్యాపించింది. రాజు కెవ్వుమన్నాడు. అతని కేక నోటికి అడ్డంగా గోడలా వున్న గుడ్డబంతిని తాకి లోపలే అణగారిపోయింది. క్షణంలో అతని నోటికి కట్టిన గుడ్డ వదులయింది.

"మామూలుగా, మీ బాస్‌ని పిలు. 'బాస్' అన్న రెండక్షరాలు తప్ప వేరే యేదేనా నీ నోట్లోంచి వెలుపలికి వస్తే, బుల్లెట్ నీ కిడ్నీలో దూసుకుంటుంది. జాగ్రత్త!" ఇన్‌స్పెక్టర్ కంఠం పాము బుసలా అతని చెవిలో వూదింది.

తన్నుకొస్తున్న దగ్గుని యమప్రయత్నంతో ఆపుకుంటూ రాజు నాలుకతో నోటిలో ప్రతి భాగాన్ని తడుపుకున్నాడు.

"....బా....స్...." అతని బొంగురు కంఠం నూతిలోంచి పలికింది. రెండుక్షణాల తరువాత రివాల్వర్ కొన మరోసారి అతని డొక్కలో బలంగా దిగింది.

"బాస్!...." అసంకల్పితంగా రాజు కంఠం అరిచింది....

అడుగుల చప్పుడు విన్న క్షణం నుంచీ శిరీష బల్లిలా గోడకి అతుక్కునే వుంది. పడగెత్తిన కాలనాగులా ఆమె చెయ్యి క్లోరోఫామ్‌తో తడిపిన కాటన్‌తో సిద్ధంగా వుంది. ఊపిరి బిగబట్టి, కళ్ళు కొసలగుండా కరెన్నే చూస్తోందామె.

రాజు మళ్ళీ తన బాస్‌ని పిలిచాడు. అతని కంఠంలో ఏదో ఆందోళన గంటలా మోగుతూ శిరీషకి వినిపిస్తోంది.

తటాలున కర్టెన్ కిందకి లాగబడింది. రెండు మూడు టార్చిలైట్ల కాంతి కళ్ళు చెదిరేలా గుహని వెలుతుర్లో ముంచేసింది.

"పరమేశ్వర్, నీ ఆట కట్టయింది. మర్యాదగా బైటికి రా! నీ గుహని పోలీసులు చుట్టేశారు! కమాన్!" ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ కంఠం నగారాలా ప్రతిధ్వనించింది.

పోలీసులు! శిరీష హృదయం ఆనందంతో గబగబా కొట్టుకుంది. ఏదో ఉద్రేకంతో బిగ్గరగా అరవాలనిపించిందామెకి.

"పోలీస్! లోపలికి రండి!" అసంకల్పితంగా ఆమె అరిచింది.

"శిరీషా!" కౌండిన్య పిలుపు అరితేరిన గాయకుడి ప్రేమగీతంలా శిరీష చెవుల్లోకి, ఆమె హృదయంలోకి జారబడింది. రెప్పపాటులో రాజును తోసుకొంటూ ఇన్స్పెక్టర్ గుహలోకి జొరబడ్డాడు. వాళ్ళిద్దర్నీ తోసుకొంటూ కౌండిన్య గాలిలా దూసుకొచ్చాడు.

గోడకి అనుకుని నిలబడ్డ శిరీష ఆనందంతో వెక్కుతోంది. ఆమె చేతిలోని కత్తి చప్పుడు చేస్తూ కింద పడింది. బలంగా తనని పట్టుకున్న భర్త ఛాతీమీద బలహీనంగా ఆమె వాలిపోయింది. కన్నీళ్ళు, ఆనందాశ్రువులు ఆమె ముఖాన్నీ, కౌండిన్య షర్టునీ తడిపేస్తున్నాయి. కౌండిన్య కంఠం ఆమె పేరుని జపం చేస్తోంది.

గుహ అంతా బూట్ల చప్పుళ్ళతో నిండింది. "మిజెస్

కౌండిన్యా! అర్ యూ ఆల్ రైట్?"

శిరీష మెల్లిగా తల తిప్పి తనని ప్రశ్నించిన ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్‌ని కృతజ్ఞతతో, కన్నీళ్ళతో చూసింది. తల ఆడించింది.

"వీళ్ళంతా ఎక్కడి కెళ్ళారో మీకు తెలుసా?" ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ మళ్ళీ ప్రశ్నించాడు

ఇప్పుడు పెట్రోమాక్స్ లైటు ప్రకాశవంతంగా వెలుగుతోంది. శిరీష మౌనంగా రెండు కేన్వాస్ గుట్టల వేపు చెయ్యి చూపించింది. "మరొకతను—భద్రం—బైట రాళ్ళమధ్య ఎక్కడో పడున్నాడు...."అందామె వణుకుతోన్న కంఠంతో. తనవైపే ఆశ్చర్యంతో, భయంతో చూస్తున్న రాజా మొహంలోకి చూసిందామె. అతని కళ్ళు కిందికి వాలిపోయాయి.

అచేతనంగా కేన్వాస్ గుట్టకింద పడున్న పరమేశ్వర్‌నీ, కమల్‌నీ అందరూ ఆశ్చర్యంతో చూస్తున్నారు.

"ఇన్స్పెక్టర్, అతను కమల్. నాకు.... నాకు అబార్షన్ చేయడానికి నియమించబడిన డాక్టర్ .... నేను.... అతని కళ్ళు పీకేశాను ..." శిరీష సన్నటి కంఠంతో మెల్లిగా అంది. కౌండిన్య చేతులు మెప్పుగా, ప్రేమగా ఆమె భుజాల్ని నొక్కాయి. ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ ఆమెవైపు చిరునవ్వుతో చూశాడు.

"మిసెస్ కౌండిన్యా! కంగ్రాట్స్. మీ ధైర్యం, మీ తెలివి తేటలూ మిమ్మల్ని రక్షించాయి!"

ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ పర్యవేక్షణలో, అచేతనంగా పడున్న ముగ్గుర్నీ—జాగ్రత్తగా బంధించారు కానిస్టేబుల్స్. ఇన్స్పెక్టర్ కళ్ళు రాజావైపు తిరిగాయి.

బోనులో ఇరుక్కుని బైట భయం కలిగిస్తూ నిలబడ్డ పిల్లిని చూస్తున్న ఎలుకలా ఇన్స్పెక్టర్ వేపు చూశాడు రాము.

ఇన్స్పెక్టర్ శిరీష వైపు తిరిగాడు. "శిరీష గారూ! మిమ్మల్ని యెలా మెచ్చుకోవాలో అర్థం కావడం లేదు. మీ సినిమా డైలాగ్‌తో మీరున్న గుహని ఎంతో తెలివిగా సూచించారు..."

"థాంక్స్ ఇన్స్పెక్టర్!" నవ్వుతూ అంది. "నా మెసేజ్‌ని ఆయన అర్థం చేసుకున్నారో లేదో అని కంగారుపడిపోయాను!"

కౌండిన్య చిన్నగా నవ్వాడు. "నిజం చెప్పాలంటే నీ సందేశం నాకు అర్థం కాలేదు. ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ గారు ఆ రహస్యాన్ని ఛేదించారు! శిరీషా. బ్లాక్ మెయిలర్ నాలో సృష్టించిన భయంతో నేను పోలీసు సహాయం తీసుకోలేదు. అదృష్టవశాత్తూ ఇన్స్పెక్టర్ గారే అంతా తెలుసుకుని రంగంలోకి దిగారు!" అన్నాడతను కృతజ్ఞతాపూర్వకంగా.

శిరీష ఆశ్చర్యం, కృతజ్ఞతా మిళితమైన చూపుల్తో ఇన్స్పెక్టర్ని చూసింది.

ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ చిరునవ్వు నవ్వాడు. "లేవండి. ఈ అరణ్యాలోంచీ, జంతువుల మధ్యనుంచీ మనుష్యుల్లోకి వెళ్దాం! వాళ్లతో కూచుని ఇక్కడ మీరు చేసిన సాహసాన్ని వినిపింతురుగానీ!" అన్నాడు. శిరీష హుషారుగా లేచింది.

—:అయిపోయింది:—

సీరియల్



• బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

నలుగురు ఆటవికులు ఆ వృద్ధుడితో యేదో చెప్పారు. వృద్ధుడితో పాటు అందరి దృష్టి సౌమ్యమీదికి తిరిగింది. అన్ని జతల కళ్ళు తనని శల్యపరీక్ష చేస్తుంటే చాలా అవమానమనిపించిందామెకు.

మళ్ళీ ఆమెలో బతుకుపట్ల విరక్తి తలెత్తింది. ఈ అవమానాలు భరిస్తూ బతికివుండే కంటే ప్రాణాలు తీసేసుకోవటమే ఉత్తమమన్న నిర్ణయానికొచ్చిందామె.

పక్కనున్న ఆటవికుడి చేతిలోని కత్తి లాక్కోబోయింది.... అదే ఆమె చేసిన పొరపాటు! ఆమె తమ మీద దాడి చెయ్యబోతున్నట్టు అపార్థం చేసుకున్న ఆటవికులు కోపంతో కేకలు పెట్టారు. కత్తి ఆమెకు చిక్కలేదు సరికదా, ఆమె చేతులు వెనక్కి విరిచికట్టేశారు.

వృద్ధనాయకుడు ఆమెను సమీపించి, కళ్ళలోకి తీక్ష

ణంగా చూసి కోపంగా యేదో అరిచాడు. సౌమ్య నిస్సహాయతతో, అవమాన భారంతో, ఉక్రోషంతో, తన్నుకొస్తున్న దుఃఖాన్ని గొంతులోనే అణిచిపెట్టి అలాగే నిల్చుండిపోయింది.

వృద్ధనాయకుడి ఆజ్ఞమేరకు సౌమ్యను బరబరా యీడ్చుకుపోయారు ఆటవికులు. గూడెం మధ్యలో ఓ పెద్ద బండరాయి వుంది. సౌమ్యను ఆ బండరాతిమీద నిల్చోబెట్టారు. స్త్రీలు, పురుషులు—ఆటవిక లందరు అక్కడ హాజరయ్యారు.

నాయకుడు వాళ్ళతో యేదో చెప్పాడు. బహుశా ఆమె ఆటవికులమీద తిరగబడబోయిందని, వాళ్ళని సంహరించబోయిందని చెప్తుండవచ్చునని ఊహించింది సౌమ్య. ఆటవికులందరు పెద్దగా కేకలు పెట్టారు చేతులు పైకెత్తి. జయజయ ధ్వానాలు చేస్తున్నట్టుగా ముక్త కంఠంతో అరిచారు. సౌమ్యకిదంతా కలలాగా అనిపిస్తోంది. వాళ్ళు తననేం చేయబోతున్నారు?

ఆటవిక నాయకుడు పొడవాటి పట్టాకత్తి చేత్తో పట్టుకున్నాడు. తనవారివంక చూసి యేదో గట్టిగా అరచి చెప్పాడు. అందరు సమ్మతిగా తలలూపారు. చేతులు పైకెత్తి కేకలు పెట్టారు.

ఆటవిక నాయకుడు కత్తి పైకెత్తాడు సౌమ్య తల నరకటానికి. సౌమ్యకి పరిస్థితి పూర్తిగా అర్థమయ్యింది. తను వాళ్ళకేదో ద్రోహం చేసినట్టుగా భావించారు వాళ్ళు. పంచాయితీ పెట్టి తనని శిక్షించటానికి గూడెం ప్రజల సమ్మతి నడిగాడు నాయకుడు. వాళ్ళు ఏక కంఠంతో తమ అంగీకారాన్ని తెలియజేశారన్నమాట!

సరిగ్గా అదే సమయంలో పదిమంది ఆటవికులు హఠా

వుడిగా అక్కడకు పరుగెత్తుకొచ్చారు. అందులో అయిదు గుర్రాలమీద పెద్ద మూటలున్నాయి.

ఆటవిక నాయకుడు చేస్తున్న పని ఆపి వాళ్ళవంక చూశాడు. ఆటవికులందరు జరుగుతున్న కార్యక్రమాన్ని మరచిపోయి ఆ మూటలమీదికి ఎగబడ్డారు.

ఆటవిక నాయకుడు ఆజ్ఞాపించిన మీదట మూటలు విప్పబడ్డాయి.

అందులో నుంచి బంగారు నగలు, కరెన్సీ నోట్లు కుప్పతెప్పలుగా బయటపడ్డాయి.

ఆటవికులంతా కళ్ళు పెద్దవి చేసుకుని వాటివంకే చూస్తున్నారు. అంత బంగారం, డబ్బు వాళ్ళు పుట్టి బుద్ధెరిగాక చూడలేదని వాళ్ళ ముఖాలే చెపుతున్నాయి!

సౌమ్య కూడా స్పష్టంగా చూసిందా దృశ్యాన్ని.

ఆమె మెదడులో తళుక్కున మెరుపు మెరిసింది.

అవును. ఆ మూటలు బందిపోటు దొంగలవి! వాళ్ళు గుర్రాలమీద యిందాకా వెళ్తూ ఆ మూటల్ని గుర్రాల మూపులమీద వేసుకుని స్వారీ చేస్తూండటం తను స్పష్టంగా చూసింది. అవే మూటలు, అనుమానం లేదు! అవి యీ అడవి మనుషులకెలా దొరికాయి!?

ఆమెకు వెంటనే సమాధానం స్ఫురించింది.

ఈ మొరటు మనుషులు ఆ దొంగల్ని చంపేసి, యీ ధనపు మూటల్ని వశపరచుకొని వచ్చారన్నమాట! ఆ గూడెం మంటల్ని అదుపుచెయ్యటానికి వెళ్ళిన ఆటవికుల్లో నలుగురు తనని యిక్కడకు లాక్కొచ్చారు. ఈ పది మంది ఆ బందిపోట్లకోసమై వుంటారు. వాళ్ళని చంపటం మాటలు కాదు. అయినా చంపి ధనం చేజిక్కించుకున్నారంటే వీళ్ళు సామాన్యులు కాదు!

సౌమ్య ఆలోచనలు పరిపరి విధాల పోతున్నాయి.

ఓ పక్క ఆటవికులు ఆనందంతో కేకలు వేస్తూ పిచ్చిగా నృత్యం చేస్తున్నారు.

ఆడవాళ్ళు నగల్ని తమ మెడలోను చేతులకు అలంక రించుకుంటూ, ఘెళ్ళు ఘెళ్ళున నవ్వుతూ కేరింతలు కొడుతూ వికటాట్టహాసం చేస్తున్నారు. అక్కడంతా ఓ పెద్ద సంతలా, అంతకుమించి ఓ జాతరలా వుంది!

సరిగ్గా అప్పుడే ఓ అద్భుతం జరిగిపోయింది!

ఎక్కడ్నుంచో ఏడుగురు రౌతులు గుర్రాలమీద వేగంగా వచ్చారక్కడికి. వాళ్ళందరి చేతుల్లోను తుపాకు లున్నాయి. వాళ్ళ నడుములకు బుల్లెట్ బెల్టు లున్నాయి. బలంగా, దృఢంగా, క్రూరంగా, రక్తం తాగే పిశాచా ల్లాగా వున్నారు.

వాళ్ళను చూడగానే సౌమ్యకు జ్ఞాపకాల తరంగాలు మెదడులో ప్రకంపనలు కలగజేశాయి. ఎక్కడో చూసింది తను వాళ్ళని. ఎక్కడ, ఎప్పుడు? ఆమెకు వెంటనే గుర్తొచ్చింది.

అవును—వాళ్ళు బందిపోటు దొంగలు!

ఇందాకా అయిదుగురు దొంగలు గుర్రాలమీద పోతుండగా చూసింది. వేషభాషల్లోను. ఆకారాల్లోను పూర్తిగా వాళ్ళనే పోలివున్నారు. ఓ బుర్రమీసాల వాడిని స్ఫోటకం మచ్చల వాడిని తను గుర్తుపెట్టుకొన్నది గతంలో. బుర్రమీసాల వాడు అయిదుగురు దొంగల్లో వుండగా తను గుర్తించింది. స్ఫోటకం మచ్చలవాడు యీ ఏడుగురిలోను ఒకడు! అవును కాగడాల వెల్తుర్లో వాడి ముఖం కనిపిస్తోంది.

పన్నెండుమంది గల బందిపోటు ముఠాకు చెందిన,

తక్కిన ఏడుగురు వీళ్ళు!

సౌమ్య శరీరం రోమాంచితమయ్యింది. తనకే గనుక అవకాశం, శక్తి వుంటే ఆ అయిదుగుర్ని నరికెయ్యాలనిపించింది యిందాక. ఆ పని ఆటవికులే పూర్తి చేశారు.

ఇప్పుడు యీ ఏడుగురు యిక్కడ యిలా ప్రత్యక్షమౌతారని తను కలలో కూడా ఊహించలేదు. ఈ ఆటవికుల చేతుల్లో వీళ్ళు కూడా ఛస్తారు! తనని, నవీన్‌ని యీ అడవులపాలు చేసిన బందిపోట్లు తన కళ్ళముందే చస్తున్నారు.

సౌమ్య మనసు ప్రతీకార వాంఛతో రగిలిపోతోంది. కాగల కార్యం గంధర్వులే తీర్చినట్లు శత్రుసంహారం జరిగిపోతున్నా, అది తన చేతులమీద జరగనందుకు, తన ప్రతీకార వాంఛ తీరకుండా పోతున్నందుకు మనసులో అసంతృప్తిగా వుంది.

బందిపోట్లు గాల్లో తుపాకులు పేల్చారు.

ఆటవికుల భాషలో యేదో గట్టిగా అరిచారు.

ఆటవికనాయకుడు ముందుకొచ్చి యేదో సమాధానం చెప్పాడు.

స్ఫోటకం మచ్చలవాడు కోపంగా అరిచాడు.

ఆటవిక స్త్రీలు అలంకరించుకున్న నగలకింద పడివున్న మూటలవంక చూపించి మళ్ళీ యేదో అరిచాడు.

ఆటవికనాయకుడు తల అడ్డంగా తిప్పి తమకేమీ తెలియదన్న అర్థం వచ్చేలా యేదో చెప్పాడు.

బందిపోట్లు మహోగ్రంగా అరిచారు.

వాళ్ళ హావభావాల్ని బట్టి సౌమ్య, ఆ అయిదు

మాటలు ఆటవికులు బందిపోట్లను చంపి తీసుకురాలేదని ఆటవిక నాయకుడు, బందిపోట్లకి నచ్చచెప్తున్నాడని, తమవాళ్ళని చంపకపోతే ఆ మూటలు మీకెలా వచ్చాయని స్ఫోటకం మచ్చలవాడు గద్దించి అడుగుతున్నాడని దానికి ఆటవిక నాయకుడు యేదో చెప్పి సమర్థించుకుంటున్నాడని, బందిపోట్లు నమ్మలేదని, అందుకే మహోగ్రంగా అరుస్తున్నారని—అర్థం చేసుకుంది. వచ్చిన బందిపోటు దొంగల్ని వాళ్ళే మోసివుంటారని కూడా గ్రహించిందామె.

ఆమె సూక్ష్మదృష్టితో ఆలోచించింది నిజమేనని మరి కొద్ది క్షణాల్లోనే రూఢి అయింది. కోపంతో పిచ్చివాళ్ళయిపోయారు బందిపోట్లు.

అంతే టప టప మంటూ ఆటవికులకి గురిచూసి కాల్చటం మొదలెట్టారు.

ఆటవికులు యీ దాడి నెదుర్కోవటానికి సిద్ధంగా లేకపోవటంతో వరసగా చాలామంది నేలకూలిపోయారు అయితే భయపడి పారిపోలేదు. కత్తులతో, బరిసెలతో తమ శక్తివంచన లేకుండా పోరాటం సాగించారు.

దాదాపు అరగంటకు పైగా ఆటవికులకు, బందిపోట్లకు మధ్య సంకులసమరం జరిగింది. అయితే, అంతిమ విజయం బందిపోట్లకే లభించింది.

బందిపోట్లు ఇద్దరు మాత్రమే నేలకూలిపోయారు. కాని ఆటవికుల్లో చాలామందిని తమ తుపాకులకు యెర చేశారు. పిట్టల్ని కాల్చినట్టు కాల్చేశారు. ఆటవికులు లొంగిపోయారు.

సౌమ్య అంతవరకూ ప్రేక్షకురాలిలా ఆ దృశ్యం చూస్తూ వుండిపోయింది. ఒకటి రెండుసార్లు తుపాకి గుళ్ళు

ఆ మేఘం అత్యంత సమీపంలో దూసుకుని వెళ్ళాయి. కాని ఆమెకు తగల్లేదు.

ఆమె నిశ్చలంగా అలాగే నించుంది. తన ప్రాణాన్ని తృణప్రాయంగా ఎంచుకున్నది. ఆత్మహత్య చేసుకోవాలనుకున్న తన ప్రాణం యెలా పోయినా ఫరవాలేదనే నిర్లిప్తత. నిరాసక్తత ఆమెలో చోటు చేసుకున్నాయి. అందుకే ఇరువర్గాల మధ్య పోరాటం కొనసాగినంతసేపు తను అంగుళం కూడా పక్కకు జరగలేదు, ఆవంత కూడా భయపడలేదు.

బందిపోట్లు—ఆటవిక నాయకుడి వంక చూసి, ఆడవాళ్ళు ధరించిన వస్తువుల్ని, ధనాన్ని వెంటనే తమకు అప్పగించమని అరిచారు. ఆటవిక నాయకుడు బుల్లెట్ల దెబ్బల నుంచి అప్పటిదాకా తనని తాను రక్షించుకున్నాడు. బంగారునగలు, కరెన్సీని వెంటనే తన అనుచరుల సాయంతో మూటలుకట్టి, అయిదు మూటలు బందిపోట్ల ముందు పెట్టాడు.

స్ఫోటకం మచ్చలవాడితోబాటు చావగా మిగిలిన తక్కిన నలుగురు బందిపోట్లు విరగబడి నవ్వారు. సరిగ్గా అప్పుడే స్ఫోటకంమచ్చల బందిపోటు దృష్టి సౌమ్యమీద పడింది.

నిజానికి సౌమ్య ముఖం గతంలో బందిపోట్లు ఎవరూ చూడలేదు. వెనుకనుంచి తరమటమే గాని, వారికి సౌమ్య గాని, నవీన్ గాని ముఖాముఖి ఎదురుకాలేదు. కాని నవీన్ సౌమ్య మాత్రం చెట్టుమీద దాక్కొని వున్నప్పుడు పన్నెండుమంది బందిపోట్లను చాలా దగ్గర నుంచి స్పష్టంగా చూశారు.

స్ఫోటకంమచ్చలవాడు గుర్రాన్ని సౌమ్యకి అతి సమీ

పంగా తీసుకొనివచ్చి, ఆమె ముఖంలోకి గుచ్చి గుచ్చి చూశాడు. తక్కిన బందిపోట్లు కూడా అతన్ని వెంబడించి సౌమ్యను పరీక్షగా చూశారు.

ఆ తోడేలు చూపుల కర్థం తెలియని అమాయకురాలు కాదు సౌమ్య. తిరస్కారం ప్రదర్శించే చూపుల్తో వాళ్ళ వంక చూసి చీదరించుకుంది.

"వారెవా, లడ్కీ బహుత్ సుందర్ హై! హంకో బహుత్ పసంద్ హై!" అన్నాడు స్ఫోటకం మచ్చల వాడు.

తక్కిన నలుగురు పెద్దగా నవ్వారు.

మరుక్షణం సౌమ్య స్ఫోటకం మచ్చలవాడి గుర్రంపైన వుంది. ఆమె బంధనాలు విప్పేసి ఆమెను గుర్రమెక్కించారు ఆటవికులు.

అయిదు మాటలు అయిదు గుర్రాల చూపులమీదక అంతక్రితమే చేరుకొన్నాయి.

స్ఫోటకం మచ్చల బందిపోటు, ఆటవికనాయకుడ్ని గట్టిగా హెచ్చరించి, వాళ్ళను క్షమించి వదిలేశాడు. తన వాళ్ళకు చూసి సైగచేసి గుర్రం డొక్కలో కాలితో గట్టిగా తన్నాడు. మరుక్షణం విపరీతమైన వేగంతో గుర్రం వచ్చిన తోవనే వెనక్కు పరుగెత్తింది. గుర్రం వెనుక అనుచర బందిపోట్లు తమ గుర్రాలని పరుగుతీయించారు.

సౌమ్య షాకినించి తేరుకోలేదు. వాళ్ళు తనని, చెర బడతారని ఆమె కల్లో కూడా అనుకోలేదు. కాని, అనుకోనిది జరగటమే మొదట్నుంచీ తనపట్ల జరుగుతోంది. ఆమె మనసు బాధతో మూలిగింది. ఇప్పుడు ఒంటరిగా, నిస్సహాయంగా వున్న స్థితిలో కూడా ఆమె మనసులో

గాఢంగా వున్న కోరిక ఒకటే — 'వీళ్ళను నరికి పారెయ్యాలి!' తనా పని చెయ్యగలదా? వీళ్ళ చేతుల్లో అమానుషంగా చెరచబడి నాశనమయ్యేకంటే వీళ్ళ నెదిరించి, వీలయితే నాశనం చేయటం, లేదా ఆత్మాహుతి చేసుకోవటం—యేదో ఒకటి జరగాలి!

సౌమ్య మనసులో అగ్నిపర్వతాలు బద్దలవుతున్నాయి. వీళ్ళు తనని ఉద్దేశంతో ఎత్తుకుపోతున్నారో ఆమె కరథమయిపోయింది. ఈ దుష్టులవల్ల తను యింతదాకా అనుభవించిన కష్టాలకు యింతటితో ఫుల్‌స్టాప్ పెట్టాలి! ఎలా? ఎలా??

సౌమ్య తీవ్రంగా ఆలోచిస్తోంది!

* * *

విషకన్య చటుక్కున ఆగిపోయింది.

"ఉగ్రనాగూ! బాటమీది నుంచి పక్కకి తొలగిపోండి!" అని హెచ్చరించింది.

ఉగ్రనాగు, అనుచర సర్పాలు క్షణాల్లో ఆమె ఆజ్ఞను పాటించాయి.

విషకన్య నవీన్‌తో బాటు ఓ పెద్ద జువ్విచెట్టు మొదలుపక్కకు వెళ్ళి దాక్కొని, బాటపై పే దృష్టి సారించింది.

అయిదు గుర్రాలను అధిరోహించిన ఆరుగురు వ్యక్తులు కనిపించారు. అందులో ఓ మనిషి స్త్రీమూర్తి కావటం వారిద్దరి దృష్టిని ఆకర్షించింది.

ఆ స్త్రీని చూస్తూనే గట్టిగా అరిచాడు నవీన్. "ఆమె సౌమ్య!" అంటూ.

అతని అరుపు ఎంత గట్టిగా ప్రతిధ్వనించిందంటే గుర్రాలమీద మహావేగంగా దూసుకుపోతున్న బందిపోటు

దొంగల కూడా స్పష్టంగా వినిపించింది! అంతే, గుర్రాలు టక్కున నిలబడిపోయాయి!

సౌమ్య నవీన్ గొంతు గుర్తించింది. ఆమె మనసు మహానందంతో నిండిపోయింది. పురివిప్పిన నెమలిలా నాట్యం చేసింది. నవీన్....తన నవీన్ సజీవంగా వున్నాడు. ఎలాంటి ప్రమాదాలకు లోనుకాకుండా సురక్షితంగా వున్నాడు. భగవాన్ నువ్వెంత కరుణామయుడివి!

ముందుగా పరిస్థితిని అదుపులోకి తెచ్చుకుంది విషకన్య! వాళ్ళు అయిదుగురు తాము పట్టుబెట్టిన అయిదుగురు బందిపోట్ల ముఠాకి చెందినవాళ్ళేనని చాలా తేలిగ్గా గ్రహించింది. నవీన్ దగ్గర, తన దగ్గర తుపాకులు, తూటాలు సిద్ధంగా వున్నాయి. కాని ఈసారి స్ట్రయిన్ తీసుకోదలచుకోలేదు.

బందిపోటు దొంగలు గుర్రాలమీది నుంచి దిగకుండానే పరిసరాల్ని అతి జాగ్రత్తగా పరికించి చూశారు.

ఉదయం అయిదున్నర గంటలయ్యింది. అడవిలో మరో గంట పోతేనేగాని వెలుగు పరుచుకోదు. బయటి ప్రపంచం పూర్తిగా నిద్రాదేవి ఒడినుంచి ఆపాటికి లేచివుంటుంది!

విషకన్య "ఉగ్ర నాగూ!" అంది. అంతే!

బందిపోటు దొంగలు ఆ శబ్దం వినిపించినవైపుగా తుపాకీలతో కాల్చారు. విషకన్య రెండుసార్లు తనూ కాల్చింది! నవీన్ రెండుసార్లు కాల్చాడు.

ఇద్దరు బందిపోట్లు స్వల్పగాయాలతో నేలమీద కొరిగారు.

అంతే! చుట్టూ ముసురుకున్న సర్పాలు వాళ్ళ శరీరాల్ని విషంతో నింపేశాయి. తక్కిన ముగ్గురు బందిపోటు దొంగలు తప్పించుకు పారిపోవాలని చూశారు.

కాని, ఉగ్రనాగు యెగిరి వాళ్ళని కాటందుకుంది! ముగ్గురు ఒకరొకరుగా నేలమీది కొరిగారు.

ఈలోపల నవీన్ గుర్రంమీద నుంచి సౌమ్యను సురక్షితంగా కిందికి దింపాడు. మరొక్క క్షణం అలస్యమైతే ఆమె కూచునివున్న గుర్రం తప్పించుకొని పారిపోయుండేది. నవీన్ సౌమ్యని దించిన మరుక్షణం గాలి కన్నా వేగంగా దూసుకొనిపోయింది.

ఉగ్రనాగు కాట్లకు బలైన బందిపోటు దొంగలు చివరిశ్వాస విడవబోతూ, తమని అవలీలగా మట్టుబెట్టిన వ్యక్తులెవరోననుకొంటూ ఆసక్తితో అటు యిటు చూపులు సారించారు.

నవీన్ వాళ్ళ కంటపడ్డాడు.

నవీన్ హిందీలో చెప్పాడు: "కొన్ని రోజుల క్రితం ఢిల్లీ పోయే దక్షిణ ఎక్స్‌ప్రెస్‌ని దోపిడి చేసినపుడు, మీ దౌష్ట్యానికి దుర్మార్గానికి బలికాకుండా తప్పించుకోవటానికి అడవులపాలైపోయింది మేమే! మా యిద్దర్ని వెంటాడి వేటాడి కనుక్కోలేకపోయారు మీరింతా!.... యిప్పుడిక ఆనందంగా యీ లోకం వదిలెయ్యండి!"

సౌమ్య అందరు చూస్తూండగానే సుడిగాలిలా నవీన్‌ని అల్లుకొనిపోయి అతని గుండెలమీద తలవాల్చి భోరున యేడ్చేసింది.

బందిపోటు దొంగలు ఆ దృశ్యం చూస్తూ గిల గిల కొట్టుకుని, నోటి నుంచి నురగలు కక్కుతూ ప్రాణాలొదిలేశారు.

నవీన్ సౌమ్య వెన్ను మృదువుగా, ఆప్యాయంగా, ప్రేమగా, ఆర్తిగా నిమిరాడు. ఆమెను ఆ విధంగా ప్రాణాలతో చూడగలుగుతాడని అతడనుకోలేదు. సౌమ్యకైతే పెన్నిధి దొరికినట్టు, జీవితంలో తను మళ్ళీ పొందలేని అపురూప వస్తువు తనకే వెతుక్కుని వచ్చి కైవశమైనట్టు అనిపించి బ్రహ్మానందభరితురాలయ్యింది. ఆనందంలో ఎన్నిసార్లు నవీన్‌ని ముద్దులతో ముంచెత్తిందో ఆమెకే తెలీదు.

"నవీ....నవీ ...నువ్వేనా? నేను చూస్తున్నది వాస్తవమే కదూ....కల కాదని చెప్పు నవీ..." అంటూ పలవరిస్తున్నదానిలా అతన్ని అల్లుకుపోయి మాట్లాడేస్తోంది వేగంగా.

నవీన్ ఆమె మాటలకి లోలోన నవ్వుకుంటూ ఆమెని పొదివిపట్టుకొని, "కల కాదు, నిజమే! నువ్వు అప్‌సెట్ కావొద్దు టెన్షన్ నుంచి రిలీజ్ కా. యిక మనకి శత్రు భయం లేదు" అంటూ ధైర్యం చెప్పాడు.

విషకన్య అపురూపమైన ఆ జంటవైపు, వారి పునస్సమాగమంలోని తీవ్రతను చూసి నవ్వుకుంటూ నిల్చుంది.

నవీన్ ఆమె సంగతి గుర్తుకురాగానే, చటుక్కున యీ లోకంలోకి వచ్చినవాడులాగా సౌమ్యను వదిలి, విషకన్యవైపు చూశాడు — కొద్దిపాటి సిగ్గుతోను, అపాలజెటిక్ గాను.

విషకన్య వారిద్దర్నీ మార్చి మార్చి చూస్తూ నవ్వుతోంది.

నవీన్ సౌమ్యకు ఆమెను పరిచయం చేసి, "మన ప్రాణదాత. వివరాలు తర్వాత తీరిగ్గా చెపుతాను"

అన్నాడు.

సౌమ్య రెండు చేతులు యెత్తి విషకన్యకు నమస్కరించింది. విషకన్య ఆమె చేతుల్ని ఆప్యాయంగా తన చేతిలోకి తీసుకొని, "మన మధ్య కృతజ్ఞతలు, ఋణాలు వుండకూడదు....పదండి, నా నివాసానికి వెళ్ళి అన్ని సంగతులు మాట్లాడుకొందాం. తెల్లవారిపోతే ఆటవికులు విచ్చలవిడిగా తిరుగుతారు. ఎవరి కంటా పడడం మంచిదికాదు" అంది.

నవీన్ నగలు, డబ్బువున్న సంచీలవంక చూపిస్తూ, "ఇలాంటివే యిదివరకు ఆ అయిదుగురు బందిపోట్ల దగ్గర చూశాం. వీళ్ళ దగ్గర కూడా...." అని చెప్తూంటే సౌమ్య ఉద్రేకించి, "అవే యీ మూటలు. ఆటవికులు ఆ బందిపోటు దొంగల్ని చంపేసి తెచ్చేశారు. మళ్ళీ వీళ్ళు స్వాధీనం చేసుకున్నారు" అంది.

నవీన్ నవ్వేసి, "ఆ బందిపోటు దొంగల్ని ఆటవికులు కాదు చంపింది—యీమె!" అన్నాడు.

విషకన్య సాలోచనగా చూస్తూ, "మనం వాళ్ళని నేలకూల్చి గన్ను మాత్రం తీసుకుని వచ్చేశాం కదా.... ఆ తర్వాత ఆటవికులు ఆ దారిన వస్తూ ధనం మూటల్ని చూసివుంటారు. ఆనందంగా తమ గూడెం తీసుకుపోయారన్నమాట!...." అంది.

నవీన్‌కి అనుమానం వచ్చింది. "మనం వాళ్ళకన్నా ముందే బయల్దేరి వస్తున్నాం కదా! ఈ లోపల మనకన్నా ముందే వాళ్ళు యెలా మోసుకొని గూడెం చేరుకోగలిగారు?" అనడిగాడు.

విషకన్య మందహాసం చేసి, "మనం సౌమ్య కోసం వెతుక్కుంటున్నంతసేపట్లో వాళ్ళు ధనం మూటలతో

మరో దారిన గూడెం చేరివుంటారు. ఆటవికులకు అడవంతా కొట్టిన పిండే! మనకంటె ఎక్కువ దార్లు వాళ్ళకు తెలుసు" అంది.

నవీన్ అనుమానం నివృత్తి అయింది.

"యీ మాటల్ని యిలా వదిలెయ్యటం మంచిది కాదేమో! మరికొందరు అమాయకులైన నిర్భాగ్యుల ప్రాణాలు తీస్తుందీ డబ్బు" అన్నాడు నవీన్.

అప్పటికప్పుడు పెద్ద గొయ్యి తీసి ఆ సంచులలో బంగారాన్ని, కరెన్సీని పూడ్చిపెట్టేశారు. నవీన్ కొన్ని కరెన్సీ నోట్లను తన దుస్తుల్లో భద్రపరుస్తూ, "ముందు ముందు వీటితో చాలా పనుంది" అన్నాడు..

* * *

ముగ్గురు తిరుగు ప్రయాణం చేస్తూ మైదాన ప్రాంతంలోకి వచ్చారు. ఉగ్రనాగు అనుచర సర్పాలు వారితో పాటు ముందుకి కదులుతున్నాయి.

విషకన్య మైదాన ప్రాంతంలో అడుగు పెడ్తూనే ఆగి యేదో వాసన చూస్తున్నట్టు ఊపిరి పీల్చి, "దగ్గర్లో ఏదో క్రూరజంతువు పొంచి వుంది. నవీన్, గన్ పొజిషన్‌లో వుంచుకో! బి ఎలర్ట్!" అంది.

నవీన్ గన్ ఘర్మగా పట్టుకొన్నాడు. బందిపోటు దొంగల్ని కాల్చాక మళ్ళీ యిద్దరు గన్స్ లోడ్ చేసుకున్నారు. రెండోసారి గన్స్ ప్రయోగించ నవసరం లేకుండానే ఉగ్రనాగు, అనుచర సర్పాలు బందిపోటు దొంగల అంతు చూశాయి. ఇప్పుడు గన్స్‌తో మళ్ళీ పని పడింది.

విషకన్య ఊహ నిజమయింది. ఒక్కసారిగా ఎక్కడి నుంచో ఆ క్రూరమృగం వాళ్ళమీదికి దాడి చేసింది.

సౌమ్య దాన్ని చూస్తూనే గుర్తుపట్టింది. తాను ప్రాణరక్షణార్థం కొద్ది నిమిషాలు గడిపిన గుహలోని క్రూర మృగం! తేళ్ళను వేటాడుతుండగా తను తప్పించుకుని పారిపోయింది.

నవీన్, విషకన్య మొదటిసారిగా దాన్ని చూశారు.

అది సింహంలా జూలు కలిగివుంది గాని, సింహం కాదు. ఒంటిమీద పెద్దపులికి మల్లే చారలున్నాయి గాని, పెద్దపులి కాదు. నోటినుంచి పొడవాటి రెండు కోరలు బయటికి తన్నుకొచ్చాయి. అవి చాలా భయంకరంగా వున్నాయి. దాని తోక చాలా పొట్టిగా కేవలం అంగుళాల పొడవు మాత్రమే వుంది! విపరీతమైన గబ్బు వాసన ముక్కుపుటాలను అదరగొడుతోంది.

"నవీన్, షూట్!" అంది విషకన్య.

అది తమమీది దూకిన ఉత్తరక్షణంలోనే నవీన్, విషకన్య గుళ్ళవర్షం కురిపించారా జంతువుమీద.

అంతకాలం తన కెదురులేకుండా జీవించిన ఆ క్రూర మృగం ఎగిరి అల్లంతదూరంలో పడింది. ప్రాణంపోలేదు— కేవలం గాయపడింది. రెట్టించిన కోపంతో దెబ్బతిన్న ఉక్రోషంతో అది వాళ్ళపై విజృంభించబోయింది.

కాని యీ లోపల ఉగ్రనాగు తన వంతు కార్యక్రమం ముగించింది. ఆ జంతువును చుట్టచుట్టుకొని, అంగుళం కూడా ముందుకు గాని పక్కకు గాని కదలనివ్వకుండా బంధించేసి అందినచోటల్లా తన వాడి కోరలతో కాటు వేసింది.

అంతే! ఆ మృగం మళ్ళీ లేవలేదు.

"శహభాష్ ఉగ్రనాగూ!" అంది విషకన్య మెచ్చుకొంటూ.

ఈ లోపల నవీన్, విషకన్య గన్స్ మళ్ళీ లోడ్ చేసుకున్నారు.

అప్పటికి పూర్తిగా తెల్లవారిపోంది. మైదానప్రదేశంలో వెలుగు బాగా కనిపించింది. అక్కడ చెట్లు, గుట్టలు అడ్డులేక పోవటంతో సూర్యకాంతి కూడా పడటానికి అవకాశముంది.

విషకన్య—నవీన్, సౌమ్యలని చూసి, "మనం తగల బడిపోయిన గూడెం మీది నుంచే ప్రయాణం చెయ్యాల్సి వుంది. అది దాటిపోతే మా నాగులకొండ చేరిపోతాం. మన భవిష్యత్ కార్యక్రమాన్ని అక్కడే రూపొందించుకోవాలి!" అంది.

నవీన్ తలూపి, "ఈ పాటికి ఆటవికులు అడవిలో తిరుగుతుంటారనుకుంటాను. వాళ్ళ కంటబడకుండా అంత దూరం ప్రయాణించి వెళ్ళగలమా?" అన్నాడు.

"చూద్దాం. వెళ్ళగలమనే అనుకొంటున్నాను" అంది విషకన్య మందహాసం చేస్తూ.

నవీన్ యేదో గుర్తొచ్చినట్టు, "బందిపోటు దొంగలు పన్నెండుమంది. పదిమంది చచ్చారు; ఇంకా యిద్దరు మిగిలారు...." అన్నాడు.

అతని మాటల్ని మధ్యలోనే తుంచి, "వాళ్ళిద్దరు గూడెంలో ఆటవికుల చేతిలో చచ్చారు...." అంది సౌమ్య.

నవీన్ ముఖం వికసించింది. "అయితే, మన శత్రు సంహారం పూర్తయ్యింది" అని విషకన్యవైపు తిరిగి, "ఇక మీ శత్రువులు అయిదుగురు మిగిలారు.... నాయుడు, అతని డ్రైవరు. అతని ముగ్గురు అనుచరులు ఏమై రైట్?" అన్నాడు.

విషకన్య మంద్రంగా నవ్వి. "గుర్తుంచుకున్నందుకు థాంక్స్! ఆ ముయిదుగుర్ని వీలయినంత తొందరగా పరలోకం పంపించాలి. అంతవరకు మా అమ్మా నాన్నల ఆత్మలకు శాంతిలేదు!" అంది ప్రతీకార వాంఛ నరనరాన్నీ కాల్చేస్తూంటే, పిడికిళ్ళు బిగించి.

"నీ కోరిక అతి త్వరలోనే తీరుతుంది. అందుకు నా శక్తివంచన లేకుండా కృషి చేస్తాను" అన్నాడు నవీన్ ప్రమాణం చేస్తూన్నట్టు.

పక్షులు పెద్దగా రెక్కలు చప్పుడు చేసుకుంటూ, కిలకిలారావాలు చేస్తూన్నాయి. అంతవరకు స్తబ్దంగా వుండిపోయిన అడవిలో యేవేవో వింత ధ్వనులు, సంకీర్ణ శబ్దాలు వినిపిస్తూన్నాయి. ఆటవికుల దైనందిన జీవితం మొదలయింది. వాళ్ళకి కనపడకుండా తాము వాగుల కొండ చేరుకోవటం విషయమై ఆలోచిస్తూన్నాడు నవీన్.

కొద్ది సేపట్లోనే తగలబడ్డ అడవిలోకి ప్రవేశించారు. చెట్లు, పొదలు, తుప్పలు చిన్న కొమ్మలు అన్నీ తగలబడి నల్లటి నుసి వాళ్ళకు దర్శనమిచ్చింది.

• • •

దూరంగా కొత్తగా కట్టుకున్న గుడిసెలు కనిపిస్తూన్నాయి. వాటిని సమీపిస్తూండగా కొందరు ఆటవికులు వారి కెదురుగా రావటం కనిపించింది. తప్పించుకోవటానికి ఎటో దారి కనిపించలేదు. చెట్లు యెక్కాలి, లేదా వాళ్ళతో తలపడి పోరాడాలి! చెట్లన్నీ కాలి నుసి అయిపోయాయి. యెదురుపడి పోరాడక తప్పదు.

విషకన్యతో "ఏం చేద్దాం? వాళ్ళు దగ్గరగా వచ్చేస్తూన్నారు" అన్నాడు నవీన్. వాళ్ళకి సౌమ్య కనిపిస్తే

యెంత రాద్ధాంతం జరగాలో అంతా జరిగిఉంది.

విషకన్య పాలో చనగా చూసింది. వాళ్ళ చేతుల్లో పాడవాటి బరిసెలున్నాయి. ఇద్దరి చేతుల్లో పట్టాకత్తు లున్నాయి. మరో యిద్దరి దగ్గర విల్లమ్ము లున్నాయి.

"వాళ్ళు జంతువుల్ని వేటాడటానికి పోతున్నారు. సాయుధులై వున్నారు. మనం దాక్కోటానికి చెట్టు గాని, పొదగాని యేదీలేదు. వాళ్ళతో పోరాడక తప్పదు...." అంది విషకన్య గన్ పొజిషన్లోకి తెచ్చు కొంటూ.

"దానికన్నా సర్పాలను ప్రయోగించటమే సులభం కదా!" అంది సౌమ్య.

విషకన్య, నవీన్ ఆలోచనల్లో పడ్డారు. ఆమె మాట నిజమేగాని, సర్పాలకి వాళ్ళు హాని చేస్తారు. వాళ్ళని కాటంయకు నేలోపల కొన్నిటినైనా చంపేస్తారు.

"నీ సలహా బాగానే వుందిగాని, వాళ్ళు నిర్దాక్షి ణ్యంగా సర్పజాలాన్ని నాశనం చేస్తారు. అది అభిలష ణీయం కాదు" అన్నాడు నవీన్.

విషకన్య యేదో నిర్ణయానికొచ్చినదానిలా, "మనం గూడెం దాటేలోపల యింకా మరికొంతమంది యెదురు కావచ్చు. అందర్నీ చంపుకుంటూ పోలేం కదా! అందు కని యీ విషయంలో ఉగ్రనాగును ప్రయోగించుదాం" అంది.

"అంటే ఉగ్రనాగు ఒక్కటే వీళ్ళందరితోను తల పడుతుందా?"

"ఎదురుగుండా ఉగ్రనాగు దాడి చేస్తే వెనుక నుండి తక్కిన సర్పాలు దాడి చేస్తాయి. వాటిని ఆటవికులు చంపకుండా మనం జాగ్రత్త తీసుకోవాలి! కొందరు ఆట

విటుల్ని చంపక తప్పదు. వాళ్ళని మనం చంపకపోతే వాళ్ళే మనల్ని చంపుతారు" అంది విషకన్య.

సౌమ్య బిడికిళ్ళు బిగించి, "ఉత్తపుణ్యానికి వాళ్ళు నన్ను బంధించి బాధలకు గురిచేశారు. వాళ్ళమీద జాలి పడకూడదు" అంది.

విషకన్య ఉగ్రనాగును చూసి, "ఉగ్రనాగూ! అదిగో ఆ వస్తున్న ఆటవికుల్ని చూడు. వాళ్ళవల్ల మనకు ప్రమాదం లేకుండా చూడాలి!" అంది.

ఉగ్రనాగు తలూపి, రివ్వున ముందుకు సాగిపోయి ఆటవికుల దారి కడ్డుగా తోకమీద నిల్చుంది.

ఆటవికులు యిప్పుడు స్పష్టంగా కనిపిస్తున్నారు. ఎనిమిదిమంది వున్నారు.

వాళ్ళు—ఎదురుగా ప్రళయ భయంకరంగా చుట్ట చుట్టుకొని పడగమీద నిల్చిన ఉగ్రనాగును చూడగానే టక్కున మంత్రం వేసినట్టు నిల్చుండిపోయారు!

అప్పటికప్పుడే అనుచర సర్పాలు వాళ్ళకి కనిపించకుండా మెల్లగా పాక్కుంటూ ఆటవికుల వెనుకవైపుకి చేరాయి.

ఉగ్రనాగుని చూసిన వెంటనే యిద్దరు ఆటవికులు విల్లు సంధించబోయారు. వాళ్ళు విల్లుయెక్కు పెట్టగానే చప్రున వాళ్ళ వెనుక చేరిన సర్పాలు కాటందుకున్నాయి.

గురితప్పి బాణాలు ఎటో పోసుకుపోయాయి. వాళ్ళు వెనుతిరిగి సర్పాలమీదికి దాడి చేసేలోపల ఉగ్రనాగు పెద్ద ఫీత్కారం చేసింది.

ఉగ్రనాగు నోటినుంచి షాంపెన్‌లా విషం చివ్వున వాళ్ళ ముఖాలమీదకి చిమ్మింది. అంతే వాళ్ళు విల్లమ్ములు కింద పారేసి ముఖాలు చేతుల్తో కప్పుకొని నేలమీద

కూలిపోయారు.

పట్టాకత్తులు చేత ధరించిన ఆటవికులు ఉగ్రనాగు మీదికి మహోగ్రంగా దాడి చేయబోయారు.

ఉగ్రనాగు మరోసారి ఫీత్కారం చేసింది. విషం వాళ్ళ ముఖాలకు నల్లటి పెయింటు వేసినట్టుగా చిమ్మింది. నేలమీదకి చూడటానికి తలలు తిప్పబోయారు గాని అప్పటికే గుడ్డివాళ్ళయిపోయారు; విషం కళ్ళలోకి ప్రవేశించి.

తక్కిన నలుగురు బరిసెలు విసిరారు ఉగ్రనాగుమీదికి. నేలమీది సర్పాలు వాళ్ళ గురిని తప్పించేశాయి. ఎనిమిది మంది సర్పాదష్టులై నేలమీద కూలిపోయి నురుగులు కక్కుకొంటూ గిల గిలా కొట్టుకొని ప్రాణాలు వదిలేశారు....

ఉగ్రనాగువంక ప్రశంసగా చూసింది విషకన్య.

సౌమ్యకి చాలా ఆనందంగా వుంది. విషకన్య గురించి తెలుసుకోవాలనే ఆసక్తి బాగా వేళ్ళు పాతుకు పోయింది మనసులో. విషసర్పాలని తన ఆధీనంలో వుంచుకొని తన ఆదేశాలను అమలుజరిపేలా కమాండ్ చేస్తున్న విషకన్య నాగకన్యలా, అపురూపమైన దేవతా స్త్రీలా అనిపించిందామెకు.

•  •  •

విషకన్య ముందుకు కదిలింది.

"అదిగో, ఆ కుడివైపు వున్న గుట్టలపక్క నుంచి నాగులకొండకు దారివుంది. అటు వెళ్ళటానికి యిదివరకైతే దట్టంగా పొదలు, తీగలు, ముళ్ళకంచెలు అల్లుకొనిపోయి అగమ్యంగా వుండేది. ఇప్పుడు అడవి కాలిపోయింతరవాత దారి స్పష్టంగా యేర్పడింది. అటు వెళ్దాం"

అంది.

సౌమ్య, నవీన్ ఆమె ననుసరించారు. వారికి కొద్ది దూరంలో ఉగ్రనాగు, అనుచర సర్పాలు జర జరా ముందుకి ఉరుకుతున్నాయి.

దారిలో జంతువుల కళేబరాలు చాలా కనిపించాయి. ముఖ్యంగా లేళ్ళు, దుప్పులు, కుందేళ్ళు, అడవి కుక్కలు, తోడేళ్ళ కళేబరాలు అడవితో బాటు కాలిపోయి, అస్థిపంజరాలు కనిపిస్తున్నాయి. అవికూడా ఎంటల్లో చాలావరకు నుసి అయిపోయి చివుడు రాలిపోతు న్నట్టున్నాయి.

"మరి, క్రూరమృగా లేమయిపోయాయో? వాటి అస్థిపంజరాలు కనిపించటంలేదు" అంది సౌమ్య నవీన్‌తో మెల్లగా.

"అవి ఎటో పారిపోయి వుంటాయి. అయినా, అడవంతా కాలిపోలేదు కదా! ఓ చిన్న భాగం—కనీసం మొత్తం అడవిలో అయిదు శాతం కూడా వుండదేమో! తక్కిన తొంభై అయిదు శాతం అడవిలోకి యే మూలకో పారిపోయి వుంటాయి!" అన్నాడు నవీన్.

సౌమ్య అవునన్నట్టు తలూపింది.

గూడెం ఎడమపక్కగా వుండిపోయింది. కుడిపక్కగా విషకన్య వెంటనంటి వాళ్ళిద్దరు నడుస్తున్నారు.

సరిగ్గా అదే సమయంలో సింహగర్జన వినిపించింది. ఆ గర్జన విని కకావికలుగా పరుగెడుతున్న ఏనుగుల గుంపు మహావేగంగా వాళ్ళమీదకు దూసుకొని వచ్చేస్తోంది!

విషకన్య ఒక్క క్షణం తొట్రుపడింది. ఏనుగుల కాళ్ళ మధ్య సర్పాలు నలిగిపోతాయని ఆమె భయం.

"ఉగ్రనాగూ! జాగ్రత్త. ఏనుగులు తొక్క

స్తాయి....” అంది విషకన్య నాగుల్ని హెచ్చరిస్తూ ఉగ్ర నాగు నుద్దేశించి.

అంత కంతకు ఏనుగులు దగ్గర కొచ్చేస్తున్నాయి. సింహ గర్జనలు కూడా చాలా ఉధృతంగా వినిపిస్తున్నాయి.

కాలిపోయిన చెట్లు ఆకుల్లేకపోయినా మోడులు అలాగే నిల్చుని వున్నాయి. విషకన్య వాటివంక చూపించింది. ఉగ్రనాగుతో బాటు, తక్కిన సర్పాలన్నీ చకచకా చెట్లు యెక్కి వాటిమీద జాగ్రత్తగా చుట్టుకొని ఏనుగుల బారినుంచి తప్పించుకున్నాయి.

నవీన్ అటు యిటు దాక్కోవటాని కేమైనా అవకాశ ముందేమోనని చూశాడు. అంతకంతకు ఏనుగులు తొండాలెత్తి ఘీంకరిస్తూ దగ్గరగా వస్తున్నాయి. సౌమ్యకి వాటి సంగతి బాగా తెలుసు. గతంలో తాము కూచున్న చెట్టును పెకలించెయ్యబోయి, ఆఖరిక్షణంలో సింహాలు దాడి చెయ్యటంవల్ల ఆ ప్రయత్నం విరమించుకొని పోరాటంలో మునిగిపోయి తమని వదిలేశాయిగాని, లేకుంటే ఆ నాడే వాటి పాలపడి చనిపోయి వుండేవాళ్ళు!

నవీన్, సౌమ్య యిలా మథనపడుతున్నా విషకన్య మాత్రం చాలా స్థిరంగా ధైర్యంగా వుంది. ఏ మాత్రం తొట్రుపడలేదు.

నవీన్ ఆమెవంక చూసి, “ఏనుగుల మంద బాగా దగ్గరయ్యింది. తప్పించుకోటానికి అవకాశం...” అనబోతుండగా అతన్ని వారించి, “వాటితో పోరాడలేమా? తప్పించుకు పారిపోవటమెందుకు?” అంది మందహాసం చేస్తూ.

నవీన్ ఆమెవంక ఆశ్చర్యంగా చూసి, “తెలిసి తెలిసి

రిస్క్ తీసుకోవటం మంచిదేనా? ఈ రెండు గన్స్‌తోను అంత పెద్ద ఏనుగుల మందను, అందునా సింహాగర్జనలకు చెదిరి చిత్తమొచ్చినట్టు పిచ్చిగా పరుగులుతీస్తున్న మందను యెదుర్కొవాలనుకోవటం....” అతని మాటలు పూర్తి కానే లేదు .... విషకన్య గాల్లోకి రెండుసార్లు గన్ పేల్చింది.

ఎక్కడెక్కడో దాక్కున్న పక్షులు రెక్కలు టపటపా కొట్టుకుంటూ కిలకిలారావాలు చేసుకుంటూ హడావిడిగా గాల్లోకి ఎగిరిపోయాయి.

గుళ్ళ చప్పుడుకు ఏనుగులు బెదిరాయి. అటు రాబోయి మళ్ళీ అంతలోనే దిశ మార్చేశాయి. నవీన్ కూడా గాల్లోకి కాల్చాడు. ఏనుగులు మహావేగంగా వెనుతిరిగి వచ్చినదారినే పరుగులు పెట్టడం ప్రారంభించాయి.

విషకన్య నవీన్ వంక నవ్వుతూ చూసింది. “ఈ టెక్నిక్ నాకు మా నాన్నగారు చెప్పారు. ముఖ్యంగా యీ అడవిలోని ఏనుగులు తుపాకీ మోత చెవిన పడితే భయపడి పారిపోతాయని చెప్పారు. నేను ఓసారి ఆయనతో అడవిలో తిరుగుతూ ప్రయోగపూర్వకంగా చూశాను కూడా. అప్పుడు తానేదార్ గోపాల్, గార్డు ఫిలిప్ కూడా మా వెంట వున్నారు!” చెప్పింది విషకన్య.

అప్పటిదాకా ఆమె అంత నిశ్చలంగా, నిమ్మకు నీరెత్తినట్టు యెలా వుండగలిగిందో నవీన్‌కి అర్థమయ్యింది.

అంతవరకు వినిపించిన సింహాగర్జనలు కూడా ఆగిపోయాయి. యేనుగులు అప్పటికే చాలా దూరం పారిపోయాయి.

"సింహాలు ఏ పక్కనుంచో మనమీద దాడి చేసే ప్రమాదం లేకపోలేదు" అంది సౌమ్య.

ఆమెకు నవీన్ కనిపించినప్పట్నుంచి బతుకుమీద మమకారం, ప్రాణంమీద తీపి పెరిగిపోయాయి. వీలైనంత తొందరగా యీ అడవిలోనుంచి నవీన్‌తో బయట పడితే చాలని అప్పటికి చాలాసార్లు అనుకొంది. అప్పటి దాకా అనుభవించిన కష్టాలు, స్ట్రెయిన్ ఓ జీవిత కాలానికి సరిపోతాయి. ఇక కష్టాల్ని భరించే శక్తి తనకి లేదనే నిశ్చయాని కొచ్చిందామె. అందుకే ప్రమాదాలంటే చలించని సౌమ్య, యిప్పుడు వాటినుంచి దూరంగా వెళ్ళిపోవాలని పదే పదే మనసులో కోరుకుంటోంది.

విషకన్య సౌమ్యకేసి స్నేహపూర్వకంగా చూసి నవ్వింది! "సింహాల్ని వేటాడటం పెద్ద కష్టం కాదు. కాకపోతే కాస్త మెలకువ, చురుకుదనం. మెరుపులాంటి వేగం అవసరం! అంతగా సింహాలే మనమీద దాడిచేస్తే మీ యిద్దరి ప్రాణాలకి నా ప్రాణం అడ్డు వేస్తాను" అంది.

సౌమ్య సిగ్గు పడింది. ఎంతసేపు తను స్వార్థంతో సంకుచితంగా ఆలోచిస్తున్నదే తప్ప, పరిస్థితుల కనుగుణంగా స్థిరంగా, హుందాగా వ్యవహరించటం లేదు!

ముగ్గురు మళ్ళీ ముందుకి కదిలారు. విషకన్య ఆదేశంతో ఉగ్రనాగు, తక్కిన సర్పజాలం చెట్లు దిగి వాళ్ళతో ప్రయాణం సాగించాయి.

అప్పటికి వెలుగు వచ్చి చాలాసేపయింది. కాలిపోయిన అడవి ప్రాంతం దాటిపోయారు. ఉదయం పదకొండు గంటలు కావస్తోంది. దార్లో అనేకరకాల పళ్ళు, పుట్ట తేనె సేకరించింది విషకన్య.

సౌమ్య, నవీన్ కన్నా బాగా ఆకలిమీద వుంది. అయినా వాటిని వెంటనే తినటానికి ఆసక్తి కనబరచ లేదు.

విషకన్య ఆమెవంక కొద్దిగా ఆశ్చర్యంగా చూసింది. "నేను పళ్ళతో కోరికితే తప్ప అవి విషపూరితం కావు" అంది ఆరముగ్గిన పండ్లవైపు చూపిస్తూ. ఆమె మాటల్లో తొణికిన విషాదం సౌమ్య, నవీన్ మనసులకి తాకి, వాళ్ళ హృదయాలని ద్రవింపచేశాయి.

"అహా....అందుకా్కాదు....నాకే ఎందుకో తినాలని పించలేదు, క్షమించండి!" అంది సౌమ్య తన ప్రవర్తనకి నొచ్చుకుంటూ.

విషకన్య పైకి మొండిదానిలా కనిపించినా, యెంత సెన్సిటివో గ్రహించి ఆమెపట్ల మనసులోనే గౌరవం పెంచుకొన్నాడు నవీన్.

* * *

పళ్ళు తిని, పుట్టతేనె తాగి మళ్ళీ ప్రయాణం కొన సాగించారు.

నాగులకొండ సమీపించారు.

విషకన్య వాళ్ళిద్దరివంక సాభిప్రాయంగా చూసి, "మనం లోయలోకి దిగాలి. సౌమ్యకి కొత్త. కొద్దిసేపు మనం ఈ చెట్లగుబురుల్లో కూచుని తదుపరి కార్యక్రమం గురించి ఆలోచించుకున్నాక మా నివాసానికి వెళ్దాం. సరేనా?" అంది.

సౌమ్య, నవీన్ కి ఆ ప్రతిపాదన నచ్చింది.

ఉగ్రనాగు, అనుచరసర్పాలు అప్పటికే లోయదిగువకు ప్రయాణం కట్టాయి. మహావేగంగా హుషారుగా, గమ్యస్థానం చేరుకోబోతున్న ఆనందంతో సాగిపోతున్నాయి.

నవీన్‌కి ఎప్పుడెప్పుడు నాయుడి విషయం తేల్చేద్దామా అన్నంత ఆత్రుతగా వుంది. బాధ్యత దించుకోవాలనే ఆత్రుత కాదు అది; విషకన్య ప్రతీకారం తీర్చుకోవటానికి వీలయినంత వేగంగా సహకరించాలనే ఆత్రుత అది!

అతనే ముందుగా నాయుడి విషయం ఎత్తాడు. "నేను ఆ నాయుడి గురించిన పూర్తి వివరాలు, అతని నివాస స్థలం గురించి, అతను ప్రస్తుతం ఎక్కడుంటున్నాడో, ఏం చేస్తున్నాడో. ఆడవిలోకి ఎందుకు రావటంలేదో ఆ వివరాలన్నీ సేకరిస్తాను. అతనిది వరంగల్ అని తెలుసుకదా, అక్కడికి వెళ్తే అన్ని సంగతులు తెలుస్తాయి.

నాయుడివంటి కలప కాంట్రాక్టర్ని—అందునా చందనం స్మగుల్ చేసే బడా కాంట్రాక్టర్ని గురించి తెలియనివాళ్ళు చాలా అరుదుగా వుంటారు. అవసరమైతే వరంగల్లో కొన్నిరోజు లుండి అన్ని పనులు పూర్తిచేసుకొని వస్తాను" అన్నాడు.

సౌమ్య నవీన్ వంక ప్రశంసగా చూసింది.

విషకన్య అతని మాటలకు చాలా ఆనందపడింది. నవీన్ మాట నిలకడగల మనిషని, అవసరం తీరినాక అన్యాయంచేసే రకంవున్నవాడు కాదని మరోసారి నిర్ధారణగా అనుకొన్నది. అతను తన పంతం చెల్లించటానికి సరైన వ్యక్తిగా తను గుర్తించటంలో పొరబడలేదను కుంది. అనుకోని అవాంతరాలు యెదురైనందున ఆలస్యమయ్యింది గాని, లేకుంటే యీ సరికి తన ప్రతీకారం

జల్లించి వుంచేవాడని విశ్వసించింది.

సౌమ్యాకి విషకన్య గురించి పూర్తి వివరాలు నవీన్ యింకా చెప్పలేదు. అయినప్పటికీ ఆమె కొంతవరకు వాళ్ల సంభాషణనిబట్టి అర్థం చేసుకోగలిగింది. నవీన్ సందర్భానుసారం చెప్తాడని ఆసక్తిని అణచుకుని వాళ్ళ సంభాషణను మౌనంగా వింటోంది.

విషకన్య చెప్పింది: "నువ్వు సరాసరి వరంగల్ వెళ్ళబోయే ముందు, యీ అడవిలోని కలపని కాంట్రాక్టు చేసే కొందరు దళారులు ఘాట్ రోడ్ దగ్గరున్నారు— వాళ్ళని కలుసుకుంటే పూర్తి వివరాలు తెలుస్తాయి. అడవిలో అనవసరమైన చెట్లు తొలగించి, వాటిని వేలం వేసి అమ్మేస్తారు. ఆ లాట్లు కాంట్రాక్టు చేసేవాళ్ళకి, అటవీశాఖాధికారులకి మధ్య కొందరు దళారులుంటారు. వాళ్ళు కాంట్రాక్టర్ల విషయాలన్నీ చెప్పగలుగుతారు.

నాయుడు యీ ప్రాంతాల పెద్ద కాపు కాంట్రాక్టరు. మొదట్లో యిలాంటి రద్దు కలపను కాంట్రాక్టు చేస్తూ, అవినీతిపరులైన కొందరు అటవీశాఖాధికారులతో చేతులు కలిపి చందనం అక్రమ రవాణా చేస్తూండేవాడు. మా నాన్నగారు అందుకు వ్యతిరేకించినందువల్లే ఆయనమీద కత్తిగట్టాడు."

నవీన్ తలూపి "ఈ సమాచారం నాకు చాలా ఉపకరిస్తుంది. తప్పక అలాగే చేస్తాను. వాళ్ళు నాకిచ్చిన ఇన్ఫర్మేషన్ బట్టి యేం చెయ్యాల్సిందీ నిర్ణయించుకుంటాను. ఏదోవిధంగా నాయుడ్ని యీ అడవిలోకి వచ్చేలా చూస్తాను. ఈ స్పాట్ కి తీసుకురానా?" అడిగాడు.

"ఈ పరిసరాల్లోనే చందన చెట్లున్నాయి. ఏ నాటి కయినా నాయుడు యీ పరిసరాలకు వచ్చితీరుతాడనే నేను యీ నాగులకొండని నా నివాసం చేసుకున్నాను. నాయుడే కాదు. మరే కాంట్రాక్టరు యీ మధ్య కాలంలో—అంటే గత మూడు నెలలుగా అడవిలోకి ప్రవేశించలేదు.

అందుక్కారణం మా నాన్నగారు పోయాక వరసగా అందరు స్టాఫ్ నా ప్రతీకార జ్వాలల్లో మాడి మసైపోయి అటు అధికారుల్లోను, యిటు కలపకాంట్రాక్టర్లలోను, పెద్ద సంచలనం కలిగింది. నాయుడు రాకపోవటాని క్కూడా యిదొక కారణంగా నేను భావిస్తున్నాను. ఏ విషయమూ ఆ దశాయిలకి తెలుస్తుంది. అటుపైన నీకు తోచిన విధంగా చెయ్యి" అంది విషకన్య.

"అయితే యెప్పుడో యెందుకు? యీ క్షణమే బయల్దేరి వెళ్తాను. చీకటి పడేలోపల అడవి దాటి పోలేనా?"

"అడవి దాటి ఏం లాభం? అడవి దాటాక ఘాట్ రోడ్ చేరటానికి పాతిక కిలోమీటర్ల దూరముంది. మొదటి అయిదు కిలోమీటర్లు కంకర రోడ్డు, తక్కిన ఇరవై కిలోమీటర్లు తార్రోడ్డు. తార్రోడ్డుకు చేర్చి బస్ రూట్ మొదలవుతుంది. అటు హైద్రాబాద్ పోయే బస్‌లు, హైద్రాబాద్ నుంచి వచ్చే బస్‌లు అక్కడే కలుస్తాయి."

"ఆల్ రైట్. అయితే తెల్లవారుతుండగా అడవి దాటి లేనే మంచిది. అప్పుడయితే ఆటవికులు గాని, అటవీ శాఖాధికారులు గాని నా ఉనికిని గుర్తించే అవకాశ ముండదు."

"ఘాట్ రోడ్ యెలా దాటుతావు? హెవీ లారీలు తిరిగితే నే తప్ప మామూలు సమయాల్లో ఘాట్ రోడ్ మీద వాహనాలేవీ తిరగవు."

"చూస్తాను—అప్పటికి యెలా వీలవుతే అలా.... అరిథకంగా బాగా బలంగా వున్నాను. డబ్బు వెదజల్లుతే జరగని పనులుంటాయా?"

విషకన్యకి, సౌమ్యకి అతను బందిపోట్లు దోచిన లాట్స్‌లో నుంచి కరెన్సీ తీసి యెందుకు భద్రపరిచాడో అర్థమయ్యింది. తను అంతదూరం ఆలోచించనందుకు రవ్వంత సిగ్గుపడింది సౌమ్య. నవీన్ ముందుచూపు ప్రశంసనీయం! వరంగల్ వెళ్ళిరావటానికి, అక్కడ వసతికి, యింకా యితర ఖర్చులకి చాలా డబ్బు అవసరముంటుంది.

"అయితే, తెల్లవారుఝామువరకు నా భవనంలో ఆతిథ్యం స్వీకరించండి మీ యిద్దరు. అన్నట్టు సౌమ్యని తీసుకు వెళ్తావా?"

"సౌమ్య యిప్పుడొద్దు. నేను ఒంటరిగానే వెళ్తాను" అన్నాడు నవీన్ సౌమ్యవంక సాభిప్రాయంగా చూసి.

"అవును. నేను అక్కయ్యతోనే వుంటాను నువొచ్చే వరకు" అంది వెంటనే సౌమ్య.

"కాని, నేనుంటున్నది పాములు తిరిగే నాగులకొండలోయ. నా కెలాగూ అలవాటయిపోయింది. కాని నువ్వుండలేవు. నిన్ను నవీన్ తన వెంట వరంగల్ వరకు తీసుకువెళ్ళి, అక్కడ్నుంచి మీ యింటికి పంపేస్తాడు" అంది విషకన్య.

సౌమ్య ఆమె మాటలు పూర్తికాకుండానే "ఉహుఁ! నేను ఒక్కర్తెనూ నవీన్ లేకుండా మా ఇంటికి వెళ్ళను.

వెళ్ళటం జరిగితే మేము జంటగానే వెళ్తాం. నవీన్ తన పని పూర్తిగా నెరవేర్చేవరకు అది నా బాధ్యత కూడా! బాధ్యత తీరకుండా మధ్యలో వెళ్ళటం స్నేహితుల లక్షణం కాదు!" అంది.

విషకన్య సౌమ్య రెండు చేతులు తన చేతుల్లోకి తీసుకొని, "రియల్లీ చంద్రపుర్! మీ ఇద్దరు భౌతికంగాను, మానసికంగాను యెంతో సన్నిహితులు అయ్యారు. మీ ఇద్దరిది ఒకటే మాట. ఒకటే బాటని అర్థమయ్యింది" అంది చిన్నగా నవ్వుతూ.

నవీన్ ప్రశంసగా చూశాడు సౌమ్యవంక.

"ఆల్ రైట్! ఈ రాత్రికి—తెల్లవారుఝామువరకు—విశ్రాంతి తీసుకుని నా ప్రయాణం మొదలుపెడతాను" అన్నాడు నవీన్.

ఆ తర్వాత ముగ్గురూ లోయ లోపలికి ప్రయాణం సాగించారు.

అప్పటికి చీకటి పడిపోతూ వుంది!

ఆ రాత్రి విషకన్య ఉదంతాన్ని సౌమ్యకు క్లుప్తంగా వివరించాడు నవీన్.

సౌమ్య చాలా ఆసక్తిగా, సంభ్రమంగా విన్నది. నవీన్ ఎందుకంత శ్రద్ధ చూపిస్తున్నాడో అర్థమయ్యింది. అతని నిస్వార్థ సేవకు అంజలి ఘటించింది. తమ ప్రాణాలని యెప్పటికప్పుడు విషకన్య ఎలా రక్షించిందీ, తన మానసంరక్షణకు చింపాంజీని పంపించి ఎంత మహోపకారం చేసిందీ గ్రహించింది.

చింపాంజీ మరణానికి నవీన్, సౌమ్య కొద్దిసేపు మౌనాన్ని పాటించి, దాని ఆత్మశాంతికి భగవంతుడ్ని

ప్రార్థించారు. నిజంగా మనిషికన్నా ఎంతో విశ్వాసంతో మెలసరతో. తెలివితేటలతో ప్రవర్తించి అడుగడుగునా తమను ఆపదల నుంచి రక్షించింది!

లోయ దిగువ కాంతివంతంగానే వుంది. అక్కడ కొన్ని మణులుండి వెలుగును విరజిమ్ముతున్నాయి. ఆ మణులు జాతిసర్పాలు తమ పడగమీద ధరించే మణులని విషకన్య చెప్పింది.

విషసర్పాల మధ్య కొన్ని గంటలు గడపవలసి వచ్చినా సౌమ్యకు ఏమాత్రం జుగుప్స గాని, జలదరింపు గాని, చిరాకు గాని కలగలేదు. విషం కక్కే మనుషుల కన్నా, తమ ఉనికికి ప్రమాదం కలిగితే తప్ప ఎవరికీ హాని చేయని విషసర్పాలు యెన్నో రెట్లు నయమని గ్రహించింది సౌమ్య.

తెల్లవారుఝామువరకు కబుర్లతో గడిపేశారు. విష కన్య తన చిన్నతనం గురించీ, తను పెరిగిన వాతావరణం గురించీ, చదువుసంధ్యల గురించి, స్నేహితుల గురించి ఎన్నో కబుర్లు చెప్పింది.

ఎంతో సుకుమారంగా పెరిగి, నిశ్చింతగా హాయిగా చదువుకొంటూ ఏచింతలేకుండా గడిపే ఆ అమ్మాయి పరిస్థితి, అలాంటి దుస్థితికి దిగజారటానికి దారితీసిన విచిత్ర సంఘటనలు, విషాదపరిణామాలకు కారకుడైన నాయుడి మీద పగ తీర్చుకోవాలని ఆమె శపథం చేయటంలో తప్పుగాని, దాన్ని నెరవేర్చటంలో అన్యాయం గాని లేదని నవీన్, సౌమ్య మనస్ఫూర్తిగా నిర్ణయించు కొన్నారు.

తెల్లవారటానికి కొన్ని గంటల వ్యవధి వుండగానే

విషకన్య, నవీన్‌ని అడవి బయటకు చేర్చింది. దార్లో యెలాంటి ఆటంకాలనైనా ఎదుర్కోటానికి సిద్ధంగా గన్, బుల్లెట్స్ చేతిలోను, ఉగ్రనాగును తన వెంట తెచ్చుకుందామె.

చిన్న చిన్న జంతువు లెదురైనా అవాంఛనీయ సంఘటన లేమీ యెదురుకాలేదు. ప్రతిఘటన లేకపోవటంతో ప్రశాంతంగా అడవి దాటారు.

"ఇటునుంచి మీరు మధ్యలో ట్రెయిన్ దిగిపోయిన రైలుపట్టాలు తగుల్తాయి. నన్ను యిటు కాదు వెళ్ళాల్సింది. అదిగో. ఎడమపక్క సన్నటి కాలిబాట కనిపిస్తోంది కదూ! ఆ బాటలో వెళ్ళారంటే కొన్ని ఫర్లాంగుల తరువాత ఘాట్ రోడ్ ప్రారంభమవుతుంది—కంకరరోడ్డు. ఆ తర్వాతి విషయాలు నీకు తెలుసు" అంది విషకన్య

నవీన్ ఆమె దగ్గర నుంచి చిరునవ్వుతో వీడ్కోలు తీసుకున్నాడు.

నవీన్ కనుమరుగయ్యేవరకు అతన్నే చూస్తూ నిల్చుంది విషకన్య.

• • •

ఘాట్ రోడ్ ప్రారంభమయింది.

అప్పటికి పూర్తిగా తెల్లవారిపోయింది.

రోడ్డుమీద వాహనాలేమీ తిరగటంలేదు. గతుకుల కంకర్రోడ్డు వాహనాలు వస్తే బయట్నుంచి అడవిలోకైనా రావాలి, అడవి నుంచి బయటికైనా వెళ్ళాలి! విషకన్య చెప్పింది కరెక్టే!

నవీన్. రోడ్డు నిర్మానుష్యంగా వుండటం చూసి, పాతిక కిలోమీటర్లు యెలా నడవాలో అని ఆలో

చిన్నాగే ముందుకి వస్తున్నాడు.

అలాగే ఓ కిలోమీటరు నడిచాడు.

దూరంగా రోడ్డు రోలరు, రోడ్డుపని చేస్తున్న కూలీలు కనిపించారు.

నవీన్‌కి ప్రాణం లేచివచ్చింది. కంకర్రోడ్డును తారు రోడ్డుగా మారుస్తున్నారని గ్రహించాడు అక్కడ తన కేదయినా వాహనం దొరకవచ్చు ననుకున్నాడు.

అతని ఊహ నిజమయ్యింది. ఇంజనీర్లు ఉపయోగించే ఆర్ అండ్ బి. జీప్ వుంది, రోడ్‌రోలర్‌కి కొంత దూరంలో.

నవీన్ వంక పనివాళ్ళు ఓ క్షణం తలెత్తి చూసి మళ్ళీ తమ పనుల్లో నిమగ్నమయ్యారు.

నవీన్ తను అటవీశాఖలో పనిచేసే తాణేదారు బంధువునని పరిచయం చేసుకుని, "దయచేసి నాకు ఘాట్‌రోడ్ చేరటాని కేదయినా కన్వేయన్స్ ఏర్పాటు చేయగలరా?" అనడిగాడు స్పాట్‌లో వున్న ఇంజనీరుని.

ఆయన నవీన్ అభ్యర్థనకు చిరునవ్వుతో తలూపి, "హైద్రాబాద్ వెళ్తున్నారా?" అన్నాడు.

"అవును సార్!" అన్నాడు నవీన్ వెంటనే.

"నేను ఓ అరగంట తర్వాత ఘాట్‌రోడ్ బస్టాండుకి వెళ్తున్నాను. మా స్టాఫ్ కొందరు వస్తారు. మిమ్మల్ని బస్టాండ్‌లో డ్రాప్ చేస్తే సరిపోతుంది కదా!" అన్నాడు ఇంజనీరు.

"చాలా థాంక్సండి! మీ ఋణం తీర్చుకోలేను—" అన్నాడు నవీన్.

అరగంట తర్వాత జీప్ బయల్దేరింది.

ఘాట్ రోడ్ దగ్గర దిగిపోయి, ఇంజనీరుకి కృతజ్ఞతలు చెప్పుతున్నాడు నవీన్.

ఆ తర్వాత తూపు దళారుల గురించి యెంక్వయిరీ చేశాడు నవీన్. బస్టాండ్ కి దగ్గర్లోనే ఓ దళారి వుంటున్నాడు.

అతను నవీన్ వంక చూసి, "నాయకుడుగారు తమకేం కావాలి బాబూ?" అనడిగాడు.

"ఆయనకి మారవు బంధువుని. ఆయన తరచు యిక్కడి సమీప అడవికి వస్తారని తెలుసు. నేను నాగపూర్ లో చదువుకొంటున్నాను. వరంగల్ వెళ్తున్నాను. మామయ్యా యిక్కడ వుంటే ఏకంగా యిద్దరం కలిసే వెళ్ళొచ్చునని యిక్కడ ఆగాను" అన్నాడు నవీన్.

అంతక్రితమే నాగపూర్ నుంచి హైద్రాబాద్ వైపు వెళ్తున్న ఎక్స్ ప్రెస్ బస్ వచ్చి వెళ్ళింది. నవీన్ అది చూశాడు. సమయానుకూలంగా ఆ పూర్తించి వస్తున్నానని చెప్పాడు. బ్యాగ్ గాని, సూట్ కేసు గాని తన వెంట లేదని, ఆ విషయం అతనడిగితే యేం చెప్పాలని అతను దూహించలేదు—సమయానుకూలంగా చెప్పేవాడంతే!

అదృష్టవశాత్తు అతను వివరాల జోలికి పోలేదు. కాని కొద్దిపాటి అనుమానం అతని మాటల్లో వ్యక్తమయ్యింది. "మామయ్యను మీ రీ మధ్య కలుసుకోలేదా బాబూ?" అన్నాడు.

"కల్సుకోవటమే కాదు, మూడు నెలలుగా ఆయన్నుంచి ఉత్తరాలు కూడా లేవు. ఆయన క్షేమసమాచారాలు తెలియవు. అందుకే ఉండబట్టలేక చూడాలని

బయల్దేరి వచ్చేశాను" అన్నాడు నవీన్.

అతను జాగ్రత్తగా చూచి మాట్లాడుతున్నాడు. నాయుడు అడవికొచ్చి వెళ్ళి మూడు నెలలు దాటినట్టు విషకన్య చెప్పింది. అందుకే మూడు నెలలని తను చెప్పటం వల్ల అతనికెలాంటి అనుమానం రాదు!

దళారి ముఖంలో చిరునవ్వు వెలిగింది. నవీన్ మాటల్ని పూర్తిగా నమ్మాడు.

"అవును బాబూ! నాయుడు బాబుగారొచ్చి మూడు నెలలు దాటిపోనాది. కాంట్రాక్టర్ల మాధ్య యీడకి రాటం మానేసినారు. ఈ అడవిలో ఎన్నో గోరాలు జరిగిపోనాయి. భయపడి యెవరూ రాటంలేదు. నాయుడు బాబు వొచ్చేవారే గానీ, ఆరికీ మద్దెన ఒంట్లో సుకం నేదంట. ఎవరో సెప్పిండ్రు" అన్నాడు.

అసలు విషయం తెలిసింది నవీన్‌కి. అయితే నాయుడికి ఆరోగ్యం బావుండని కారణంగానే అడవిలోకి రాలేదన్నమాట!

అలవాటయిన ప్రాణం, రాకుండా వుండలేడు. ఎలాంటి స్ట్రిక్టు ఆఫీసర్నయినా తన డబ్బుతో కొనెయ్యగల నాయుడు కొత్త ఆఫీసరుకు వెరుస్తాడా? అందరు రాఘవేంద్రరావులా వుండరు. రాఘవేంద్రరావు పై ఆఫీసర్లు లాంటివాళ్ళే యెక్కువ. వాళ్ళనే డబ్బుతో కొనేసిన నాయుడు అడవిలోని కొత్త ఆఫీసర్ని కొనలేడా?

"సరే, నేను వరంగల్ వెళ్తాను. మామయ్య ఉత్తరాలు రాయకపోవటానికి యిలాంటిదేదో కారణముండి వుంటుందనుకున్నాను. నా అనుమానమే నిజమయ్యింది. నేను వెంటనే మామయ్యను చూడాలి, అంతవరకు

నాకు మనశ్శాంతి లేదు" అన్నాడు నవీన్ ఆందోళన పడుతూ.

"అలాగే వెళ్ళండ్రి బాబూ! ఇంకో గంటలో కాజీ పేట పోయే బండుంది. దాంటో ఎల్లి వొరంగల్ కి మారండ్రి" అన్నాడు దశారి.

"అలాగే, అలాగే!" అన్నాడు నవీన్ బస్టాండువైపు అడుగులు వేస్తూ.

"బాబూ!" అని పిలిచాడు దశారి.

నవీన్ ఎందుకన్నట్లు ఆగి చూశాడు.

"మీరు తిరిగి ఎళ్లేటప్పుడు యీ రోడ్డున ఎల్తారుగందా! వాయొండు బాబుగోరి సంగతి తూసింత యిక్కడ మాకు అందచేయండ్రి" అన్నాడు దశారి.

"అలాగే, తప్పకుండాను" అన్నాడు నవీన్.

ఇంకా అక్కడే వుంటే యేమడుగుతాడోనని పెద్ద అంగలు వేసుకొంటూ వెళ్ళిపోయాడు నవీన్.

పదిగంటల ప్రాంతాల కాజీపేటకు పోయే ఎక్స్ ప్రెస్ బస్ వచ్చింది. నవీన్ బస్ యెక్కాడు. రాత్రి తొమ్మిది గంటలకు వరంగల్ చేరుకున్నాడు.

* * *

సరాసరి ఓ పెద్ద హోటల్ కి పోయి రూం తీసుకొన్నాడు నవీన్. ఎక్స్ టెన్ షన్ తో సంబంధంలేకుండా డైరక్టు డైలింగ్ సౌకర్యమున్న అధునాతనమైన గది తీసుకున్నాడు.

అంతకు ముందే, ఓ ఏర్ బాగ్, లుంగీ, టవల్, రెండుజతల ఖరీదయిన షర్టులు, పాంట్లు, టూత్ పేస్టు, బ్రస్టు, సోపువంటి అవసరమైన వస్తువులు కొనుక్కొని

ఏర్ బాగ్ లో సర్దుకుని హోటల్ కి వెళ్ళాడు.

రూం చేర్తూనే టెలిఫోన్ డైరెక్టరీ తీసి నాయుడి ఫోన్ నెంబర్ అడ్రసుల కోసం వెతికాడు. ముగ్గురు నాయుళ్ళున్నారు డైరెక్టరీలో. అయితే కాంట్రాక్టర్ నాయుడు ఒక్కడే కావటం అతనికి చాలా వుపకరించింది. లేకుంటే ముగ్గురికీ ఫోన్ చేసి యిన్ ఫర్ మేషన్ తెల్సుకోవటం కష్టమయ్యేది!

కాంట్రాక్టర్ నాయుడి నెంబర్ కి డయల్ చేశాడు. అవతల్నుంచి యెవరో ఫోనెత్తారు. స్త్రీ గొంతు!

"హల్లో! నాయుడుగారున్నారాండి?...." అనడిగాడు.

"నాయుడుగా రంటే....!?" అవతల్నుంచి స్త్రీ గొంతు అర్థోక్తిలోనే ఆగిపోయింది.

"అదేనండి....కలప లాట్లు కాంట్రాక్టు చేసే నాయుడు గారు కావాలి...."

"ఆయన వూళ్ళో లేరు!"

హతాశుడైపోయాడు నవీన్.

"ఏ వూరు వెళ్ళారండి!? ఇప్పట్లో రారా?"

"రెండు రోజుల్లో వస్తారు. హైద్రాబాద్ వెళ్ళారు."

"ఆయనొచ్చాక ఫోన్ చేస్తా లెండి!"

"ఇంతకీ మీ రెవరు?"

"అవన్నీ ఆయన్తో మాట్లాడేటపుడు చెపుతాను.... థాంక్స్ ఫర్ ది యిన్ ఫర్ మేషన్" చెప్పాడు నవీన్ ఫోన్ పెట్టేస్తూ.

మరునాటి కార్యక్రమాన్ని ప్లాన్ చేసుకుంటూ ఆ రాత్రంతా కలతనిద్రతో గడిపాడు నవీన్.

తెల్లారాక ప్రింటింగ్ ప్రెస్‌కి వెళ్ళాడు నవీన్. లెటర్ పాడ్స్ కొన్ని ప్రింటింగ్‌కి ఆర్డరిచ్చాడు. 'ది గోదావరి శాండల్ వుడ్ ప్రోడక్ట్స్ ప్రయివేట్ లిమిటెడ్' అన్న టైటిల్ ప్రింటు చేయించాడు. అలాగే విజిటింగ్ కార్డ్స్ కూడా వేయించాడు. సాయంత్రానికి ఇవ్వాలని చెప్పాడు.

సాయంత్రానికి పాడ్స్, విజిటింగ్ కార్డ్స్ తయారయ్యాయి. ఈ లోపల ఖరీదయిన రెండు ఫైల్స్ కొన్నాడు. లెటర్ పాడ్ మీద ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినందుకు సూచనగా కొన్ని కొన్ని లెటర్స్ టైప్ చేసి సిద్ధంగా వుంచాడు—పాత తేదీలతో. వాటిని రెండు ఫైల్స్‌లోను సర్దాడు. విజిటింగ్ కార్డ్స్‌ను కొన్నిటిని జేబులో పెట్టుకున్నాడు.

ఇదంతా ముగిసేసరికి రాత్రి ఎనిమిది గంటలయింది. ఈ లోపల రెండుసార్లు నాయుడింటికి ఫోన్ చేశాడు నవీన్. ఇంకా హైద్రాబాద్‌నించి తిరిగిరాలేదని సమాధానం వచ్చింది.

నవీన్ సాలోచనగా కాసేపు గదిలో పచార్లు చేశాడు. మరునాడు సాయంత్రం నాయుడితో యెలా వ్యవహరించాలో అప్పటికి చాలాసార్లు రిహార్సల్ చేసుకున్నాడు.

తన వెంట తెచ్చుకున్న కరెన్సీ ఓసారి లెక్క చూసుకున్నాడు. ఫరవాలేదు, దాదాపు పద్దెనిమిదివేల రూపాయలున్నాయి.

ఆ రాత్రి కూడా నిద్ర పోయేలోపల మరోసారి నాయుడికి ఫోన్ చేశాడు. ఈసారి అవతలి మనిషి నొక్కించి అడిగింది, అసలెందుకు ఫోన్ చేస్తున్నారని.

నవీన్ చాలా రహస్యంగా ఫోన్లో చెప్పాడు.

"నేను గోదావరి శాండల్‌వుడ్ ప్రొడెక్ట్స్ యజమానిని. నాయుడుగారితో చాలా అర్జంటు పనివుంది. రాగానే చెప్పండి ఆయనతో. నేను ఉదయం మళ్ళీ ఫోన్ చేస్తాను" అన్నాడు నవీన్.

"మీ ఫోన్ నెంబరివ్వండి. ఆయనరాగానే మీకు తెలియపరుస్తాను" అందామె.

మిగతా వివరాలేం చెప్పకుండా ఫోన్ నెంబరు మాత్రం చెప్పి ఫోన్ పెట్టేశాడు నవీన్.

మూడోరోజు ఉదయం తొమ్మిది గంటలకి ఫోన్ వచ్చింది నవీన్‌కి. అదే పరిచయమైన గొంతు, తర్వాత బొంగురుగొంతు వినిపించాయి.

"హల్లో! నాయుడు స్పీకింగ్....ఎవరది?" అన్నాడు కర్కశంగా నాయుడు.

నవీన్ టెన్షన్ అణచుకుంటూ, "నేను గోదావరి శాండల్‌వుడ్ ప్రోడెక్ట్స్ సోల్ ప్రొప్రయిటర్ని. మీతో మాట్లాడాలి. రావచ్చునా?" అనడిగాడు.

శాండల్‌వుడ్ పేరు వినగానే నాయుడికి కొంత అర్థమవుతుందని నవీన్ ఆశించాడు.

నాయుడు రెండుక్షణాలాగి, "రండి. మా యిల్లు తెలుసునా?" అన్నాడు.

"తెలుసండి" అంటూ ఫోన్ పెట్టేశాడు నవీన్.

టెలిఫోన్ డైరెక్టరీ నుంచి నాయుడి అడ్రసు వేరే కాగితంమీద రాసుకుని, హోటల్ రూం నుంచి బయటికొచ్చాడు. పదివేల రూపాయలు కేష్ తీసుకున్నాడు.

పది నిముషాల్లో టాక్సీలో నాయుడింటికి వెళ్లాడు.

• • •

విశాలమైన ఆవరణలో అధునాతనంగా వున్న పెద్ద మేడ ముందు టాక్సీ దిగాడు. టాక్సీని వెయిట్ చెయ్యమని చెప్పి లోపలికి వెళ్ళాడు.

అల్సేషియన్ కుక్క 'భౌ, భౌ' మంటూ మీది కురకబోయింది. ఇంతలోనే యజమాని గొంతు వినిపించి వెనక్కి వెళ్ళిపోయింది.

బుంగమీసాలతో, నెత్తురుముద్దల్లా వున్న క్రూరమైన కళ్ళతో, లావుగా పొడవుగా వున్న ఓ వ్యక్తి, పట్టు లుంగిమీద వరండాలో నిల్చుని నవీన్ వంకే చూస్తున్నాడు.

నవీన్ అతన్నే నాయుడిగా గుర్తించాడు. నమస్కారంచేసి తనని తాను పరిచయం చేసుకున్నాడు. ఖరీదయిన గుడ్డల్లో నీట్‌గా యిన్‌షర్టు చేసుకుని ఫుల్ షూస్‌తో స్మార్ట్‌గా కనిపిస్తున్న నవీన్‌ని చూడగానే గౌరవభావం కలిగింది నాయుడికి.

"రండి, కూర్చోండి. కానాసార్లు ఫోను చేసినారంట. చెప్పండి, ఏమిటీ నా వల్ల కావాల్సిన పని?" అనడిగాడు నాయుడు.

నవీన్ తన విజిటింగ్ కార్డు నాయుడి కిచ్చాడు. ఫైలు తెరిచి, కరస్పాండెన్స్ నాయుడికి కనిపించేలా పట్టుకొని, దేనికోసమో వెతుకుతున్నట్టు నటించాడు. లెటర్ హెడ్ మీదున్న టైటిల్ కనిపించేలా తెరచి వుంచి తర్వాత మూసేస్తూ, నాయుడివంక చిర్నవ్వు నవ్వుతూ చూశాడు.

"మా కంపెనీ చందనంతో కొన్ని అపురూపమైన వస్తువులు తయారుచేస్తోంది. అందుకు ముడిసరుకు సప్లయి

చేస్తారని హైద్రాబాద్‌లో తెలిసిన స్నేహితులు మీ పేరు సూచించారు. మూడురోజులనుంచి మీ కోసం చూస్తున్నాను హోటల్లో. మీరు హైద్రాబాద్ వెళ్ళారట. మళ్ళీ రాలేరని, మీ కోసం ఎదురుచూస్తూ వుండిపోయాను" చెప్పాడు నవీన్.

నాయుడు సాలోచనగా చూస్తూ, "మీ స్నేహితులు చెప్పింది నిజమేగాని, ప్రస్తుతం స్టాకులేదు. ఈ మధ్యన ఫారెస్టుకి పోలా" అన్నాడు.

"అయ్యో, మీరలాగంటే ఎలా సార్! నా ప్రొడక్టు పనంతా ఆగిపోతుంది. మీరు యే రేటు కావాలంటే ఆ రేటు వేసుకోండి. అడ్వాన్సు కూడా ఇస్తాను" జేబు నుంచి నోట్లు పైకి తీసి పట్టుకున్నాడు నవీన్.

నాయుడికి డబ్బుని చూడగానే కళ్ళు మెరిశాయి. "మీరింతగా అడగక్కర్లేదు. సరుకుంటే అమ్మకోనా? ఈ మధ్యన మూడ్నెల్లుగా అటు పోలేదు నాకు సుస్తీ చేసి. మీ కోసం మళ్ళీ వెళ్ళాలిప్పుడు" అన్నాడు.

"ప్లీజ్! నా కోసం శ్రమ తీసుకోండి. నా ప్రొడక్టు ముడిపదార్థమే శాండల్‌వుడ్. అది లేకపోతే పని స్తంభించిపోతుంది. నేను మూడురోజులుగా ఫ్యాక్టరీకి కూడా పోకుండా మీ కోసం వుండిపోయానంటే దాన్ని బట్టి నాకెంత అవసరమో గ్రహించే వుంటారు. రేటు గురించి చూడకండి. మీరు చెప్పేదానికి నేను మారు మాట్లాడను. ఇదిగో ఈ పదివేలు ఎడ్వాన్స్‌గా వుంచండి" అన్నాడు డబ్బు టేబిల్ మీద పెట్టి.

ఈ లోపల వంటమనిషి కాఫీలు తెచ్చి అక్కడ పెట్టి వెళ్ళాడు.

నాయుడు కాఫీ ఆఫర్ చేస్తూ, "మీ కింతగా చెప్పాలా? రేపు వెళ్తాను. మీరు అంతవరకు హోటల్లోనే వుంటారా? హైదరాబాద్ వెళ్ళిపోతారా? లేదా హైదరాబాద్‌లో మీరు యెక్కడికి పంపించమంటే అక్కడికి పంపుతాను" అన్నాడు.

నవీన్ వెంటనే, "నేను యిక్కడుండటం అనవసర మనుకొంటున్నాను. ఇది డైరెక్టు రూట్లో లేదు. నేను మీతో అడవికి రావటానికి ఏమైనా అభ్యంతరమా? అడవి నుంచి డైరెక్టుగా హైదరాబాద్‌కు సరుకు తీసుకు పోతాను. బాలెన్స్ హైదరాబాద్‌లో యిస్తాను" అన్నాడు.

"డబ్బుదేముంది లెండి. మీరు మేము యిలాగే కొన్నాళ్ళపాటు బిజినెస్సు జరగాలి కందా."

"అయినా, మనం ఎగ్రిమెంటు రాసుకుంటే మంచిది. బాలెన్స్ మొత్తాన్ని లోరానీ నేను సంతకం పెట్టి మీకు ఓ కాపీ యిస్తాను! నేను కొత్తవాడిని కదా. వ్యాపారం వ్యాపారమే!" అంటూ లెటర్ హెడ్‌లో వున్న రెండు షీట్స్ తీసి పైన పెట్టాను.

నాయుడు నవీన్ మాటలకు చాలా సంతోషించాడు. డబ్బు విషయం పైకి మొహమాటానికి అలా అన్నాగాని లోపల అతనికి అనుమానం పీకుతోంది. తీరా సరుకు అందాక అతనేమైనా పేచీ పెడితే యెవరికీ చెప్పుకునే అవకాశ ముండదు. దొంగసరుకు కదా!

నవీన్ ఆ యిబ్బంది తొలగించటంతో చాలా రిలీఫ్ ఫీలయ్యాడు. నవీన్ మీద పూర్తిగా నమ్మకం యేర్పడింది. నవీన్‌కి కావలసింది అదే! అతను తనను పూర్తిగా నమ్మి

లేని తంట దారి సుగమమవుతుంది!

మర్నాడు తెల్లవారుఝామున బయల్దేరటానికి నిర్ణయమయింది.

నవీన్ నాయుడు చెప్పిన రేటు వేసి తనిచ్చిన అడ్వాన్సు అందులోనుంచి తీసివేసి బాలెన్సుకి సంతకం పెట్టి యిచ్చాడు. ఫక్తు వ్యవహారకర్తలాగా అనుభజ్ఞుడైన బిజినెస్‌మన్ లాగా యే మాత్రం లొసుగులేకుండా జాగ్రత్తగా నటిస్తున్నాడు.

• • •

నాయుడు, అతని డ్రైవరు, ముగ్గురు నమ్మినబంట్లు నవీన్ లారీలో బయల్దేరారు మరుసటిరోజు తెల్లవారుఝామున నాలుగ్గంటలకు.

డ్రైవర్‌కేదో అడ్డదారి తెలుసు కాబోలు. కాజీపేట మీదినుంచి వెళ్ళనక్కర్లేకుండానే సరాసరి అడవికిపోయే దారి పట్టించాడు లారీ.

మధ్యాహ్నం భోజనాలు నీరపూర్‌లో యేర్పాటు చేశాడు నాయుడు. సాయంత్రానికి లారీ ఘాట్ రోడ్ చేరుకుంది!

ఘాట్ రోడ్‌కి చేరుతుండగా అకస్మాత్తుగా నవీన్‌కి గుర్తొచ్చింది—అక్కడ తను మాట్లాడిన దళారి వుంటాడని, అతను తనని గుర్తుపట్టి నాయుడితో ఏమైనా అంటే అంతా రసాభాసవుతుందని!

సరిగ్గా అప్పుడే ఆ దళారి బస్టాండువైపు వస్తున్నాడు....బస్ వచ్చిందని లారీ వేగం తగ్గించాడు డ్రైవరు.

నాయుడు దళారిని చూశాడు. దళారి లారీని గుర్తు

పట్టిస్తున్నాడు. వేగంగా లారీవయిపు నడుస్తూ వస్తున్నాడు.

నవీన్ గుండెలు గొంతులో కొట్టుకుంటున్నాయి. పడ్డ ఇంత శ్రమా వ్యర్థంకావటమే కాక, నాయుడికి అనుమానం వచ్చేస్తుంది. తనని యేమైనా చేస్తాడని కాదు, ప్లాన్ అంతా బెడిసికొట్టిపోతుంది.

దళారి లారీకి దగ్గరయ్యాడు.

సరిగ్గా అప్పుడే నాయుడు చెప్పాడు డ్రైవర్‌తో: "వేగంగా పోనివ్వు. యాదయ్య వొస్తున్నాడు. ఆడికి మళ్ళా కమీష నిచ్చుకోవాలి. ఎంతో కొంత లాగకుండా వదల్డు"

అంతే. డ్రైవర్ ఒక్కసారిగా లారీ వేగం పెంచి ఘాట్‌రోడ్ యెక్కించాడు. వెనకనుంచి దళారి కేకలు పెట్టాడుగాని వినిపించుకోలే దెవరూ.

"ఆను బేరం కుదర్చలేదు గదా దొరా! అయినా కమిస నిచ్చుకోవాలా?..." ఓ అనుచరుడు అడిగాడు నాయుడ్ని.

"మనం అడవిలోకి వొచ్చినామంటే యివ్వకతప్పదు గందా! అందుకే చూసీ మాడట్టు పోతే అడడిగేది లేదు, మనమిచ్చేదీ లేదు" అన్నాడు నాయుడు బుంగ మీసాలు సవరించుకొంటూ.

ఘాట్‌రోడ్ పూర్తయింది. కంకర్రోడ్డు కూడా తారురోడ్డుగా మారిపోయింది. ఇప్పుడు రోడ్డుపనివాళ్ళు గాని, రోలరుగాని లేవు. రోడ్డు వేసేసి వెళ్ళిపోయారు. మూడురోజుల్లోనే ఆ దారి రూపం మారిపోయింది.

నాయుడు ఆనందంగా తన అనుచరుల్ని చూసి,

"మినిస్టరుగారితో అలా మాట్లాడానో లేదో, రోడ్డడి పోయింది చూశంద్రా!" అన్నాడు.

అనుచరులు ఆనందంగా తలలూపారు. "తంవరి మాటంటే ఆళ్ళకి యేదవాక్కు గదా దొరా!...." అన్నారు.

నవీన్‌కి ఆ రోడ్డు బాగుపడటం వెనుక నాయుడిహస్తముందన్న సంగతి అర్థమయ్యింది.

ఫారెస్టు క్వార్టర్సు దగ్గర లారీ ఆగింది.

తానేవాడో, గార్డో తెలియదు — యూనిఫాంలో వచ్చి స్వయంగా నాయుడు కూచున్నవైపు తలుపు తెరిచాడు. అంతదాకా కేబిన్‌లో నాయుడు, నవీన్, డ్రైవర్ కూచునివుంటే అనుచరుల్లో ఒకడు కేబిన్ మీద, యిద్దరు నాయుడి కాళ్ళ ముందు కూచుని ప్రయాణం చేశారు.

నవీన్, నాయుడికి ఆ కొత్త స్టాఫ్ అంతా బాగా తెలిసినవాళ్ళేనని అర్థమయిపోయింది.

"ఒక్క చెణంలో వొచ్చేస్తాను. కేబిన్‌లో యేం కూచుంటారు? కిందికి దిగి, యిక్కడ ఆఫీసరుగారింట్లో విశ్రాంతి తీస్కోండి. మేం పని పూర్తిజేసుకొస్తాం" అన్నాడు నాయుడు కిందకి దిగి నవీన్ వైపు చూస్తూ.

నవీన్ వెంటనే అందుకొని, "ఫరవాలేదండి, నేనిక్కడే కూచుంటాను. మీరు వెళ్ళి మాట్లాడి రండి!" అన్నాడు. తను దిగిపోతే, మళ్ళీ స్పాట్‌కి వెళ్ళే అవకాశముండదు. ఓపక్క తన గురించి విషకన్య సౌమ్య యెదురుచూస్తుంటారు.

నాయుడు "సరే, మీ యిష్టం!" అంటూ వెళ్ళి

పోయాడు ఫారెస్టాఫీసరు బంగళాలోకి. అక్కడ కరెన్సీ చేతులు మారుదని నవీన్‌కి తెలుసు. పైగా అక్కడి స్టాఫ్ అందరూ నాయుడికి మొన్నాళ్ళుగానో తెలిసిన వాళ్ళలాగా వున్నారు.

మూడు నెలల క్రితం వచ్చిన స్టాఫ్‌లో, మూడు నెలలుగా అడవిలోకి అడుగుపెట్టని నాయుడికి అంత దోస్తీ ఎప్పుడు యేర్పడిందో... నవీన్‌కి ఆశ్చర్యంగావుంది

డ్రైవర్ బీడీ ముట్టించుకుని ఓ పక్కగా నించుని కాల్చుకొంటున్నాడు. నవీన్ అతన్నుంచి సమాచారం సేకరించాడు

డ్రైవర్ కథనాన్నిబట్టి రాఘవేంద్రరావు అక్కడికి ఆఫీసరుగా రాకముందు వీళ్ళే యిక్కడ పని చేస్తూండే వారట. వీళ్ళని ట్రాన్స్‌ఫర్ చేసి, రాఘవేంద్రరావుని అతని స్టాఫ్‌ని అక్కడికి వేసుచేశారట. పాతవాళ్ళలో ఫీల్డ్ గోపాల్ మాత్రం వుండిపోయారట. వాళ్ళందరు ప్రమాదవశాత్తు చనిపోయారని చెప్పాడే గాని, వివరాలు చెప్పకుండా దాటేశాడు డ్రైవరు.

ఇంతలో నాయుడు ఫారెస్టాఫీసరు క్వార్టర్సునించి బయటికొచ్చారు. కూడా ఫారెస్టాఫీసరు వున్నాడు.

"ఈ ప్రమోషన్ యిప్పించింది మీరు. మీరు నా పర్మిషన్ అడగాలా నాయుడుగారూ! మేము మీ వాళ్ళం—ఈ అడవి మీది!...." అంటున్నాడు ఫారెస్టాఫీసరు. నాయుడు మీసాలు మెలేస్తూ హుందాగా నవ్వుతూ లారీ దగ్గర కొచ్చాడు. అతని అనుచరులు ముగ్గురు అప్పుడే యెక్కడికో వెళ్ళి తిరిగొచ్చారు.

"ఏరా గూడవాళ్ళకి చెప్పారా?" అనడిగాడు నాయుడు.

"చెప్పాం దొరా! అళ్ళప్పుడే గొడ్డళ్ళు తెచ్చుకుని పని మొదలెట్టేశారు" అన్నారు వాళ్ళు.

నాయుడు నవీన్ వంక చూసి, "మనం నడిచికెళ్దాం, రండి. లోడింగ్ కి చాలా టైముంది. ఈ లోపట ఓసారి చూసొచ్చి, ఆఫీసరుగారింట్లో విందు భోజనం చేద్దాం. ఆయనప్పుడే మనకోసం చెవులపిల్లుల మాంసం, పిట్ట మాంసం సిద్ధం చేసేస్తున్నారు. మంచి రుచిగుంటది మాంసం!" అన్నాడు లొట్టలేస్తూ.

ఆఫీసరు నాయుడి మాటలకి నవ్వుతున్నాడు. "మన గార్డు వొస్తాడు, తీసుకెళ్ళండి. ఠాణేదారు ఆ టెండర్ ఘాట్ రోడ్ కి వెళ్ళారు. వచ్చేస్తూంటారు. రాగానే మీ దగ్గరికి పంపుతా" అని చెప్పి ఆఫీసరు లోపలికి వెళ్ళి పోయాడు. తన గురించి పరోక్షంగా చెప్పేసినట్టున్నాడు నాయుడు__ఆఫీసిరు తన గురించి అడగలేదు, అదీ నయమే! అనుకున్నాడు నవీన్.

లారీ దిగాడు నవీన్. డ్రైవర్ అనుచరులు ముగ్గురు, గార్డు, నాయుడికి దూరంగా ఒదిగి నడుస్తున్నారు.

నవీన్ లో టెన్షన్ అధికమయ్యింది. విషకన్యకి తనిచ్చిన మాట నిలబెట్టుకునే సమయం ఆసన్నమయ్యింది. స్పాట్ కి చేరుతున్న కొద్దీ అతనిలో టెన్షన్ పెరిగి పోయింది.

నాయుడు నడుస్తూనే, అనుచరుల్లో ఒకడ్ని ఆఫీసరు యింటినుంచి కాఫీ తెమ్మని ఆజ్ఞాపించాడు.

నవీన్ పొదల్లో అలికిడి స్పష్టంగా విన్నాడు. రెండు సర్పాలు జరజర పాక్కుంటూ వెళ్తున్నాయి. అతని ముఖం వికసించింది!

విషకన్య అనుచరులు అప్పుడే సమాచారం సేకరించి

విషకన్యకి అందజేయటానికి వెళ్తున్నారు. విషకన్యకూడా ఈ పాటికి తాము అడవిలోకి ప్రవేశించటం చూసే వుంటుంది. అడవినిండా యే మూల చూసినా సర్పా లున్నాయి. తను ప్రత్యేకంగా కబురు చేయనవసరం లేదని అతనికి తెలుసు!

దూరంగా చెట్లు నరుకుతున్న శబ్దం వినిపిస్తోంది.

అప్పుడే కనుచీకటి పడుతోంది.

ఆటవికులు తాబోలు నలుగురు చెట్లను కొడ్తూ కనిపించారు. నాయుడి అనుచరులు ఇద్దరు, డ్రైవరు అక్కడికి చేరుకున్నారు వాళ్ళను సాయంగా. మూడో వాడింకా కాఫీ తీసుకురాలేదు.

అప్పుడే కాగడాలు కూడా ముట్టించారు.

చీకటి పూర్తిగా పడకపోయినా, కళ్ళు చికిలించి చూస్తే తప్ప యెక్కడ యేముందో కనిపించటంలేదు. కాగడాలు దగ్గరయ్యే కొద్దీ వెల్తురు ప్రకాశవంతంగా కనిపించింది.

నాయుడ్ని చూడగానే ఆటవికులు చేస్తున్న పని ఆపేసి, పడి పడి దండాలు పెట్టారు. నాయుడు హుందాగా నవ్వుతూ, మీసాలు మెలేస్తూ వాళ్ళని హుషారు చేశాడు.

నవీన్ వంక తిరిగి "చందనం చెట్లనుంచి తీసేపని చాలా కష్టమైంది. చాలా సమయం కావాలి. మీ రెళ్ళిపోండి ఆఫీసరు యింటికి, ఎల్లిపొమ్మని నా ఉద్దేశం గాదూ, మీరుండలేపోతే నే!" అన్నాడు నాయుడు.

నవీన్ చిర్నవ్వు నవ్వాడు. చుట్టూ పరిశీలనగా చూశాడు.

విషకన్య జాడ ఎక్కడా లేదు!

ఎలా? ఆమె కింకా తెలియదా? తెలియకపోవట మంటూ వుండదు. ఆమె చాలా శాపన్ గా వుంటుంది. తన ఆగమనం కోసం అనుక్షణం యెదురుచూస్తూ వుంటుంది.

నాయుడు అంతదాకా హుషారుగా కబుర్లు చెప్తున్న వాడల్లా చటుక్కున ఆగిపోయాడు. అతని కాళ్ళకేదో చుట్టుకుంటున్నట్టు అనిపించింది. కాళ్ళవైపు చూసి ఉలిక్కిపడ్డాడు.

ఒకటి కాదు, రెండు కాదు— దాదాపు పది సర్పాలు అతన్ని చుట్టేశాయి, కాళ్ళు కదిపితే కాటందుకునేందుకు సిద్ధంగా వున్నాయి.

గగుర్పాటుతో, భయతో, జలదరింపుతో వెంటనే నోటినుంచి మాటరాలేదు నాయుడికి.

"ఒరే, పాములు!...." అని అరిచాడొక్కసారిగా.

ఆటవికులు నలుగురు, దొరగారు, నాయుడి యిద్దరు అనుచరులు ఉలిక్కిపడి చూశారతనివైపు. గార్డు చేతిలో గన్‌తో పరుగెత్తుకు వచ్చాడు.

* * *

గార్డు గన్ గురిచూసి సర్పాలవైపు కాల్చబోయాడు. అంతే! ఒక్కసారిగా నేలకూలిపోయాడు. ఒకేసారి పది పదిహేను సర్పాలు అతన్ని కాటందుకున్నాయి.

ఆటవికులు గొడ్డళ్ళు తీసుకుని నాయుడి దగ్గరకు పరుగెత్తుకు వచ్చారు. దొరగారు, యిద్దరు అనుచరులు చేతి కందిన కట్టెలతో నాయుడి దగ్గరకు పరుగెత్తుకొచ్చారు. నాయుడు నిలువెల్లా వణికిపోతున్నాడు. అతని ఒళ్ళంతా చెమటలతో తడిసిపోయింది.

సరిగ్గా అప్పుడే ఓ వికటాట్టహాసం వినిపించింది.

అందరు అటు చూశారు. చేతిలో కాగడాతో మరో చేతిలో పట్టాకత్తితో విషకన్య పకపక నవ్వుతూ కనిపించింది.

"ఎవర్నువ్వు? ఏమిటా నవ్వు?" అంటూ అరిచాడు నాయుడు కీచుస్వరంతో.

"నేనా? నేనేరా నీ పాలిటి మృత్యువుని. ఫారెస్టాఫీసరు రాఘవేంద్రరావుగారి అమ్మాయిని. జ్వలితను!" అంది విషకన్య నిప్పులుకురిపించే చూపుల్తో అతన్ని చూస్తూ.

నాయుడు నిశ్చేష్టుడైపోయాడు. డ్రైవరు, అనుచరులు, ఆటవికులు చేష్టలుడిగి అటే చూస్తున్నారు.

"ఏం, ఆశ్చర్యంగా వుందా? ఇంకా బతికేవున్నానని కన్ఫ్యూజ్‌గా వుందా? నిన్ను చంపకుండా ఎలా చస్తాననుకున్నావు. నా కన్నతండ్రిని, డ్యూటీనే దైవంగా భావించే ఉన్నతమూర్తిని పట్టాకత్తితో కాస్సేపటిలో నరికి అతి దారుణంగా చంపావే, నీకు చేతులెలా వచ్చాయి? నువ్వు మనిషివి కాదు. రాక్షసుడివి! రాక్షసుడినెలా శిక్షించాలో నాకు తెలుసు." జ్వలిత ఒక్కొక్క అడుగే ముందుకేస్తూ వస్తోంది.

నాయుడి కాళ్ళు చేతులు సర్పాలు బంధించేశాయి. ఆటవికులు గొడ్డళ్ళతో నరకాలని చేసిన ప్రయత్నాలు విఫలమయ్యాయి.

ఎదురుగా కొన్ని వందల సర్పాలు పడగవిప్పి బుస్‌మంటూ ఫీత్కారాలు చేస్తూ కాళ్ళు కదిపితే కళ్ళుబాటి చెయ్యటానికి సిద్ధంగా వున్నాయి.

"నువ్వు రాఘవేంద్రరావుగారి కూతురివా?" నాయుడి నోట మరి మాటలు రాలేదు.

డ్రైవరు, అతని అనుచరులు పారిపోబోయారు. కాని

వాళ్ళ కట్టెదుట బ్రహ్మాండమైన సర్పం — ఆదిశేషువులా పెద్దగా పడగవిప్పిన ఉగ్రనాగు!

వాళ్ళ ప్రాణాలు పైనే పోయాయి.

జ్వలిత నాయుడ్ని సమీపించింది.

"నువ్వు రాఘవేంద్రరావుగారి కూతురివి కాదు. ఇంత చల్లగా వుండదు ఆడి కూతురు!" నాయుడు అరుస్తున్నాడు. మృత్యుదేవతలా తనమీదకు ఉరుకుతున్న జ్వలితను చూసి పిచ్చిగా అరుస్తున్నాడు.

సరిగ్గా అప్పుడే కాఫీ ఫ్లాస్కులో వచ్చిన నాయుడి అనుచరుడు అక్కడి దృశ్యాన్ని చూసి తారెత్తి పారిపోబోయాడు. అంతలోనే ఢామ్మని గన్ పేల్చిన శబ్దం!

అనుచరుడు నేలకూలిపోయాడు. సౌమ్య చేతిలో గన్ తో ప్రత్యక్షమయ్యింది.

విషకన్యగా పరిచయమైన జ్వలిత ఒక్క అంగలో డ్రైవర్ని సమీపించి "ఏరా, నా తండ్రిని చంపటానికి యీ నాయుడికి సాయం చేస్తావా, అనుభవించు!" అంటూ అతని చెయ్యి అందుకుని కసుక్కున కొరికింది.

అంతే. డ్రైవరు నురగలు కక్కుకుంటూ నేలమీద పడి గిలగిల కొట్టుకున్నాడు. అది చూసిన ఆటవికులు గొడ్డళ్ళు జ్వలితమీదికి విసిరారు. జ్వలిత పక్కకు తప్పుకొంది. గొడ్డళ్ళు నాయుడి అనుచరులిద్దరికీ తలమీద బలంగా తగిలాయి. వాళ్ళు కుయ్యోమొర్రోమంటూ నేలమీద దొర్లిపోయారు.

సరిగ్గా అప్పుడే ఉగ్రనాగు నలుగురు ఆటవికుల ముఖాలమీదకు చర్రున విషాన్ని విరజిమ్మింది. అంతే! వాళ్ళు దిక్కుతోచక కళ్ళు పోయి, పిచ్చివాళ్ళలా

పరుగులు పెట్టారు. సర్పాలు వాళ్ళని తరిమి తరిమి కాటు వేశాయి.

నాయుడి పై ప్రాణాలు పైనే పోయాయి. కదల టానికి వీల్లేకుండా పగ్గాల్లా కట్టిపడేశాయి సర్పాలు.

రెండు చేతులు జోడించి జ్వలితను చూసి "నన్ను క్షమించి వొదిలెయ్యి తల్లీ. బుద్ధిగలిగి వుంటాను" అన్నాడు.

జ్వలిత వికటాట్టహాసం చేస్తూ నాయుడి ముకుళిత హస్తాల్ని విడదీసింది కత్తితో.

అంతే! మరుక్షణం అడవి దద్దరిల్లిపోయేటట్టుగా చావుకేక పెట్టాడు నాయుడు.

అతని రెండు చేతులు భుజాలవరకు నరికేసింది జ్వలిత! సర్పాలు అతన్ని వదిలేసి పక్కకు తప్పుకున్నాయి.

జ్వలిత యీసారి అతని రెండుకాళ్ళూ నరికేసింది!

మహాపర్వతంలా నేలకూలిపోయాడు నాయుడు.

జ్వలిత నాయుడి కళ్ళలోకి సూటిగా చూసి, "నా తండ్రిని యే స్పాట్‌లో చంపావో, నిన్నూ అదే స్పాట్‌లో చంపాను—ఆయన్ని చంపిన లాంటి పట్టా కత్తితోనే నిన్నూ చంపాను. నీతో నా శత్రువులందరు చచ్చారు. నాకిప్పుడు చాలా ఆనందంగా వుందిరా నాయుడూ! స్వర్గంలో వున్న నా తల్లి దండ్రుల ఆత్మలు శాంతిస్తాయి" అంటూ నాయుడి కంఠాన్ని ఉత్తరించింది. ఆ తర్వాత అతని శరీరాన్ని మూడు ఖండాలుగా నరికేసింది.

బీభత్సకరంగా వున్న ఆ దృశ్యాన్ని చూడలేక సౌమ్య కళ్ళు మూసుకొంది. నవీన్‌లాంటి మగవాడి కూడా ఒళ్ళు జలదరింపజేసే దృశ్యం అది! జ్వలిత ఆనందంగా

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 15 వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా 'రిజిష్టరు పోస్టు'లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి— దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 84/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. పోస్టులో పోయే సమస్య ఎంత మాత్రం లేదు. ఇంకా నెలనెలా V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి.

నవ్వుతోంది. పిచ్చిగా నవ్వుతోంది. ఒళ్ళంతా కదిలి పోయేలా నవ్వుతోంది.

ఎదురుగా ఖండ ఖండాలుగా చీలిపోయిన నాయుడు రక్తంమడుగులో నిర్జీవంగా పడిపడున్నాడు. జ్వలిత అతని రక్తం తీసుకొని సింధూరంలా పెట్టుకొంది.

ఆమె యిప్పుడు నవ్వటంలేదు. మౌనంగా మహర్షిలా చాలా సేపు అలాగే నిల్చుండిపోయింది.

సరిగ్గా అప్పుడే ఎవరో హడావిడిగా అక్కడకు పరుగెత్తుకొస్తున్న శబ్దం వినిపించింది.

జ్వలిత సౌమ్యను, నవీన్‌ను చూసి, "ఫారెస్టాఫీసరు, అతని స్టాఫ్ వస్తూన్నట్టుంది. మీరు నా వెంట పరుగెత్తండి. అరగంటలో యీ అడవి దాటించేస్తాను. కమాన్, క్విక్!" అన్నది.

ముందు జ్వలిత, ఆమె వెనుక సౌమ్య, వెనుకగా నవీన్ పరుగుపెట్టారు.

ఉగ్రనాగు వారి వెంట ఉరుకుతుండగా అనుచర సర్పాలు కూడా ఉరికాయి.

జ్వలిత "ఉగ్రనాగూ! మీరు రావద్దు. మేము వెళ్తాం!" అంది. అంతే! ఉగ్రనాగుతోబాటు సర్పా లన్నీ ఆగిపోయాయి.

జ్వలిత క్వార్టర్సు దగ్గరకు వాళ్ళను మరోదారిన తీసుకెళ్ళింది. అక్కడ సెంట్రీ తప్ప ఎవరూ లేరు. క్వార్టర్సు ముందు లారీ వుంది.

సెంట్రీ వాళ్ళని చూసి ముందుకొచ్చి గన్ గురిపెట్టబోయాడు సౌమ్య చేతిలోంచి గన్ తీసుకుని కాల్చేసింది జ్వలిత. సెంట్రీ నేలకూలిపోయాడు.

జ్వలిత సౌమ్యని లారీ కేబిన్‌లోకి ఎక్కించింది.

"నవీన్, నువ్వు వెంటనే ఘాట్ రోడ్ దాటి బస్టాండ్ కి తీసుకుపో లారీని. ఇప్పుడు ఏడున్నర కావొస్తోంది. తొమ్మిదిగంటలకు హైద్రాబాద్ వైపు పోయే బస్ వుంది. హరియప్!" అంది.

"మరి నువ్వు?" అన్నాడు నవీన్ జ్వలితవంక చూసి.

"నా సంగతి ఒదిలెయ్. బై! గుడ్ బై ఫరెవర్! నేనిక్కడే వుండి ఫారెస్టు స్టాఫ్ వల్ల మీకు ఆటంకాలేమీ లేకుండా చూసుకుంటాను. గో అహెడ్!" అరిచింది జ్వలిత.

నవీన్ లారీ స్టార్ట్ చేశాడు.

సౌమ్య చేతులెత్తి జ్వలితకు నమస్కరించింది. నవీన్ చేతులూపి ఆమె నుంచి వీడ్కోలు తీసుకున్నాడు. లారీని ఘాట్ రోడ్ ఎక్కించాడు.

మరో గంట తర్వాత నవీన్, సౌమ్య హైదరాబాద్ పోయే బస్ లో పక్క పక్కన కూచుని వున్నారు. సౌమ్య అతని భుజమ్మీద తల ఆన్చి రిలాక్సింగ్ గా కూచుని వుంది. నవీన్ జ్వలిత నే తల్చుకొంటూ చీకట్లోకి చూస్తున్నాడు.

ఇద్దరు మాట్లాడుకోవటంలేదు. ఇద్దరి మనుసులు భారంగా వున్నాయి.

బస్ వేగంగా ముందుకి పోతోంది.

ఆ తర్వాత ఆ అడవుల్లో విషకన్యను చూసినవారెవరూ లేరు.

—: అయిపోయింది :—

## అంకితం

సప్తచలాధీశుడు, కళ్యాణచక్రవర్తి శ్రీనివాసుని పాదపద్మములకు భక్తిప్రపత్తులతో, —రచయిత

